CI




'బాలికలు-భద్రత' అంశంపై జరిగిన సెమినార్‌లో మహిళా కమీషన్ ఛైర్‌పర్సన్ శ్రీమతి త్రిపురాన వెంకటరత్నం



"చట్టసభలు-మహిళా భాగస్వామ్యం" అంశపై జరిగిన సెమినార్‌లో ఐద్వా ఆలిండియ ఉపాధ్యక్షురాలు సుభాషిణి ఆలి



విశాఖ సదస్సులో ప్రసంగిస్తున్న ఐద్వా కేంద్ర నాయకురాలు స్మితా గుప్త



ఎవరెస్ట్ 'మలావత్ పూర్ణకు' సన్మానం



సౌహార్ద సందేశమిస్తున్న వ్యకాసం నాయకులు పి. మురళీకృష్ణ



మహాసభ సందర్భంగా జరిగిన ర్యాలీ



'కట్టుబాట్లను తెంచుకుందాం' అన్న నినాదంతో బాలికలు



బహిరంగ సభ వేదికపై మహిళా నాదస్వర బృందం

చైతన్య మానవి

# నా ఎంపిక - నా హక్కు

**సంపాదకీయం...**

మహిళల స్థాయిని చూసి ఒక దేశం పరిస్థితి ఎలా ఉందో చెప్పవచ్చు. కొంత మంది మహిళలు పలురంగాల్లో మహోన్నత స్థానాలు అధిరోహిస్తూ వుండవచ్చుగాక దానిని బట్టి మహిళలందరూ ప్రగతిబాటలో ఉన్నారని అర్థం కాదు. మహిళా సాధికారిత అంటూనే మహిళల సమస్యలను పట్టించుకోని పాలకవర్గాలు, రాజ్యాంగం కల్పించిన హక్కులను సైతం కాలరాస్తున్నాయి. 'స్వతంత్ర భారత్'లో అచ్చే దిన్ కార్పొరేట్లకే తపప మహిళలకు కాదని తేలిపోయింది. ఇటీవల కాలంలో మహిళలపై హింస మరింత వికృత రూపం దాల్చింది. రాజధాని నగరంలోనే అతివలకు రక్షణ లేకుండా పోయిందనడానికి జాతీయ నేర గణాంకాల బ్యూరో నివేదికే తార్కాణం.

'నా ఎంపిక నా హక్కు' (రైట్ టు ఛాయిస్) అన్న నినాదంతో నవంబర్ 25 (హింసా వ్యతిరేక దినం) నుండి డిశంబర్ 10 (మానవ హక్కుల దినం) వరకు 15రోజులపాటు ఐద్వా దేశవ్యాపితంగా ప్రచారోద్యమం నిర్వహించింది. అమ్మ కడుపులో పడినప్పటినుండే ఆడపిల్లలను హతమార్చేందుకు కుట్ర జరుగుతోంది. గడిచిన 3 దశాబ్దాలలో దేశంలో కోటి ఇరవై లక్షల మందికి పైగా ఆడపిల్లలు అదృశ్యమయ్యారని అమర్త్యసేన్ చెప్పారు. మహిళల అక్షరాస్యత శాతం 57.24 శాతానికి మించలేదు. బాల్య వివాహ నిరోధక చట్టం వున్నా ప్రపంచ బాల్య వివాహాల్లో 45 శాతం భారత్‌లో జరుగుతున్నాయి. వరకట్న రక్కసికి దేశంలో గంటకో నవ వధువు బలవుతోంది. సరళీకరణ విధానాల అమలు తర్వాత స్త్రీలు, బాలికలపై అత్యాచారాలు 900 శాతం పెరిగాయి. మన రాజ్యాంగం కుల, జాతి, లింగ వివక్షత ఉండకూడదని చెప్తున్నది. 1956 ఒకే కులం, మతంలోని పెళ్ళిళ్లే ప్రామాణికం అన్న నిబంధనను తోసిపుచ్చి చట్టబద్ధమైన వివాహాలకు ఇటువంటి హద్దులేమి ఉండకూడదన్న చట్టాన్ని తెచ్చుకున్నాం. మన మనస్సుకు నచ్చిన వ్యక్తిని ఎంపిక చేసుకునే హక్కును బలపరిచింది. ఈనాడు యువతీ యువకులు తమకు నచ్చిన వారిని వివాహం చేసుకునేందుకు సమాజం నుంచీ, కుటుంబం నుంచీ వ్యతిరేకతను ఎదుర్కోవల్సి వస్తుంది. మహిళలకు చదువుకునే అవకాశాలు పెరిగాయి. రకరకాల వృత్తులలో మహిళలకు అవకాశాలు పెరగడం వలన తన భాగస్వాములను ఎంచుకునే అవకాశాలు పెరుగుతున్నాయి. కుటుంబం, సమాజంలో ఈనాటికీ కొనసాగుతున్న కుల రక్కసితో ఈ వివాహాలను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నవారున్నారు. ఇది ఆఖరికి హత్యలవరకు వెళ్తోంది. ఈ కుల దురహంకార హత్యలకు గౌరవహత్యలు లేదా పరువు హత్యలు అని ముద్దుపేరు పెట్టారు. ఢిల్లీ భావన, హర్యానా మనోజ్, బాబ్లి ,గుంటూరు:శ్వేత హత్యలు ఈ కోవకు చెందినవే.

రాజకీయాలు, ప్రజాస్వామ్య విలువలు మతతత్వవాదుల చేతులలోకి వెళ్ళడమే ఇందుకు ప్రధాన కారణం. ఎం.పిలు, ఎమ్మెల్యేలు, పెద్దపెద్ద అధికారులు, పోలీసు, న్యాయవ్యవస్థలోని ఉన్నతాధికారులు కూడా మహిళల హక్కుల పట్ల అవగాహన లేకుండా మాట్లాడడం, తీర్పులు ఇవ్వడం మనం చూస్తున్నాం. వీరే తమ కులగౌరవాన్ని కాపాడే పెద్దమనుషుల అవతారం ఎత్తడం వలన 'గౌరవ'నేరాలు యథేచ్ఛగా సాగిపోతున్నాయి. వీటిని నేరాలుగానే పరిగణించాలన్న జస్టిస్ వర్మ పిలుపు చెవిటివాని ముందు శంఖం అయింది. ఈ విషయంలో, ఐద్వా తయారుచేసిన బిల్లు ప్రభుత్వం దగ్గర దుమ్ముకొట్టుకుపోతున్నది. అన్ని కులాలలోని మితవాదులు స్త్రీలనే లక్ష్యంగా పెట్టుకొని కుటుంబం, కులపెద్దలు కుదిర్చిన వారినే వివాహం చేసుకోవాలని నిర్బంధం చేస్తున్నారు. అందునా ఇప్పుడు బిజెపి, ఆర్ఎస్ఎస్ ఆధ్వర్యంలో హిందూ హక్కులు కాపాడాలన్న పేరుతో సాగిస్తున్న విద్వేష ప్రచారంలో మహిళలు తమకు నచ్చిన వారిని పెళ్ళి చేసుకునే హక్కు మరింతగా హరించుకుపోయే ప్రమాదమేర్పడింది.

మహిళా సాధికారిత పలుకులు కాగితాలకే పరిమితం చేసి మహిళల జీవితాలను అధోగతి పాల్జేస్తున్న ప్రభుత్వ విధానాలను వ్యతిరేకించాలి. రాజ్యాంగం కల్పించిన సమానహక్కుల కోసం చైతన్యంతో ఉద్యమించాలి. విద్య, ఉద్యోగాలు, ఆరోగ్యం, చట్టసభలలో సమ భాగస్వామ్యం, భద్రతకోసం పోరాటాలు ఉధృతం చేయాలి. మహిళలను సెక్స్ సింబల్‌గానో, వంటింటి కుందేలుగానో, పిల్లల్నికనే యంత్రంగానో పరిగణించే దుర్దశ దాటి సకల రంగాల్లో సమాన అవకాశాల కోసం కోటి గొంతుకలతో నినదించాలి. నాఎంపిక-నాహక్కు'(రైట్‌టుఛాయిస్)కై మరింత గట్టిగా గళం విప్పాలి. మహిళల హక్కులూ మానవహక్కులేనని చాటాలి.

# చైతన్య మానవి



**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఎ.పి. రాష్ట్ర కమిటీ**

చిరునామా :
బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్ : 2, 1-8-1,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 27605845.

e-mail chaitanyamanavi@gmail.com

సంపాదకులు

**డి. రమాదేవి**

సంపాదక వర్గం

**కె. స్వరూపరాణి**

**బి. ప్రభావతి**

మేనేజర్

**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

**ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్, హైదరాబాద్ - 500 044.**

**ఈ సంచికలో...**

# నవ్యాంధ్రప్రదేశ్‌లో
# మహిళా భద్రత - సాధికారితకై
# 13వ రాష్ట్ర మహాసభ పిలుపు

- కె. స్వరూపరాణి

అఖిలభారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) 13వ రాష్ట్ర మహాసభలు సెప్టెంబర్ 26నుండి 28వరకు విజయవాడ నగరంలో శ్యామిలీగుప్తా నగర్ (మాంటిసోరీ విద్యాలయం)లో అత్యంత ఉత్సాహపూరిత వాతావరణంలో జరిగాయి. 13 జిల్లాలనుండి 500 మంది ప్రతినిధులు సభకు హాజరయ్యారు. ఆంధ్రప్రదేశ్ పునర్విభజన తరువాత ఈ మహాసభలు జరిగాయి. నూతన రాష్ట్రంలో మహిళల రాజకీయ సామాజిక ఆర్థిక సమస్యలపై మహాసభలో కూలంకుషంగా చర్చలు జరిగాయి. సరళీకరణ విధానాలు అమలు జరుగుతున్న నేపథ్యంలో మహిళల సమస్యలు మరింత పెరిగాయి. మహిళలు, బాలికల భద్రత ప్రశ్నార్థకంగా మారింది. హింస మహిళల జీవితంలో అంతర్భాగమైంది. నవ్యాంధ్రప్రదేశ్‌లో మహిళల భద్రత-సాధికారితకై 13వ రాష్ట్ర మహాసభ పిలుపునిచ్చింది. ఆ దిశగా సమగ్ర దృష్టితో నిర్దిష్ట కార్యాచరణతో మహాసభ భవిష్యత్తు కర్తవ్యాలను రూపొందించింది.

26వ తేది 13 జిల్లాల నుండి తరలివచ్చిన వేలాదిమంది మహిళలతో భారీ ప్రదర్శన జరిగింది. మహిళల భద్రత, సాధికారిత 1/3 వంతు రిజర్వేషన్లు, డ్వాక్రా ఋణమాఫీ వెంటనే అమలుచేయాలని, స్కీంవర్కర్లకి ఉద్యోగ భద్రత, వేతనాలు పెంచాలని, మద్యాన్ని నియంత్రించాలని, అధిక ధరలు అరికట్టాలని, నగదు బదిలీ వద్దనే నినాదలతో విజయవాడ వీధులు మారుమోగాయి. అగ్రభాగాన నవ్యాంధ్ర ప్రదేశ్‌లో మహిళా భద్రత - సాధికారిత అనే బ్యానర్‌తో అఖిలభారత నాయకులు బృందాకరత్, మాలినీ భట్టాచార్య, సుధా సుందరరామన్, రాష్ట్ర నాయకత్వం నడవగా వివిధ జిల్లాల బ్యానర్లతో తుమ్మలపల్లి కళాక్షేత్రంనుండి ప్రదర్శన జింఖాన గ్రౌండ్ వరకు సాగింది. ర్యాలీ ముందు భాగాన మహిళల సమస్యలను ప్రతిబింబింపచేస్తూ విచిత్ర వేషాలు, డప్పులు, కోలాట దళాలు,




ఖడ్గం చేతపూని గుర్రంపై ఝాన్సీ లక్ష్మీభాయి, మహిళా శక్తి అవతారంతో మృగాడివధ, ఎక్కడమ్మా నువ్వులేనిది వేషధారణతో చిన్నారులు ప్రదర్శన మూఢాచారాలు, లింగవివక్ష, పరువు హత్యలు ప్రతిఘటిస్తామని సందేశాత్మక విచిత్ర వేషాలు ప్రజలను విశేషంగా ఆకర్షించాయి.

జింఖానా గ్రౌండ్‌లో సుబ్బరావమ్మ అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో ఐద్వా జాతీయ నేత బృందాకరత్ ప్రసంగిస్తూ మహిళలు, బాలికలపై ప్రతి మూడు నిమిషాలకు ఒక అఘాయిత్యం జరుగుతుంది. ఇంటా, బయటా భద్రత కరువైన దేశంలో అభివృద్ధి ఎలా జరుగుతుందని ప్రశ్నించారు. నేడు మహిళల ఆర్థిక స్వావలంబన తాకట్టుపెట్టేలా వారి శరీరాలను సరుకుగా మార్చుతున్నారని వాటిపై వ్యాపారం చేస్తున్నారని విమర్శించారు. సరళీకరణ విధానాలు మోడీ ప్రభుత్వం మరింత వేగవంతంగా అమలుజేస్తోంది. కార్పొరేట్ శక్తుల ఆధీనంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నడుస్తున్నాయి. సంపన్న వర్గాలకు లక్షలకోట్లు రాయితీలిచ్చే ప్రభుత్వాలు పేదల సంక్షేమానికి ఇచ్చే సబ్సిడీలపై కోత పెడుతున్నారు. పేదలకు ఊరటనిచ్చే ఉపాధిహామీని కుదించే ప్రయత్నాలు కేంద్రప్రభుత్వం ప్రారంభించింది.

లిక్కర్‌ద్వారా కోట్ల రూపాయల ఆదాయంకోసం ప్రభుత్వంవిచ్చలవిడిమద్యం అమ్మకాన్ని ప్రారంభించారు. దీనిద్వారా కుటుంబాలు అధోగతి కావటమే కాక మహిళలపై హింసను పెంచుతున్నాయి. చట్ట సభలలో మహిళా రిజర్వేషన్ బిల్లు ఆమోదం కాలేదు. కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ ప్రభుత్వాలు మారిన నేపథ్యంలో మహాసభలు జరుగుతున్నాయి. రాష్ట్ర భవిష్యత్తు మహిళాభివృద్ధితో ముడిపడి ఉన్నందున నూతన రాష్ట్రంలో ఆ దిశగా ప్రభుత్వ నిర్ణయాలు ఉండాలన్నారు. రైతు, డ్వాక్రా, చేనేత ఋణమాఫీ చేస్తామని ఎన్నికల

వాగ్దానం ఛూ మంతర్‌గా మారిందని ఎద్దేవా చేసారు. మహిళా సమస్యల పరిష్కారం కొరకు సంఘటిత ఉద్యమాలు నిర్వహించాలని పిలుపునిచ్చారు. ఐద్వా జాతీయ అధ్యక్షురాలు మాలినీ బట్టాచార్య అసంఘటిత రంగంలో పనిచేస్తున్న కార్మికులను శ్రమదోపిడికి గురిచేస్తూ కార్పొరేట్ సంస్థలకు ప్రభుత్వాలు లాభాలు పండిస్తున్నాయి. మరోపక్క మతత్వాన్ని ముందుకు తెస్తున్నారు. మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్‌లో మత ఘర్షనలు పెరుగుతున్నాయి. మతతత్వం మహిళలకు మరింత ప్రమాదకరమైంది వీటిని తిప్పికొట్టాలని లేకుంటే తిరోగామి శక్తులు, భావాలు వ్యాపిస్తాయని పేర్కొన్నారు.

బహిరంగం సభలో 13 సంవత్సరాల పిన్న వయస్సులోనే ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన మలావత్ పూర్ణను ఐద్వా నాయకత్వం ఘనంగా సత్కరించి పూర్ణకు జేజేలు పలికింది. పూర్ణ సభలో ప్రసంగిస్తూ అమ్మాయిలకు తగు ప్రోత్సాహం ఉంటే ఏదైనా సాధించగలరని, అనుకున్న లక్ష్య సాధనకు పేదరికం అడ్డుకాదని ఆత్మ విశ్వాసం, పట్టుదల తనను ఎవరెస్టు ఎక్కేలా చేసిందన్నారు. తల్లితండ్రులు పిల్లల్లో ఉన్న ప్రతిభాపాటవాలను గుర్తించి ప్రోత్సహించాలిగానీ పిల్లలపై తమ అభిప్రాయాలు బలవంతంగా రుద్దకూడదన్నారు. పూర్ణ ప్రసంగానికి సభికుల నుండి కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. సభలో జాతీయ ఉపాధ్యక్షులు సుధాసుందరామన్, రాష్ట్ర కార్యదర్శి స్వరూపరాణి, ఎస్. పుణ్యవతి ప్రసంగించారు.

27వ తేదీ ఉదయం శ్యామిలీ గుప్తా నగర్‌లో ఉపాధ్యక్షురాలు పుతుంబాక భారతిగారు జండావిష్కరణతో ప్రతినిధుల సభ ప్రారంభమైంది. ఈ కాలంలో అసువులు బాసిన శ్యామిలీగుప్తా, కెప్టెన్ లక్ష్మీసెహగల్, డా॥ టాన్యా మొదలైన వారికి మహసభ సంతాపం తెలియజేసింది. ఆహ్వానసంఘ అధ్యక్షురాలు డా॥ వెల్లంకి శ్రీదేవి అధ్యక్ష ఉపన్యాసం చేసారు. జాతీయ అధ్యక్షురాలు మాలినీ భట్టాచార్య ప్రారంభోపాన్యాసం చేస్తూ రాష్ట్ర విభజన తరువాత జరుగుతున్న మహాసభ మహిళాసమస్యలను చర్చించుటతో పాటు ప్రభుత్వ విధానాలతో మారుతున్న సమస్యలను కూడా చర్చించి కర్తవ్యాలను రూపొందించాలి. ఈ రోజు మనల్ని చాలామంది ఇన్నేళ్లుగా మీరు పోరాడి సాధించిందేమిటని ప్రశ్నిస్తున్నారు. వారికి నేనొకటి చెప్పదలిచాను. మహిళల వివక్షత పోవాలి, అన్ని రంగాల్లో స్త్రీ, పురుష సమానత్వంకోసం పోరాడుతున్న మనం సాధించిన విజయాలకు ప్రత్యక్ష సాక్షులు పూర్ణ, సంతోషి. వీరిద్దరూ మన పోరాటంవల్ల కాకపోయినా వారి కృషి ఫలితంగా విజయం సాధించినా ఆ అవకాశాలను కల్పించేందుకు 1936నుండి మనం చేసిన పోరాటాలు ఉపయోగపడ్డాయి. దేశవ్యాపితంగా మహిళలపై హింస పెరుగుదల మహిళా ఉద్యమానికి గొడ్డలిపెట్టు. మోడీ అభివృద్ధి గురించే మాట్లాడుతున్నారు. రాజకీయాలు నేరపూరితమయ్యాయి. పశ్చిమబెంగాల్‌లో తృణముల్ ఎంపి తపస్‌పాల్ సిపిఎంకు మద్దతిచ్చిన మహిళలను బయటికి లాగి రేప్‌చేయమని పిలుపునిచ్చాడు. బెంగాల్‌లో ప్రజాస్వామ్యం ఖూనీ అయ్యింది. అత్యాచారాల్లో దేశంలోనే పశ్చిమబెంగాల్ అగ్రగామిగా మారింది. అయినా బెంగాల్‌లో దీనికి ఎదురొడ్డి ఐద్వా మహిళలు పోరాడుతున్నారు. మహిళా ఉద్యమాలను విచ్ఛిన్నం చేయడానికి, మహిళల్లో మతం పేరుతో విభజన రేపేందుకు మతోన్మాద శక్తులు ప్రయత్నిస్తున్నాయన్నారు. మహిళల హక్కుల సాధనకు ఐక్యంగా ఉద్యమించాలని పిలుపునిచ్చారు. ప్రారంభసభకు విశిష్ట అతిధిగా హాజరయిన కామన్‌వెల్త్ వెయిట్ లిఫ్టర్ విజేత మత్స సంతోషి మాట్లాడుతూ పేదరికం ప్రతిభకు అడ్డం కాదని నిరుపేద కుటుంబంలో పుట్టినా విద్యతో పాటూ క్రీడల్లో తమ పిల్లలు రాణించేలా తల్లితండ్రులు ప్రోత్సహించడంవల్లే నేను ఈ స్థాయికి చేరగలిగానని అన్నారు. తల్లితండ్రులు పిల్లల అభిష్టాలకు విలువనివ్వాలని అలాగే తల్లితండ్రులకు కీర్తి ప్రతిష్టలు తీసుకువచ్చేలా పిల్లలు వ్యవహరించాలని ప్రసంగించారు. దేశ పతాకాల లిస్టులో కీర్తి ప్రతిష్టలు తెచ్చిన మత్స సంతోషికి ఐద్వా నాయకత్వం ఘనంగా సత్కరించింది. ప్రారంభసభలో కృష్ణాజిల్లా ముదినేపల్లి మండలం కానుకొల్లు గ్రామంలో కుల బహిష్కరణకు గురై ఐద్వా అండదండలతో పోరాడి విజయం సాధించిన ప్రమీల తన పోరాట గాధను వివరించారు. గుంటూరుకు చెందిన చెన్ను లక్ష్మి ఆడపిల్లను కన్నందుకు ఇంటా, బయట అవమానాలు, వేధింపులకు గురై మగపిల్లవాడికోసం సృష్టి సంతాన సాఫల్య కేంద్రాన్ని ఆశ్రయించి ఏ రకంగా మోసగింపబడింది ఐద్వా సహకారంతో పోరాటంచేసింది వివరించింది. కర్నూలుకు చెందిన జయలక్ష్మి వరకట్నంకోసం తన కూతుర్ని అత్తింటివారు సజీవదహనం చేసారని నేరస్థులకు శిక్షపడాలని పోరాటాన్ని సాగిస్తున్నది.

**లిక్కర్‌ద్వారా కోట్ల రూపాయల ఆదాయంకోసం ప్రభుత్వంవిచ్చలవిడిమద్యం అమ్మకాన్ని ప్రారంభించారు. దీనిద్వారా కుటుంబాలు అధోగతి కావటమే కాక మహిళలపై హింసను పెంచుతున్నాయి. చట్ట సభలలో మహిళా రిజర్వేషన్ బిల్లు ఆమోదం కాలేదు. కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ ప్రభుత్వాలు మారిన నేపథ్యంలో మహాసభలు జరుగుతున్నాయి. రాష్ట్ర భవిష్యత్తు మహిళాభివృద్ధితో ముడిపడి ఉన్నందున నూతన రాష్ట్రంలో ఆ దిశగా ప్రభుత్వ నిర్ణయాలు ఉండాలన్నారు. రైతు, డ్వాక్రా, చేనేత ఋణమాఫీ చేస్తామని ఎన్నికల వాగ్దానం ఛూ మంతర్‌గా మారిందని ఎద్దేవా చేసారు. మహిళా సమస్యల పరిష్కారం కొరకు సంఘటిత ఉద్యమాలు నిర్వహించాలని పిలుపునిచ్చారు.**

రాష్ట్ర కార్యదర్శి స్వరూపరాణి గత మూడు సంవత్సరాలుగా ఐద్వా నిర్వహించిన పోరాటాలు, సాధించిన విజయాలు ,అధిగమించాల్సిన నిర్మాణ బలహీనతలు భవిష్యత్తు కర్తవ్యాల నివేదికలను సభలో ప్రవేశపెట్టారు. కార్యదర్శి ప్రవేశపెట్టిన నివేదికపై 13 జిల్లాలనుండి 30మంది ప్రతినిధులు చర్చల్లో పాల్గొన్నారు. ఐద్వా నిర్వహిస్తున్న కుటుంబ న్యాయసలహా కేంద్రం పనివిధానంపై అడ్వాయిజర్ జి. శాంతి రిపోర్టును సభకు తెలియజేసారు. బాలిక విద్యను ప్రోత్సహించి ఎల్.కె.జి నుండి పి.జి వరకు విద్యాసంస్థలను అభివృద్ధిపరిచిన మాంట్‌సోరీ విద్యాసంస్థల అధినేత కోటేశ్వరమ్మగారిని మహాసభ ఘనంగా సత్కరించింది. జాతీయ ఉపాధ్యక్షురాలు సుధా సుందరామన్ ప్రతినిధులనుద్దేశించి గ్రామస్థాయి వరకు కమిటీలు వేసి సమస్యలను అధ్యయనం చేయాలని స్థానిక సమస్యలపై కృషిని పెంచాలని, అసంఘటి తరంగంలో పనిచేస్తున్న లక్షలాది మహిళల సమస్యలపై ఐద్వా జోక్యం జేసుకోవాలని ముఖ్యంగా స్కీం వర్కర్లకు గౌరవవేతనం పేరుతో శ్రమదోపిడి చేస్తున్నారని ఇంటిపనిగానే చూస్తూ పాలకులు అతితక్కువ వేతనాలిస్తున్నారని, ప్రజాపంపిణీ, పెన్షన్‌వంటి సంక్షేమ పథకాలకు ఎన్‌డియే ప్రభుత్వం ఆధార్‌కు అనుసంధానం చేస్తోంది. ఈ విధానాల వలన ఆహారభద్రత కొరవడుతుంది. ఇప్పటికే పేదరికం వలన 48శాతం మహిళలు రక్తహీనతకు గురౌతున్నారు. ప్రాథమిక ఆరోగ్యానికి సరిపడా బడ్జెట్ కేటాయింపులు లేవు. పోరాడి సాధించుకున్న ఉపాధిహామీ చట్టం పరిమితులు విధించారు. 498(ఎ) సెక్షన్ మార్పులకు లోనవుతోంది. కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాలకు వ్యతిరేకంగా అన్ని తరగతుల మహిళలను సమీకరించి ఐక్య ఉద్యమాలు నిర్వహించాలని పిలుపునిచ్చారు. చివరగా పశ్చిమగోదావరి జిల్లా మహిళా ఉద్యమనేత స్వాతంత్ర్య సమరయోధురాలు 90 సంవత్సరాల అన్నె అనసూయగారు మహిళా ఉద్యమాన్ని మరింత బలోపేతం చేయవలసిన ఆవశ్యకతను తెలియజేసారు. సాధికారిత ముసుగులో ప్రభుత్వం మహిళలను మోసగిస్తోంది. భ్రమలు కొలిపి అధికార పగ్గాలు చేపట్టి ఇచ్చిన వాగ్దానాలను అమలుచేయడంలేదు. నిజమైన సాధికారిత సాధించే దిశగా మహిళా ఉద్యమాలు నిర్మించేందుకు బహుముఖ కార్యక్రమాలను నిర్వహించేందుకు మహాసభ భవిష్యత్తు కర్తవ్యాలను రూపొందించింది. అందు కనుగునంగా 15 ముఖ్యమైన తీర్మానాలను సభలో ప్రవేశపెట్టి సభ ఆమోదం పొందింది. నూతన కమిటీ మహాసభ 12మంది ఆఫీసు బేరర్స్, 49 మందితో నూతన కమిటీ, అధ్యక్ష కార్యదర్శులుగా బి. ప్రభావతి, డి. రమాదేవి, కోశాధికారిగా వి. సావిత్రిని ఏకగ్రీవంగా ఎన్నుకోవడం జరిగింది. ★

మహిళా మణిపూసలు



# సంగీత సామ్రాజ్ఞి - వీణాధనమ్మాళ్

(1868-1938)

- వకుళాభరణం లలిత

ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థంలో మద్రాసులో జార్జిటవున్‌లో ఒక ఇంటినుంచి మంద్ర స్థాయిలో వీణ వినిపించేది. ఆ వీధిలో వాళ్ళు, చుట్టుపక్కలవాళ్ళు 'అమ్మవీణ వాయిస్తుందని' ఆనందంతో ఉద్రూతలూగేవారు. రసజ్ఞులు హాలులో చేరి విమల గంధర్వ గానంతో కలిసిపోయ్యే వీణానాదాన్ని ఆస్వాదించేవారు. వీణ వాయిస్తున్న ఒక స్త్రీ మైమరచి, మృదువుగా శ్రావ్యమైన సంగీతంతో ఆ వాతావరణాన్ని నింపేది. ఆమె ఎవరోకాదు **వీణాధనమ్మాళ్..**

సంగీత, నాట్యాలకోసమే జన్మించిన దేవదాసీ వ్యవస్థలో పుట్టిన మహిళా మణిపూసయే వీణధనమ్మాళ్. ఇంట్లో పుట్టిన మొదటి బిడ్డను భగవంతునకు అర్పించటమనే సదాచారం గ్రీకు, రోమన్, ఈజిప్టు దేశాల్లో కూడా ఉండేది. ఇక భారతదేశంలో దక్షిణాదిన ఈ ఆచారం ప్రబలంగా ఉండేది. ఇది మూఢనమ్మకం కావచ్చు. దైవభక్తే కావచ్చు. దేవుని సమక్షంలో పాడటం, ఆడటం, కుంభ హారతినివ్వటం, సేవ చేయటం ఆమె వంతు. వీరికి సమాజంలో ఎంతో గౌరవం ఉండేది. దేవాలయ భూములు కేటాయించి వీళ్ల భుక్తిని ఆదుకొనేది. వీరు ఎప్పుడైతే దేవునికి అంకితమవుతారో, మానవ మాత్రునితో వివాహ సంబందాలుండేవి కాదు. దేవునికి మరణం ఉండదు. కాబట్టి ఆమె ఎప్పుడూ పతివ్రతయే. బ్రాహ్మణులు, క్షత్రియులనే తారతమ్యం లేక అన్ని కుటుంబాల నుంచి ప్రధమ పుత్రికను దేవునికి అర్పించేవారు. బీదకుటుంబాలు తమ బిడ్డను దేవ దాసీలకు ఇచ్చేవారు. కరువు కాలాల్లో యిలాంటి దత్తతల సంఖ్య పెరిగి పొయ్యేది. వీళ్ళు ఒక కులానికి సంబంధించిన వారుకాదు. ఒక వృత్తికి సంబంధించిన వారు. తంజావూరు దేవదాసీ వ్యవస్థకు చెందిన కామాక్షి అమ్మాళ్, సుందరమ్మాళ్ ఈ కోవకు చెందిన వారే. సుందరమ్మాళ్ యేదనమ్మాళ్ తల్లి. అట్లే ప్రముఖ గాయనీమణి ఎమ్. ఎల్ వసంత కుమారిని పేరుమాళ్ కోయిల్ నారాయణమ్మ దత్తత తీసుకుంది.

కామాక్షి అమ్మాళ్, ధనమ్మాళ్‌కు అమ్మమ్మ రంగూన్ కృష్ణస్వామి మొదలియార్ ఆమె పోషకుడు. ధనమ్మాళ్ మద్రాసుకు చేరింది. ఒక నాడు నాట్యానికి ప్రసిద్ధిచెందిన ధనమ్మాళ్ క్రమేపి సంగీతం వైపు మొగ్గు చూపింది. సోదరి రూపవతితో కలిసి పాడేది. తల్లి సుందరమ్మాళ్ కుమార్తెను వీణ నేర్చుకొమ్మని ప్రోద్భలం చేసినందువల్ల ఈమె వీణ ధనమ్మాళ్ అయింది. వీణలో సన్నని ఆమె గొంతు కలిసిపోయింది. దానికి తోడు ప్రఖ్యాత వైణికుడైన కళ్యాణ కృష్ణ భాగవతార్ వీణ విన్నాక ఈమె వీణ నేర్చుకొన్నది. సాత్తనూర్ పంచన దయ్యర్ కూడా వీణా వాద్యంలో గురువైనాడు. అట్లే వారసత్వంగా లభించిన సంగీత సంపదతోపాటు సంగీతం ఉద్దండుడైన త్రిమూర్తులు, పురందరదాసు కీర్తనలు ఆమె నేర్చుకొని, యింకొకరు ఇంత చక్కటి వీణావాద్యం చేయలేరనే పేరును ప్రఖ్యాతిని సంపాదించింది. వీణాధనమ్మాళ్ బెంగుళూరు నాగరత్నమ్మకు ధనమ్మాళ్ అంటే గౌరవం.

బాల్యంలోనే శాస్త్రీయ సంగీతాన్ని అవపోసన పట్టిన ఆమె, ఎంతోమంది సంగీత నిధులు, మహా విద్యాంసుల వద్ద వాద్య విద్య నేర్చుకుని, వాటన్నింటిని అవగాహన చేసుకున్న ధనమ్మాళ్ అత్యున్నత స్థాయికి చేరుకొంది. ఆనాటికే పురుషులు వీణా వాద్యంపై గుత్తాధిపత్యాన్ని వహించారు. మైసూరులో వీణా శేషన్న, వీణా సుబ్బన్న, పీఠాపురంలో సంగమేశ్వరశాస్త్రి, విజయ నగరంలో వీణా వెంకటరమణదాసు వీణా వాద్యంలో ఎనలేని ప్రఖ్యాతిని సంపాదించిన వైణికులు, సమకాలీయంగా ధనమ్మాళ్ క్షేత్రయ్య పదాలు పాడటం ఆమె ప్రత్యేకత.

వీణను వాయించటంలో ఆమెదో విలక్షణపాత్ర. రాగ సారాన్ని క్లుప్తంగా కుదించి వాయించి, వీణపై మనోహరంగా వినిపించి నాదామృతంలో వీనులవిందు చేయటం ధనమ్మాళ్ సొత్తు. కర్ణాటక సంగీతంలో సొగసు, సొంపు ఆడవాళ్ళు మాత్రమే అలవరుచు కొని ఎక్కువ న్యాయం చేయగలరనే అపోహ ఆమెకు ఉంది. ఒకసారి ఆమె మనవడు టి. శంకరన్ జావళీ

పాడితే ఆమె 'నీలాంటి మీసాలపోతు శృంగార రసభరితమైన జావళీ ఎలా పాడగలరని' అనిందట.

జావళీలకు సంగీతంలో ఆదరణ కల్పించింది ధనమ్మాళే. సుబ్రమణ్య అయ్యర్, పట్టాభి రామయ్య, తిరువతి నారాయణస్వామి, ధర్మపురి సుబ్బరాయన్ రచించిన జావళీలను పాడి, ప్రచారం చెయ్యటంలో ధనమ్మాళ్ ప్రత్యేకతను సాధించింది. ధర్మపురి సుబ్బరాయన్ ఎన్నో జావళీలను రచించి ధనమ్మాళ్‌కు అంకితం ఇచ్చాడట. ధనమ్మాళ్ సంపాదించిన పేరు, ప్రజ్ఞా విశేషాలు అపారం. ఆమె అరియక్కూడి రామానుజ అయ్యంగారు, నయనాడిళ్ళై వంటి వారితో సంగీత మాధుర్యాన్ని పంచుకునేది. మైసూరు, తంజావూరు, విజయనగరం, బరోడా మహారాజులు ఆమె సంగీతాభిమానులు, ధనమ్మాళ్‌కు హిందుస్తానీ సంగీతంపై అభిమానమెక్కువ. తన కోమల నుస్వరాన్ని మంజుల వీణానాదంతో మేళవించి పాడుతూ వాయించేది. వీణను చంటిబిడ్డలా లాలించినట్లు పట్టుకొని శ్రుతి చేయడంలో శ్రద్ధ వహించేదట. లక్నో నుంచి తెప్పించిన ప్రత్యేకమైన జర్దా, సుగంధ ద్రవ్యాలను తాంబూలంలో ఉపయోగించేది. మొదట్లో రికార్డులు చేయటంలో అశ్రద్ధ చూపినా తర్వాత కొన్నిటికి అంగీకరించిందట. ప్రఖ్యాత నాట్యకళాకారిణి బాలసరస్వతి ఆమె మనుమరాలు. చివరి దశలో అక్కడికి చేరిందట. 1938లో 71వ ఏట దసరా ఉత్సవాల అనంతరం ఆమె తుది శ్వాస విడిచారు. వీణానాదాన్ని మువ్వగోపాలునికి అర్పించిందట.

ధనమ్మాళ్ బాణిని మూడు తరాల కళాకారులకు ఆమె అందించింది. ఎంతోమంది ఈనాటి ప్రముఖ వీణావాద్యులు ఆమె బాణీని అనుసరిస్తారు. ఈనాటికీ ఆమె

**బాల్యంలోనే శాస్త్రీయ సంగీతాన్ని అవపోసన పట్టిన ఆమె, ఎంతోమంది సంగీత నిధులు, మహా విద్వాంసుల వద్ద వాద్య విద్య నేర్చుకుని, వాటన్నింటిని అవగాహన చేసుకున్న ధనమ్మాళ్ అత్యున్నత స్థాయికి చేరుకొంది. ఆనాటికే పురుషులు వీణా వాద్యంపై గుత్తాధిపత్యాన్ని వహించారు. మైసూరులో వీణా శేషన్న, వీణా సుబ్బన్న, పీఠాపురంలో సంగమేశ్వరశాస్త్రి, విజయ నగరంలో వీణా వెంకటరమణదాసు వీణా వాద్యంలో ఎనలేని ప్రఖ్యాతిని సంపాదించిన వైణికులు, సమకాలీయంగా ధనమ్మాళ్ క్షేత్రయ్య పదాలు పాడటం ఆమె ప్రత్యేకత.**

వీణను ముని మనువరాలు లక్ష్మి ఇంట్లో చూడవచ్చు. ఆమె కీర్తి ఈనాటికీ దిశదిశలా వ్యాపిస్తూనే ఉంది. సంగీతానికి ప్రాణం పోసిన కళాకారుల్లో వీణాధనమ్మాళ్ ఒకరు. ★

# కన్యాదానం - కట్టుబానిసత్వం

- ఆర్. దుర్గాప్రసన్న

నాలోకి నేను తొంగి
చూసుకుంటున్న వేళ
ఏదో తెలియని వెలితి
నిరాశా మేఘాలు కమ్ముకొస్తున్న వేదన?

ముంచుకొస్తున్న మేఘాలు
ఆ వెనుకే జాలువారే ఝల్లులు
వాటికి తోడుగా కేరింతల బాల్యం
జ్ఞాపకాలన్నీ అక్కడితో ఆగిపోతున్నాయి ఏమిటి?

ముంచు కొచ్చే సమస్యలు
వాటినెదుర్కొనే విఫలయత్నంలో కన్నీళ్ళు
ఇపుడు ఇవే ఉపమానాలవుతున్నాయి
మచ్చేసిన ఆకాశంలా దృశ్యానికీ నాకూ మధ్య కన్నీటి పొర!

బాల్యమంతా ఆంక్షలలోనే అల్లాడింది
యవ్వనమంతా బానిసత్వంలో బందీ అయింది
ఇప్పుడిప్పుడే తెంచుకుంటున్న సంకెళ్ళు
ఎందుకో ఉత్సాహాన్నివ్వడం లేదు

తిరుగుబాటు చెయ్యాలనీ
సంకెళ్ళు తెంచుకోవాలనీ
గొంతెత్తి అరవాలనీ
నాలాంటి వాళ్ళందరిలో చైతన్యం
రగిలించాలనీ అనుకున్నాను

సంకెళ్ళు తెంచుకున్నాను
విజయాలు సాధించాను
నన్ను నేను నిరూపించుకున్నాను
పిల్లల్నీ ప్రయోజకుల్ని చేసి చూపాను

కానీ–
ఈ వాన ప్రస్తంలో ఆలోచించుకుంటే
నన్ను నేను కోల్పోయాను
విలువైన నా జీవితకాలాన్నీ కోల్పోయాను
పెళ్ళి పేరుతో కట్టు బానిసనయ్యాను.

# ప్రగతి పథంలో ముస్లిం మహిళలు

- వేములపల్లి సత్యవతి


శిరీన్ ఇబాదీ

ఇంతకు పూర్వం గల్ఫ్ దేశాల జీవనాధారం ఒంటెలు, ఖర్జూర ఫలాలు మాత్రమే, ప్రకృతి ప్రసాదించిన అమూల్యమైన పెట్రోల్ వనరులతో సంపన్న దేశాలుగా అభివృద్ధి చెందినవి. గల్ఫ్ దేశాలలో తలమానికంగా సంపన్న దేశంగా సౌదీ అరేబియా నిలిచింది. ఇప్పటివరకు ఒక్క సినిమా థియేటర్ కూడ లేని దేశం ఉన్నదా? అనుకుంటే అది సౌదీ అరేబియా అని చెప్పవచ్చు. ఎక్కువ ఖరీదుగల, ఎక్కువ కారులు గలిగిన దేశం కూడా సౌదీ అరేబియా. అయితే అక్కడ మహిళలు కారు నడపకూడదు. ఉత్సాహంవున్న మహిళలు కొందరు ఇతర దేశాలకు వెళ్ళి డ్రైవింగ్ నేర్చుకుంటున్నారు. సౌదీ మహిళలు ఒక పర్యాయం తమకు కార్లు నడుపుకునే హక్కు కావాలని రోడ్డెక్కారు.

అలాంటి సమాజంలో పుట్టిపెరిగిన హఫిజ అనే ముస్లిం మహిళ ఏకంగా ఒక సినిమా నిర్మాత అయింది. ఇది ప్రతి ఘటనకు గుర్తింపు అనవచ్చు. హఫిజ సాంప్రదాయక సమాజానికి నిలయమైన చిన్న పట్టణంలో పుట్టి పెరిగింది. తల్లితండ్రులు అభ్యుదయ భావాలు కలవారు. ఆమెతండ్రి కవి కూడ. ఆడపిల్లలను చదివించటమే కాక వారికిష్టమైన పనిని చేసుకునే స్వేచ్ఛకూడా యిచ్చాడు. సంతానంలో హఫిజ పెద్దది. హఫిజ ఆమె చెల్లెండ్రు బురఖా ధరించేవారు కాదు. వారి తండ్రి పిల్లలు చూడటానికి సినిమాలను ఇంటికి తెచ్చి చూపించేవాడు. మత పెద్దలనుండి హఫిజ తండ్రిపై వత్తిడులు పెరిగినవి. దానికాయన నా పిల్లలు నా ఇష్టం వచ్చినట్లు పెంచుతానని నిర్భయంగా జవాబు చెప్పేవాడు. ఇరుగు-పొరుగువారు తమ పిల్లలను హఫిజ చెల్లెండ్లతోను, తమ్ముళ్లతోను ఆడనిచ్చేవారు కాదు. హఫి జ సోదరీ-సోదరులు తమతోతామే పోటీలు పడి ఆడుకునేవారు. ఒంటిరితనమన్న భావం వారిలో కలుగలేదు.

హఫి జ కైరోలోని అమెరికన్ విశ్వవిద్యాలయంలో వివిధ భాషా సాహిత్యాలను అధ్యయనం చేసింది. అక్కడే ఒక ఆయిల్ కంపెనీలో పనిచేసింది. అమెరికన్‌ను పెండ్లి చేసుకున్నది. "వారినీడలు వడని" అనే పేరుతో డాక్యుమెంటరీని తీసింది. తానే నిర్మాత, తానే దర్శకత్వం, దానిని స్థానికంగా జరిగే పోటీలకు పంపింది. పోటీలో సెలక్టయింది. మంచి పేరు వచ్చింది. తర్వాత చిత్రం సౌదీలోనే తీయాలనుకున్నది. ముందుగా సౌదీరాజు అనుమతి సంపాదించింది. అనుమతితోపాటు ఆర్థిక సాయం కూడ రాజునుంచి పొందింది. 'వజ్దా' చిత్రం పేరు. దానిని పూర్తిగా సౌదీ అరేబియాలోనే చిత్రీకరించింది.. వజ్దా లోని కథ పది సంవత్సరాల అమ్మాయి గ్రీన్ కలర్ సైకిల్ కొరకు కన్నకల. హఫిజకు ఆమె తండ్రి అలాంటి సైకిల్ కొని ఇచ్చాడు. చిన్నప్పుడు దానిపై పట్టణమంతా తిరిగేది. సౌదీ ముస్లిం మహిళ పాతివ్రత్యాన్ని కాపాడుకోవటానికి ఎల్లప్పుడు నల్లని దుస్తులనే ధరించాలి. దానిని ప్రతిఘటించటానికే తాను నిర్మించిన "వారి నీడలు వడని మహిళలు" డాక్యుమెంటరీలో వాద్ పాత్రకు జీన్స్ ధరింపచేసింది. వాద్ పాత్రను హఫిజ చెల్లెలు 12 సంవత్సరాల వయసున్న చెల్లెలు చేత చేయించింది. సౌదీలో అమ్మాయిలను కెమెరా ముందు నిలబడేందుకు అనుమతించరు. ఒక చెల్లెలు కెమెరామెన్‌గా పని చేసింది. గ్రీన్ సైకిల్ కన్నకల చిత్రంపేరు 'వజ్దా' సౌదీ అరేబియాలో దానిని చిత్రీకరించాలి. అందుకని హఫీజ వ్యాన్‌లోనే నటీనటులతో కూర్చుని వాకీటాకీతో డైరెక్టు చేసి చిత్రం పూర్తి చేసింది. 'వజ్దా' 2014 లో జరిగే ఆస్కార్ అవార్డు లను పొందే కేటగిరిలో ప్రవేశానికి అర్హత సంపాదించింది.

కలలను సార్థకం చేసుకునేందుకు కొనసాగించే కృషిని ప్రోత్సహించాలంటుంది హఫిజ. గుర్తింపు పొందటానికి ప్రతిఘటన తప్పదని అంటుంది. పెద్దపెద్ద కలలు కంటూ, వాటిని సాధించే సత్తాగల అమ్మాయిలు చాలామందే వున్నారని, ఆ అమ్మాయిలు మన జాతిని పునర్నిర్మించగల సామర్థ్యకలవారని, నిజంగానే నిర్మిస్తారని తన అభిప్రాయాలను వెల్లడించింది. హఫిజ సాహసాన్ని ప్రశంసించకుండ వుండలేము.

కరుడుగట్టిన మత నియంతల్లో అయతుల్లా ఖొమేనీ ఒకరు. లోగడ ఇరాన్ అధ్యక్షునిగా ఆ దేశాన్ని పాలించి దివంగతుడయ్యాడు. తర్వాత వచ్చిన పాలకులలో కూడ చెప్పుకోదగిన మార్పులేమీ కనిపించటంలేదు. అలాంటి దేశంలో ఆణిముత్యాలలాంటి మహిళలుద్భవించారు. ముస్లిం మహిళలు డాక్యుమెంటరీ ఫిల్మ్ మేకర్లుగా మహిళాహక్కుల కార్యకర్తలుగా కృషి చేస్తున్నారు. వారిలో మోహనాజ్ మొహమ్మది డాక్యుమెంటరీ ఫిల్మ్ మేకరుగా, మహిళా హక్కుల కార్యకర్తగా మంచి పేరు గాంచినది. ఇరాన్ ప్రభుత్వం ఆమెను

హాఫిజ కైరోలోని అమెరికన్ విశ్వవిద్యాలయంలో వివిధ భాషా సాహిత్యాలను అధ్యయనం చేసింది. అక్కడే ఒక ఆయిల్ కంపెనీలో పనిచేసింది. అమెరికన్‌ను పెండ్లి చేసుకున్నది. "వారినీడలు పడని" అనే పేరుతో డాక్యుమెంటరీని తీసింది. తానే నిర్మాత, తానే దర్శకత్వం, దానిని స్థానికంగా జరిగే పోటీలకు పంపింది. పోటీలో సెలక్టయింది. మంచి పేరు వచ్చింది. తర్వాత చిత్రం సౌదీలోనే తీయాలనుకున్నది. ముందుగా సౌదీరాజు అనుమతి సంపాదించింది. అనుమతితోపాటు ఆర్థిక సాయం కూడ రాజునుంచి పొందింది. 'వజ్దా' చిత్రం పేరు. దానిని పూర్తిగా సౌదీ అరేబియాలోనే చిత్రీకరించింది.. వజ్దా లోని కథ పది సంవత్సరాల అమ్మాయి గ్రీన్ కలర్ సైకిల్ కొరకు కన్నకల.

టెహరాన్‌లో అరెస్టు చేసి ఐదు సంవత్సరాలు కారాగార శిక్ష విధించింది. ఎవిన్ కర్మాగారంలో ఆమెను వుంచారు. ఇరాన్ ప్రభుత్వం మొహమ్మదిపై బిబిసీ తోను అమెరికన్ న్యూస్ వర్కుతోను సంబంధాలు కలిగివున్నదని నిందారోపణలు మోపింది. లోగడ మొహమ్మదీ 2003లో ఒక డాక్యుమెంటరీ తీసింది. 'ఉమెన్ వితౌట్ షాడోస్' దానిపేరు. ఆ డాక్యుమెంటులో ఇరాన్ ప్రభుత్వం నడుపుతున్న ఆశ్రమాలలో వుంటున్న మహిళల దీనావస్థలను కళ్లకు కట్టినట్లు, వాస్తవికత ఉట్టిపడేలా చాలా గొప్పగా చిత్రీకరించారు. దానితో మొహమ్మదీ పేరు ప్రపంచమంతటా ప్రఖ్యాతిగాంచింది. దానితోపాటు ఇరాన్ ప్రభుత్వ అనమర్థత ప్రపంచానికి వెల్లడయింది. 2006లో మహమ్మదీ మరో డాక్యుమెంటరీ తీసింది. దానిపేరు 'ట్రావెలోగ్' ఇరాన్, టర్కీ మధ్య తిరిగే రైలులోని ఇరానీ ప్రయాణీకులతో 'ఎందుకు మీరు మీ దేశాన్ని వదిలి వలస వెళుతున్నారని ప్రశ్నలడిగింది. ఆ విధముగా ప్రశ్నించటం, ఇరాన్ ప్రభుత్వ దృష్టిలో గొప్ప నేరమయింది. 'ట్రావెలోగ్' విడుదలయ్యాక ఆమెను దేశం వదిలి వెళ్ళకూడదని నిషేదాజ్ఞలు జారీ చేసింది. ప్రపంచ దేశాల్లో తమ దేశపు పరువు, ప్రతిష్ఠలకు ఆమె తీసిన డాక్యుమెంటరీవల్ల భంగం కలిగిందన్న కసితో ఆమెపై అబద్ధపు నిందారోపణలు మోపి అయిదు సంవత్సరాలు జైలు శిక్ష విధించారు. మొహమ్మదీ తనమీద మోపిన నిందారోపణలు నిరాధారమైనవని. తానెన్నడూ బీబీసీతోను, అమెరికన్ నెట్‌వర్క్‌తోను సంబంధ పెట్టుకోలేదని ఖండించింది. ఈ విషయాన్ని ఆమె " జూన్ మొదట్లో (2014లో) ఇంటర్నేషనల్ కాంపేస్ ఫర్‌రైట్స్ ఇన్ ఇరాక్‌కు" మొహమ్మదీ తెలిపారు. 2010లో కాన్స్ ఫిల్మ్ ఫెస్టివల్ నుంచి ఆమెకు ఆహ్వానం పంపారు. రెజా సెర్కనియాన్ నిర్మించిన 'వెడ్డింగ్ ఎఫిమరల్స్' చిత్రంలో మొహమ్మదీ నటించింది. అందుకే ఫిల్మ్ ఫెస్టివల్‌కు రావల్సిందిగా ఆహ్వానం పంపారు. కానీ ఇరాన్ ప్రభుత్వం అనుమతి నిరాకరించింది. ఆమె వెళ్లలేకపోయింది. కారాగార శిక్ష పడిన మొహమ్మదీని వెంటనే విడుదల చేయాలని అనేక అంతర్జాతీయ మహిళా సంఘాలు పిలుపునిచ్చినవి. కాన్స్ ఫిల్మ్ ఫెస్టివల్ కూడ తమ నిరసనను వ్యక్తం చేస్తూ వెంటనే మొహమ్మదీని విడుదల చేయాలని కోరింది. అయినా ఇరాన్ ప్రభుత్వానికి చలనం కలగలేదు. ఫీచర్ ఫిల్మ్ మేకర్ శిరీన్ నిషాత్ ఇరానీ దేశీయురాలే. ఇరాన్‌లో మానవ హక్కుల కొరకు అలుపెరగని పోరాటం చేస్తున్న న్యాయవాది శిరీన్ ఇబాదీ కూడ ఇరానీయే. ప్రపంచంలో నోబెల్ బహుమతి పొందిన మొదటి ముస్లిం మహిళా మణి కూడా ఇబాదీనే. అందుకే ఇరాన్‌లో మొహమ్మదీ, శిరీన్ నిషాత్, శిరీన్ ఇబాదీ లాంటి మహిళా మణి పూసలు ఇంకా ఇంకా ఉద్భవించాలని కోరుకుందాం. ★



## ఆధునిక చైతన్యమూర్తి జానకీ రాణి

1936లో కృష్ణా జిల్లాలో పుట్టిన జానకీ రాణి ఇంటిపేరు మంటపాక. అయితే రచయిత, రేడియో ప్రయోక్త తురగా కృష్ణమోహనరావును పెళ్లి చేసుకున్నాక అదే ఇంటిపేరుతో పరిచితమైనారు. ప్రసిద్ధ రచయిత గుడిపాటి వెంకటచలం మనవరాలు వరుసయ్యే జానకి రాణి ....చాలా ఆలస్యంగా ప్రచురించిన తాతయ్య ఉత్తరాలులో ఎన్నో ప్రస్తావనలు వుంటాయి. ఎకనామిక్స్‌లో పి.జి చేసిన జానకీ రాణి చాలా కాలం సాంఘిక సంక్షేమ శాఖలో పనిచేశారు. 1960వ దశకంలో బాగా పేరున్న రచయిత్రుల్లో ఆమె ఒకరు. ఎంతో నిశిత పరిశీలన సహజ శైలి మనస్తత్వ ఘర్షణా చిత్రణ ఆమె కథలకు ప్రత్యేకత తెచ్చిపెట్టాయి. వాస్తవానికి ఇప్పుడు స్త్రీవాదం గురించి చెప్పడం కన్నా ఆ రోజుల్లో స్త్రీల కనీస హక్కులు అభ్యున్నతి కోసం గొంతు వినిపించడం ఎంతో గొప్ప విషయం. న్యాపతి కామేశ్వరి నిర్వహించిన బాలానందంలో రేడియో అక్కయ్య యాంకరింగ్‌లో బాగా పేరు తెచ్చుకున్నారు. ఎందరో బాలబాలికలలో సృజన శక్తిని పెంపొందించారు. రచన ఉపన్యాసం ఏకపాత్రాభినయం వంటి విద్యలు పెంపొందించారు. రేడియోలో ఆమె దేవులపల్లి కృష్ణశాస్త్రీ, త్రిపురనేని గోపిచంద్ వంటివారి దగ్గర పనిచేయడం విశేషం. అక్షరాస్యత, బాలల చదువు, స్త్రీ విద్య, వంటి అంశాలపై ప్రత్యేక శ్రద్ధతో కార్యక్రమాలు రూపొందించి పలు అవార్డులు అందుకున్నారు. ఇటీవల మరణించిన జానకీరాణి గార్కి చైతన్య మానవి జోహార్లు అర్పిస్తుంది...

# లవ్ జిహాద్ సంఘ పరివారం

# రాజకీయలబ్ధి కోసం చేస్తున్న ప్రచారం

- సుభాషిణి అలి, ఐద్వా జాతీయ నేత



లవ్ జిహాద్ అంటూ సంఘ పరివార్ చేస్తున్న ప్రచారం కేవలం రాజకీయ లబ్ధికోసమే అని మనం అర్థం చేసుకోవడం చాలా ముఖ్యం. దక్షిణభారత దేశంలో ముఖ్యంగా కేరళ, కర్ణాటకలలో బలాన్ని పెంచుకునేందుకు భాజపా 2007లో 'లవ్ జిహాద్' అంటూ మొదలు పెట్టింది. ఏమాత్రం వాస్తవ ఆధారాలు లేని ఈ రాజకీయ ప్రచారం, భాజపా తనచుట్టూ సమీకరించుకుందాం అనుకుంటున్న మతస్థులతో తీవ్రమయిన ప్రకంపనలను సృష్టిస్తుంది.

పితృస్వామ్య సమాజం ఎప్పుడూ స్రీల హక్కులకు పరిమితులను విధించడానికి, వాళ్ళ కదలికలను, చర్యలను నియంత్రించడానికి పెళ్ళిని ఒక సాధనంగా ఉపయోగించుకుంటూ ఉంటుంది. ఈ సమాజంలోని అతి ముఖ్యమైన, వ్యక్తిగత ఆస్థిని కాపాడుకోవడానికీ, మగవారు ఆ ఆస్థిని తమ వారసులకే అందించడానికి ఇది చాలా అవసరం. కులాల వారీగా విభజింపబడిన మన సామాజిక వ్యవస్థలో పితృస్వామ్య నిబంధనలు మరింత కఠినంగానూ, క్రూరంగానూ ఉంటాయి. ఈ నిబంధనలను ఉల్లంఘించేందుకు సిద్దపడడమంటే ప్రాణాలకు తెగించడమే.

మనువు స్త్రీలకు సంబంధించి కొన్ని నియమాలు రూపొందించారు. "సూద్ర మహిళ సూద్రుని భార్య కావచ్చు. ఒక సూద్రుడు ఒక భార్యను మాత్రమే కలిగి ఉండాలి. ఆమె సూద్రురాలే అయి ఉండాలి. వైశ్యుడు ఇద్దరు భార్యలను కలిగి ఉండవచ్చు. ఒకామె వైశ్యకులం నుండి రెండవ ఆమె శూద్రకులం నుండి ఉండవచ్చు. క్షత్రియులు ముగ్గురు భార్యలను కలిగి ఉండవచ్చు. ఒకరు క్షత్రియ కన్య, ఒకరు వైశ్యకన్య, ఒకరు సూద్రకన్య అయి వుండవచ్చు. బ్రాహ్మణుడు నలుగురు భార్యలను కలిగి ఉండవచ్చు. ఒకరు బ్రాహ్మణస్త్రీ, రెండవ ఆమె క్షత్రియకులం నుండి, మూడవ ఆమె వైశ్య కులం నుండి, నాల్గవ ఆమె సూద్రకులం నుండి వచ్చి ఉండవచ్చు. మహిళలు ఒక్కరినే భర్తగా కలిగి ఉండాలి గాని పురుషుడు ఒకరికన్నా ఎక్కువ మందినే భార్యలుగా పొందవచ్చు. వివాహేతర సంబంధాల గురించి కూడా మనువు కొన్ని నిబంధనలను చెప్పారు. మహిళ తనకన్నా పై కులం పురుషులతో వివాహేతర సంబంధం పెట్టుకోకూడదు. తక్కువ కులం పురుషునితో సంబంధం పెట్టుకుంటే ఆమెను కఠినంగా శిక్షించాలి. ఏకాంత గృహంలో బంధించాలి. అదే పురుషుడు తనకన్నా పై కులం స్త్రీతో సంబంధం కలిగి ఉంటే అతనికి మరణశిక్ష వేయాలి. అదే గనుక తన కులస్థురాలితో వివాహేతర సంబంధం కలిగి ఉంటే ఆ మహిళ నమ్మకానికి పరిహారంగా కొంత సొమ్ము చెల్లించాలి.

హిందువుల ఆధ్యాత్మిక గ్రంథంగా చెప్పుకునే భగవత్‌గీతలో కూడా కృష్ణుడు, మహిళలు నీతి తప్పితే వర్ణసంకరం ఏర్పడుతుందని, అటువంటివారికి నరకం తప్ప మరో గత్యంతరం లేదని సెలవిచ్చారు. అంటే మహిళలు తనకు నచ్చిన తమకన్నా తక్కువ కులస్థులను పెండ్లి చేసుకుంటే వారికే కాక, వారి కుటుంబానికి, మొత్తం కులానికి కూడా అపకారం జరుగుతుంది. అందుకనే మహిళ తనకు నచ్చిన క్రింది కులస్థుడినో, అన్యమతస్థుడినో పెండ్లి చేసుకోవడం ఊహించ లేకపోతున్నారు, సహించ లేకపోతున్నారు.

అయితే ఈ నిషిద్ధాలేవీ స్త్రీ, పురుషుల మధ్య సంబంధాలను గానీ, వివాహాలను గాని ఆపలేక పోయాయి. అంతేకాదు ఇవి రోజు రోజుకూ పెరుగుతున్నాయి కూడా. కానీ సాధారణంగా ఇవి పెద్ద ఎత్తున వ్యతిరేకతనూ ఎదుర్కోలేదు. మొగలాయి చక్రవర్తులు, రాజపుట్ కన్యలను పెళ్ళాడడం ఇందుకు ఉదాహరణగా చెప్పకోవచ్చు. సాధారణ ప్రజానీకంలో కూడా కులాంతర, మతాంతర

వివాహాలు చేసుకోవడం వలన కుటుంబసభ్యుల నుండో, బంధు వర్గం నుండో వ్యతిరేకత రావడం జరుగుతుంది. కులం నుండి వెలివేయడం కద్దు. కానీ ప్రజలందరూ కలిసి సమూహంగా ఇతర కులాల మీద పడి హింసకు పాల్పడిన

**హిందువుల ఆధ్యాత్మిక గ్రంథంగా చెప్పుకునే భగవత్‌గీతలో కూడా కృష్ణుడు, మహిళలు నీతి తప్పితే వర్ణసంకరం ఏర్పడుతుందని, అటువంటివారికి నరకం తప్ప మరో గత్యంతరం లేదని సెలవిచ్చారు. అంటే మహిళలు తనకు నచ్చిన తమకన్నా తక్కువ కులస్థులను పెండ్లి చేసుకుంటే వారికే కాక, వారి కుటుంబానికి, మొత్తం కులానికి కూడా అపకారం జరుగుతుంది. అందుకనే మహిళ తనకు నచ్చిన క్రింది కులస్థుడినో, అన్యమతస్థుడినో పెండ్లి చేసుకోవడం ఊహించ లేకపోతున్నారు, సహించ లేకపోతున్నారు.**

ఘటనలు చరిత్రలో ఎక్కడా ఇదివరకు నమోదుకాలేదు. కేవలం ఆధునిక కాలంలో భారతదేశంలో, హిందూ మహాసభ, జన సంఘ్, తరువాత భాజపా మతతత్వ రాజకీయాలు మొదలయిన తరువాతే మతాంతర వివాహాలు, మరి కొద్దిరోజుల నుండి కులాంతర వివాహాలు కూడా మత విద్వేషాలు, కులవిద్వేషాలు పెరిగేందుకు దోహదపడుతున్నాయి.

ఈ సందర్భంలోనే మనం 'లవ్ జిహాద్'ను చూడాలి. ఇందులోని ఒక ముఖ్యమైన కోణం ఏమిటంటే, దీనికి ఏ వాస్తవ ఆధారాలూ లేవు. యువతీ యువకులు తమ ఇష్టానికనుగుణంగా పెళ్ళిచేసుకోవడం తమకు అభ్యంతరం లేదని సంఘ్ పరివార్ చెప్పుకుంటుంది. కానీ అభ్యంతరమల్లా ముస్లిం మతస్థులు కొంత మంది యువకులకు హిందూ యువతులను ప్రేమించి, పెళ్ళిచేసుకునేందుకు ప్రేరేపించడంలో శిక్షణను ఇవ్వడం తద్వారా హిందూ మత గౌరవాన్ని తగ్గించడం అంతేగాక ముస్లిం సంతానాన్ని ఎక్కువగా కని ముస్లిం జనాభాను పెంచి, వారిని తీవ్రవాదులుగా తయారు చేయడం. కానీ ఈ ఆరోపణలకు ఆధారాలను వెతకబోతే ఇవి పూర్తిగా తప్పుడు సమాజాలపై చేస్తున్న నిరర్థక ఆరోపణలని తేలిపోతున్నాయి. ఉదాహరణకి 'లవ్ జిహాద్' ప్రచారాన్ని మొట్టమొదటి సారిగా దక్షిణ భారత దేశంలోని కేరళలో ప్రవేశ పెట్టినప్పుడు దీనికి కారణం అక్కడున్న ముస్లిం మతతత్వ వాదులన్నారు. ఆ తరువాత మొన్న మళ్ళీ పశ్చిమ, ఉత్తర ప్రదేశ్‌లో ప్రచారం చేస్తున్నప్పుడు అక్కడున్న రియోబాండ్‌లో ఈ 'లవ్ జిహాద్' మూలాలు ఉన్నాయని ఆరోపణలు మొదలు పెట్టారు .

ఈ రకమైన తేడాలున్నప్పటికీ సంఘ్ పరివార్ చేస్తున్న ఈ ప్రచారానికి మనం ప్రాధాన్యతనివ్వాలి. 2009లో 23 సం॥ సిల్‌జరజ్ అనే మహిళ అజగర్ ను వివాహం చేసుకున్నారు. ఆమె ఇస్లాం మతంలోకి మారాలను కున్నారు. ఆమె తల్లితండ్రులు అజగర్ బలవంతంగా ఈ మత మార్పిడికి ఆమెను గురిచేస్తున్నా డంటూ పోలీసులకు ఫిర్యాదు చేయగా పోలీసులు వారిని కరా&....టక హైకోర్టు డివిజన్ బెంచ్ ముందు హాజరు పరిచారు. ఈ విషయాన్ని సంఘ్ పరివార్, శ్రీరామ సేన లవ్ జిహాద్‌గా ప్రచారం చేసుకున్నాయి. దురదృష్ట కరమయిన విషయం ఏమిటంటే సిల్‌జరజ్ తన ఇష్టం ప్రకారమే పెళ్ళి చేసుకున్నానని, ముస్లిం మతంలోకి మారుతున్నానని చెప్పినా న్యాయమూర్తి వినిపించుకోకుండా సిల్‌జరజ్‌ను తల్లి తండ్రుల దగ్గరకు, అజగర్‌ను జైలుకు పంపించారు. ఈ తీర్పును తరువాత పూర్తి బెంచి తిరస్కరించి సిల్‌జరజ్‌ను భర్త అజగర్ దగ్గరకు పంపించి 'లవ్ జిహాద్' లాంటిదేమీ లేదని తీర్పు చెప్పారు. అయితే ఇక్కడ మనం గుర్తించాల్సిందేమిటంటే ఈ చివరి తీర్పుకు ప్రచారం జరగలేదు. కాని ముందు జరిగిన విషయాన్ని డివిజన్ బెంచ్ తీర్పును ప్రచార సాధనాలన్నీ నెలల తరబడి ఎడతెరపి లేకుండా ప్రచారం చేసాయి. అందువలన కోర్టు చిట్టచివరికి 'లవ్ జిహాద్' అన్నదేదీ లేదని తీర్పు చెప్పినా సామాన్య ప్రజానీకం మనసులలో ఇది తీవ్రమైన ముద్రను వేసుకుంది.

గత సంవత్సరం పశ్చిమ ఉత్తర ప్రదేశ్ ఎన్నికలలో భాజపా ఆటంకాలు లేని పోటీ చేసింది. కాంగ్రెస్ అవినీతితో అధిక ధరలను అరికట్టలేక చచ్చుబడిపోయి భాజపాకు కేంద్రంలో మంచి అవకాశాన్నిచ్చింది. హిందీ ప్రాంత మంతటిలో భాజపా ఒక ప్రణాళికా బద్ధంగా ప్రజలను మత ప్రాతిపదికన కేంద్రీకరింప జేసింది. భాజపా పథకం పారింది. మంచి ఫలితాలు సాధించింది. భాజపా చాలా పరిమితంగా ఉండి కూడా ఎస్.పి., బి.ఎస్.పి మరియు ఆర్.ఎల్.డి లు నిర్ణయాత్మక శక్తులుగా ఉన్న చోట ఆడపిల్లల గౌరవం, ఇంటికోడళ్ళ గౌరవాన్ని ముస్లిం పురుషుల నుండి కాపాడడం అనే పథకం వేసి బాగా లబ్ది పొందింది. ఇది ఇక్కడే కాక ప్రక్కనున్న హర్యానా, రాజస్థాన్‌లలో కూడా ఉపయోగపడింది.

ఈ ప్రచారం ఇలా సాగి సాగి 'లవ్ జిహాద్'కు వ్యతిరేకం, భాజపా గుర్తింపు

పొందింది. 'కారవన్' అనే పత్రికలోని ఆగస్టు 29 ప్రతిలో అంజలీ మోదీ ఒకవ్యాసం రాశారు. అందులో ఆమె... "ఒక ఏడాది క్రితం ముజఫర్ నగర్‌లోని మత ఘర్షణలను గురించి వ్రాస్తూ.. ఇక్కడ(ముజఫర్ నగర్‌లో) గత కొద్ది రోజులుగా కొంతమంది ముస్లిమ్ యువకులు చక్కగా బట్టలు వేసుకుని, చేతులకు ఎర్రతాళ్ళు కట్టుకుని స్కూళ్ళు, కాలేజీల చుట్టూ అమ్మాయిలను వలలో వేసుకునేందుకు తిరుగుతున్నారని ఇక్కడి హిందూ సంస్థలు ప్రచారం చేస్తున్నాయని వార్త వచ్చింది నిజమేనా అని అడిగాను... అతడూ ఈ విషయాన్ని నమ్మలేకపోయాడు. కేరళ, కర్నాటకలలో లాగా లవ్ జిహాదా? అని అడిగితే అటువంటి మాటను నేనింతవరకు వినలేదు, చదవలేదు'' అన్నాడు.

కొన్ని నెలల తరువాత ముజఫర్ నగర్ పార్లమెంటు సభ్యుడు, భాజపా నాయకుడు, డియోబాన్డ్‌లో ముస్లిం యువకులు హిందూ మహిళలకు ఎరవేస్తున్నారని వారి ద్వారా ముస్లింల జనాభా పెంచుకోవడమే కాక హిందువులను కనే కడుపుల సంఖ్య తగ్గించేందుకు పన్నాగాలు పన్నుతున్నారని ప్రసంగించారు. అంతేకాదు ముజఫర్ నగర్‌లోని ఓ రెస్టారెంట్‌లో ఒక హిందు ముస్లిం జంటను చూడగానే సదరు నాయకుని అనుయాయులు ఆ ముస్లిం యువకునిపై పడి అతని ముఖానికి రంగుపులిమి రోడ్ల వెంట తిప్పినట్టు ఘనంగా చెప్పుకున్నారు. అమ్మాయిని పుట్టింటికి చేర్చేసారుట. ఇంకొక ఘటనలో ఒక హిందూ, ముస్లిం జంట ఇంట్లో చొరబడి ఆ అమ్మాయిని లాక్కొచ్చి పుట్టింటికి చేర్చి తామే అదే కులంలోని ఒక అబ్బాయికిచ్చి పెండ్లి చేసేసారుట. విడాకుల ప్రసక్తే ఎక్కడా లేదు. అంతేకాదు 2012 డిశంబరు 2న తమిళనాడులో జరిగిన ఇతర వెనుకబడిన తరగతుల సదస్సులో "దళిత యువకులు ఇతర కుల యువతులను వలలో వేసుకుంటున్నారని వారి జీవితాలను నాశనం చేస్తున్నారని" ఆరోపణలు చేసారు. సెల్‌ఫోన్‌లు కొనిచ్చి ఆడపిల్లలను ఆకట్టుకుంటున్నారట. ఈ వాస్తవాలకు, భాజపా చెప్పే మహిళలకు తమకు నచ్చిన వారిని వివాహం చేసుకోవచ్చని చెప్పేదానికి ఏమయినా సంబంధం ఉందా?

ఆనాటి జర్మనీ నాజీలు గానీ ఈనాటి తమిళనాడులోని ఇతర వెనుకబడిన సంఘాలు గాని కోరుకున్నది ఒక్కటే. అస్థిత్వ రాజకీయాలు ప్రజలను రకరకాలుగా విభజించి వారి మధ్య చిచ్చు పెట్టడం. లింగ ప్రాతిపదికన విభజించి స్త్రీ, పురుషుల మధ్య బేధాలు సృష్టించడం.

2007లో కేరళలోని హిందూ బాలికలకు రామసేన ఇచ్చిన హెచ్చరికను చూడండి. "ఈ సంఘం (లవ్ జిహాద్) ఒక మతానికి సంబంధించినది. ఇది వారి మతంలోని అబ్బాయిలకు ఆడపిల్లలను ఆకట్టుకోవడం నేర్పుతుంది. వారిని ఆరు నెలలలోగా అమ్మాయిలను పెండ్లి చేసుకోమని హుకుం జారీ చేస్తుంది. ప్రతి అమ్మాయి నలుగురు పిల్లలను కనవలసిందే. ఈ సంస్థ అలా పెళ్ళాడిన అమ్మాయిలకు లక్ష రూపాయలిస్తుంది. అబ్బాయిలకు వ్యాపారం పెట్టుకునేందుకు సహకరిస్తుంది. 'లవ్ జిహాద్' సంస్థ వారి సభ్యులకు ఆడపిల్లలను ఆకర్షించేందుకు సెల్‌ఫోన్‌లు, మోటారు సైకిళ్ళు, మంచి బట్టలు కొనిపెడుతుంది. రామసేన ఈ తెలివితక్కువ పిల్లలను ఇస్లాం మత వ్యాప్తి పావులు కాకుండా కాపాడింది. వారు ఉంపుడుగత్తెలుగా మారకుండా తోడ్పడింది."

సంఘ్ పరివార్ చేసే ఈ ప్రచారాన్ని మనం అడ్డుకోవాలి. రాజకీయ లబ్ది పొందేందుకు ప్రజల మధ్య వైషమ్యాలు పెంచేందుకు వారు చేసే ఈ కుట్రలను బహిర్గతం చేయాలి. ఎందుకంటే వారి ఈ నీచకార్యం దేశ సమగ్రతను దెబ్బతీస్తుంది. మహిళల హక్కులను కాలరాస్తుంది. దేశంలోని ప్రతి ఐద్వా ఇందుకవసరమయిన మార్గాలను అన్వేషించాలి. సరంజామాను తయారు చేసుకోవాలి. దురదృష్టవశాత్తు వీరికి ప్రజలలో సానుభూతి ఉంది. వీరి పిలుపులకు స్పందన ఉంది. ప్రజలకు తప్పుడు అవగాహనను కల్పించడం వలననే ప్రజలు వీరిని నమ్ముతున్నారు. సాంస్కృతికంగా కూడా వీరి ఆలోచనలు తమకు దగ్గరగా ఉండడంవలన కూడా వీరిని ఆదరిస్తున్నారు. యుక్త వయసులోఉన్న వారికి సంఘ పరివార్ అనుసరిస్తున్న విధానాల వలన తమ జీవిత భాగస్వాములను ఎన్నుకునే వారి హక్కు ఎలా హరించబడుతున్నదో వివరించాలి. జన బాహుళ్యానికి వీరి కపట పన్నాగాల రహస్యాల గుట్టు విప్పి చెప్పాలి.

★

**ఇక్కడ(ముజఫర్ నగర్‌లో) గత కొద్ది రోజులుగా కొంతమంది ముస్లిమ్ యువకులు చక్కగా బట్టలు వేసుకుని, చేతులకు ఎర్రతాళ్ళు కట్టుకుని స్కూళ్ళు, కాలేజీల చుట్టూ అమ్మాయిలను వలలో వేసుకునేందుకు తిరుగుతున్నారని ఇక్కడి హిందూ సంస్థలు ప్రచారం చేస్తున్నాయని వార్త వచ్చింది నిజమేనా అని అడిగాను... అతడూ ఈ విషయాన్ని నమ్మలేక పోయాడు. కేరళ, కర్నాటకలలో లాగా లవ్ జిహాదా? అని అడిగితే అటువంటి మాటను నేనింతవరకు వినలేదు, చదవలేదు" అన్నాడు.**

జ్ఞాపకం

# ఆకాంక్ష

- కమలమ్మ



## జ్ఞాపకాలు

ఉదయం హనుమంతరావు గార్ల
మొదటి బిడ్డవు, గారాల పట్టివి.
వీరనారి టాన్యా పేరు నీ పేరు
నీవు వీరనారీ మణివే !
నిన్ను చుట్టుముట్టిన దుష్ట వ్యాధులతో
అలుపెరుగని పోరుసాగిస్తున్నావు.

మోకాళ్ళ శస్త్ర చికిత్స ఓర్పుతో భరించావు
నిన్ను చూడటానికి వచ్చినప్పుడు
ఎలాంటి దయనీయ దృశ్యం చూడాలో
అని దిగులు పడ్డాము.
మమ్ముచూచి సంతోషంతో
హుషారుగా కబుర్లు చెప్పావు
ఆపరేషను తరువాత రోగిపడే
అవస్థను నీవు వర్ణించి చెపితే
నీ మానసిక దిటవుకు ఆశ్చర్యపడ్డాము
ఛాతీ శస్త్ర చికిత్స అనంతరం
టాన్యా సురక్షితం అని సంతోషం
మన అమ్మాయికే ఆపదా రాదు
నిశ్చింత అనుకొన్నాము తరువాత తెలిసింది
వ్యాధి నిన్ను వదలలేదని,
నన్ను చూడాలన్నావని, అమ్మాజీ
చెప్పిన వెంటనే మేము ఒంగోలు
బయలుదేరాము. టాన్యాను ఏ స్థితిలో
చూడాలో అని దిగులు పడుతూ వచ్చాము
నీవేమో మామూలు మనిషిలా
అతిథి మర్యాదలు సాగించావు
డా॥ రంగారావు గారు మాత్రం
మానసికంగా భారంగానే కన్పించారు
ఆయన వైఖరినిబట్టి నీ ఆరోగ్యం
సరిగాలేదని అర్థమయింది.
నీవు మాత్రం నిండుకుండలా ప్రవర్తించావు

ఉదయిని గారింటికి పయనం కట్టావు
అక్కడ మనవరాలికి నీవు స్వయంగా
తయారు చేసిన ఆ దుస్తులను చూసి
విస్తుపోవడం మా వంతయింది.
నీ నైపుణ్యం ఓపిక చూసి ఎంతో ముచ్చట
పడ్డాము.
(మనసులో ఒకలాంటి బాధమెలిపెట్టింది!)
మనసులోని నీ నిబ్బరం వ్యాధిని
జయించదా ?
మనిషి ఆత్మవిశ్వాసం ఆయుష్షుని
పెంచుతుంది.
మందులకన్నా గొప్ప ఔషధ గుణం వుంది
దానికి ?
టాన్యా ఆరోగ్యవంతురాలవుతుంది
ఆయుష్కాలం పెంచుకుంటుంది అని ఒక
ఆశ.
పసితనంలోనే అమ్మానాన్నలకు దూరంగా
మద్రాసులో మొదట అక్షరాలు దిద్దుకున్నావు
నిన్ను చూడటానికి అమ్మ, నేను వచ్చిపుడు
నువ్వు ఎంతో అమాయకంగా, బుజ్జి
పాపాయిలా కన్పించావు.
అమ్మను కౌగిలించుకుని గారాలు పోయావు
“ నేనూ వస్తా మీతోపాటు”
అంటావనుకున్నాను.
నీవు టాన్యావుగదా? అలా అనలేదు
కళ్ళలో నీటిపొరలు దొరలినా
ముద్దులతో ముంచెత్తి చిరునవ్వుతో
సాగనంపావు.

నాన్న అజ్ఞాతం, జైళ్ళు అమ్మ ఉద్యమాల
కార్యకర్తగా ఊళ్ళవెంట
మీ అక్కచెల్లెండ్ర బాల్యం అలాసాగింది.
అక్క చెల్లెండ్రిద్దరూ వైద్య శాస్త్రంలో
పట్టాసాధించారు.

మీరు చేయగల్గిన ప్రజాసేవ చేసారు
మంచి దయగల డాక్టర్లు అనిపించుకున్నారు
అమ్మాయికి, అబ్బాయికి అమ్మవైనావు
చక్కగా చదివించావు డిగ్రీలందుకున్నావు
నీకు నాన్నమ్మ అమ్మమ్మా పదవులందించారు

ఎన్నుకున్న గమ్యం వైపు పయనిస్తున్న
బిడ్డలను చూస్తే తల్లి తండ్రులకు
ఎనలేని తృప్తిగదా?
సౌజన్యం మూర్తీభవించిన రంగారావుగారికి
నీతోడు ఎంత అవసరమో నీకు తెలియదా?
తోబుట్టువు “ఉష” ఎప్పటికీ పసితనం
వాడని పసిమొగ్గ
అమెకు అక్క ఆసరా ఉండితీరాలి
నాజీలతో వీరోచితంగా పోరాడిన యోధ
టాన్యా.
ఆమె పేరే నీ పేరు
నీవు గెలవాలి ఈ రోగం నుండి
నీవు విముక్తవు కావాలి.
ఆధునిక వైద్య విధానం
నీకు ఉపయోగించదా?
నిన్ను రక్షించే ఉపాయమే లేదు?
ఒక్కటే ఆశ
నీ ఆత్మబలం
బ్రతికి తీరాలన్న ప్రబలమైన కాంక్ష !
మూడోతరం డాక్టరు పట్టా అందుకొంటున్న
మనవరాలి నగుమోము చూడాలి నువ్వు.
నీ బంధుమిత్రుల ఆత్మీయుల
అందరి “ ఆకాంక్ష” ఇదే ఇదే
ఇదే ఇదే నా ఆకాంక్ష కూడా.

**(19-10-2011 తేదీన టాన్యాగారిని
పరామర్శించిన తరువాత
గారపాటి కమల హృదయ స్పందన ఇది)**

**926-10-14 మోటూరు టాన్యా
3వ వర్ధంతి సందర్భంగా..)**

మహిళలు చదువుకోకూడదు. బురఖాలు వేసుకోకుండా బయటకు రాకూడదు. గోళ్లకు రంగు వేయకూడదు.... ఇవన్నీ తాలిబన్ల ఫత్వాలు. అయితే పన్నెండేళ్ల చిన్నారి వీటిని ప్రశ్నించింది. నేను బురఖా ఎందుకు వేసుకోవాలి ? నేను చదువుకుంటే ఏమవుతుంది ? నేను బురఖా లేకుండా స్కూలుకెళ్తే ఏమవుతుంది ? అని నిలదీసిన సాహస బాలిక మలాలా యూసఫ్‌జాయ్. వాటికి బదులు ఇవ్వలేని తాలిబన్లు ఆమెమీద బుల్లెట్లు కురిపించారు. సంకల్ప బలం ముందు తూటాలెంత ? మరింత శక్తిని కూడదీసుకుని ... కేవలం స్వదేశంలోనే కాకుండా... ప్రపంచంలోని ఆడపిల్లలందరి చదువుకోసం పోరాటం సాగిస్తోందా చిన్నారి. బాలికల విద్యా హక్కు కోసం పోరాడుతున్న ఈ సాహసి కృషికి.... అత్యంత ప్రతిష్ఠాత్మక నోబెల్ శాంతి పురస్కారం వరించిన సందర్భంగా... ప్రత్యేక కథనం...

# సాహసి మలాలా

- కె. అంజన

అది బకింగ్‌హామ్‌లోని ఓ స్థానిక పాఠశాల. ఉదయం 10.15 గంటలు. రసాయన శాస్త్రం తరగతి జరుగుతోంది. అప్పుడు టీచర్ పదిహేడేళ్ల అమ్మాయిని పక్కకు పిల్చి... ఆ పాపకు ప్రతిష్ఠాత్మక నోబెల్ బహుమతి వచ్చిన విషయం తెలియచేసింది. అవార్డు వస్తుందని ఊహించని చిన్నారి ఆశ్చర్యానందాలతో ఉబ్బి తబ్బిబ్బైంది. ఆ సంతోషంలో మిగిలిన క్లాసులకు డుమ్మా కొట్టలేదు సరికదా! పూర్తిగా క్లాసులన్నీ అయ్యే వరకు అక్కడే వుంది. ఈ పాటికే మీకు అర్థమైవుంటుంది ఆ అమ్మాయి ఎవరో! అవును తనే పాకిస్తాన్ సాహస బాలిక మలాలా యూసఫ్ జాయ్. క్లాసుల అనంతరం పత్రికల వారి ముందు ఆ అమ్మాయి చెప్పిన విషయాలు ప్రపంచంలోని ప్రతి తండ్రి తప్పక గుర్తుంచుకోవాల్సిన వాక్యాలు. 'నా వెనక నిలబడిన కుటుంబానికి ధన్యవాదాలు. వెన్ను తట్టి నన్ను ముందుకు నడిపిన నా ప్రియమైన అమ్మకు, నాన్నకు ధన్యవాదాలు. మా నాన్న నాకు ప్రత్యేకంగా ఏమీ ఇవ్వలేదు. నేను పైకి ఎగరడానికి కవాల్సిన రెక్కలు కట్టి వేయలేదంతే. నన్ను స్వేచ్ఛగా ఎగరనిచ్చినందుకు నాన్నకు ధన్యవాదాలు' అన్నదా చిన్నారి. విన్నారా నాన్నలూ...!



నోబెల్ గ్రహీతలు కైలాష్ సత్యార్థి, మలాలా యూసఫ్ జాయ్

## సాహస బాలిక

పాకిస్తాన్‌లోని 'స్వాత్' ప్రాంతం. ఇటీవల వార్తల్లో అధికంగా వినిపిస్తున్న పేరు. హిందూకుష్ కనుమల్లో అందమైన లోయ. తూర్పు స్విట్జర్లాండ్‌గా ప్రసిద్ధి. ఓ వైపు పచ్చని చెట్లు, మరోవైపు వేగంగా ప్రవహించే నదులు! అందులో ఒకే ఒక్క నగరం మింగోరా. అదే మలాలా పుట్టిన గడ్డ. తండ్రి ... జియాఉద్దీన్ యూసఫ్ జాయ్. విద్యాధికుడు. స్కూలు యజమాని. విద్యా హక్కు కార్యకర్త. తాలిబన్లకు వ్యతిరేకంగా గట్టిగా నిలబడి పోరాడిన సాహసి. తల్లి ... తోర్‌పెకై! గృహిణి. వీరి తొలి సంతానం మలాలా. 19వ శతాబ్దంలో ఆఫ్ఘన్-బ్రిటిష్ యుద్ధం జరిగినప్పుడు మలాలాయ్ అనే యువతి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడిందట. ఆమె పేరును తన కుమార్తెకు పెట్టాడు జియాఉద్దీన్. తన చిట్టితల్లి కూడా ఆమెలా సాహసి కావాలని కోరుకున్నాడా తండ్రి. తను స్వయంగా బడికెళ్లకపోతేనేం! కుమార్తెకు చక్కటి బుద్ధిని, వ్యక్తిత్వాన్ని, ధైర్యసాహసాలను నూరిపోసిందా తల్లి. అమ్మానాన్నల నుంచి లభించిన ప్రోత్సాహం, మద్దతుతోనే మలాలా అక్షరాలు నేర్చుకోవడానికి అంతగా పట్టుబట్టగలిగింది.

స్వాత్ లోయలో ప్రకృతి సౌందర్యంతోపాటుగా... తాలిబన్ల అరాచక ఆంక్షలు, పాలన కూడా వుండేది. 2007 నుంచి 2009 వరకు ఈ లోయ వారి ఏలుబడిలోనే వుంది. అక్కడ ఆడపిల్లలు, మహిళల జీవితం అనేక కట్టుబాట్లు, నిషేధాల మధ్య నడిచేది. వారు బురఖా వేసుకోకుండా బైటికి అడుగు పెట్టకూడదు. సన్నిహిత బంధువులతో తప్ప ఇతర పురుషులతో మాట్లాడకూడదు. ఇంట్లో టీవీ చూడ్డానికి కూడా లేదు. వీధుల్లో ఆడుకోడానికి లేదు. మహిళలు నవ్వడమూ నిషేధమే. తెలుపు రంగు బట్టల మీద, గోళ్ల రంగు మీద నిషేధం విధించారు. పైగా ఆడపిల్లలకు చిన్నవయసులోనే పెళ్లిళ్లు చేసేవారు. టీనేజర్ అయ్యాక కూడా బురఖా వేసుకునేది

కాదు. దాంతో బంధువుల్లో కోపం వుండేది. ఇక తాలిబన్ల సంగతి సరేసరి.

ఇటువంటి ఆంక్షల రాజ్యంలో హక్కుల కోసం ఎలుగెత్తి నినదించడం చిన్న విషయం కాదు. అలాంటిది చిన్నారుల సంగతి సరేసరి. తాలిబన్ల ఆటవిక రాజ్యంలో బాలల హక్కులకై గళం విప్పింది మలాలా. తుపాకులు, బాంబులతో విరుచుకుపడే శత్రువుతో కలంతో, గళంతో తలపడింది. మతోన్మాదుల కారణంగా అక్షరాలకు దూరమైన చిన్నారుల గళమైంది.

## 'గుల్ మఖాయ్' బ్లాగ్

స్వాత్ ప్రాంతంలో ... మతం పేర తాలిబన్లు విధించిన అనేకానేక ఆంక్షల్లో... ఆడపిల్లలు చదువుకోకూడదన్నది ఒకటి. నాలుగొందల పాఠశాలలను మూసివేశారు. మరీ ముఖ్యంగా బాలికల పాఠశాలలను బాంబులతో ధ్వంసం చేశారు. మలాలా సొంత గ్రామంలో సైతం స్కూలు బోర్డులన్నీ మాయమయ్యాయి. బయటి నుంచి చూసేవారికి అక్కడ స్కూలు వుందన్న విషయమే తెలియదు. తండ్రి స్థాపించిన కుషాల్ స్కూల్లో చదువుకునేదామె. స్కూలు యూనిఫారంలో బడికెళ్తుంటే తాలిబన్లకు తెలుస్తుందని సాధారణ బట్టల్లోనే వెళ్లేవారు. ఆకాశంలోంచి దూసుకెళ్లే తాలిబన్ల విమానాలు, సుదూరంగా విన్పించే తుపాకుల చప్పుళ్ల మధ్య బడికెళ్లాల్సి వచ్చేది చిన్నారులు. కొంతకాలానికి ఆ మాత్రం అక్షర జ్ఞానం అందుకునే అవకాశం కూడా కరవైంది. ఆ ప్రాంతమే ఖాళీ చేయాల్సి వచ్చింది. ఘర్షణలు చల్లారాక తిరిగి సొంత ఊరికి చేరుకునే సరికి అంతా విధ్వంసమే. ఈ ప్రమాదకర పరిస్థితుల్లో... తండ్రితోపాటు పెషావర్ వెళ్లిన మలాలా తొలిసారిగా బహిరంగంగా మాట్లాడింది. 'బడికెళ్లడం నా ప్రాథమిక హక్కు. దాన్ని కాదనే ధైర్యం తాలిబన్లకు ఎవరిచ్చారు?' అని ప్రశ్నించింది. పాకిస్తాన్‌లో ఇది పెద్ద సంచలనమే అయ్యింది. ఇదే కాదు ఆ తర్వాత ... టీవీ ఇంటర్వ్యూల్లోనూ ధైర్యంగా ఆడపిల్లల విద్యా హక్కు గురించి మాట్లాడింది.

2009లో తాలిబన్లకు పాక్ సైన్యానికి మధ్య యుద్ధం నడిచింది. ఆ సమయంలో సామాన్యులు పడుతున్న కష్టాలను, ఎదుర్కొంటున్న సమస్యలను గురించి రాయగలిగిన చిన్నారులను వెతికిపెట్టమని 'బి.బి.సి ఉర్దూ వెబ్‌సైట్' వారు మలాలా తండ్రిని అడిగారు. ఆయన తమ స్కూల్లో రచనాశక్తి కలిగిన పదవ తరగతి పిల్లాణ్ణి పరిచయం చేశాడు. అయితే పెద్దల ఒత్తిడి మేరకు ఆ మరునాటి ఉదయాన్నే వచ్చి తను రాయలేనన్నాడు. దాంతో తన కుమార్తెనే రాయమని ప్రోత్సహించాడు. అలా 'గుల్ మఖాయ్' (జొన్న పువ్వు) అన్న కలం పేరుతో డైరీలా రాసింది మలాలా. తను చూసిన విషయాలనే చిన్న చిన్న వాక్యాలుగా రాసేది. ప్రశ్నించేది. తిరగబడేది. ఇది పాకిస్తాన్‌లో పెద్ద చర్చకే దారితీసింది. జనవరి 3, 2009న మలాలా రాసిన బ్లాగులో ఏముందో చూద్దాం.

"అమ్మ నాకోసం అల్పాహారం తయారుచేసింది. స్కూలుకెళ్లడానికి భయం వేసింది. కారణం! ఆడపిల్లలు పాఠశాలలకు వెళ్లకూడదని తాలిబన్లు ఫత్వా విధించారు. ఆరోజున మొత్తం 27 మందికి కేవలం 11 మంది మాత్రమే పాఠశాలకు హాజరయ్యారు. తాలిబన్ శాసనం చేసిన తర్వాత ... నా ముగ్గురు స్నేహితురాళ్లు కుటుంబాలతో సహా పెషావర్, లాహోర్, రావల్పిండి వెళ్లిపోయారు". పాఠశాల విద్యార్థిని డైరీ రాసుకున్నంత సహజంగా ఎంత బాగా రాసింది మలాలా! ఇలా చిన్న చిన్న వాక్యాలలో ఆమె రాసిన బ్లాగ్ పాకిస్తాన్‌లో మంచి చర్చలు రేపింది. తర్వాత ఆ వార్తలు రాసింది తనేనని బహిరంగంగా ప్రకటించింది కూడా. దాంతో తాలిబన్ల దృష్టి మలాలా మీద పడింది.

## కలల్లోనూ తాలిబన్లే

**బ్లాగు రాతలు, బహిరంగ ప్రదేశాల్లో ఆమె చేస్తున్న ఉపన్యాసాలు, టీవీ ఇంటర్వ్యూలు... చూసిన తాలిబన్లు రెచ్చిపోయారు. పత్రికల్లో వార్తల రూపంలో వారి నుంచి బెదిరింపులు వచ్చేవి. గుర్తు తెలియని వ్యక్తులు చిన్న చిన్న చీటీల మీద బెదిరింపులు రాసి ఆమె మీద విసిరేవారు. మలాలా తండ్రి కూడా తాలిబన్లకు వ్యతిరేకంగా ప్రచారం చేసేవారు. దాంతో ఆయన స్నేహితుణ్ణి పొట్టన పెట్టుకున్నారు తాలిబన్లు. 'ఇక నీ వంతే. జాగ్రత్తగా వుండు' అని తండ్రిని అప్రమత్తం చేసే బంధుమిత్రుల మాటలు విన్నప్పుడు బాధపడిపోయేది మలాలా.** ఈ ఘటనల నేపథ్యంలో ఆమెను స్కూలుకు నడిచి వెళ్లనిచ్చేది కాదు తల్లి. బస్సులోనే వెళ్లమనేది. అయితే స్కూలు బస్సు ఇంటి వరకు వచ్చేది కాదు. వీధి చివరనే ఆపేసేవారు. అక్కడి నుంచి ఇంటివరకు నడిచిరావాల్సి వచ్చేది ఎవరైనా తన మీద దాడి చేస్తే...అప్పుడే చేస్తారనుకునేది.

చిన్నారి కలల్లో సైతం వదిలేవారు కాదు తాలిబన్లు. తను వీధిలో నడుచుకుంటూ వస్తుంటే హఠాత్తుగా ఒక టెర్రరిస్టు మీదకు దూకి కాల్చేసినట్టు కలలు కనేది. అప్పుడు ఏం చేయాలని ఆలోచించేది. కాలి చెప్పు తీసి ఆ టెర్రరిస్టును కొట్టాలనుకునేది. కానీ అలా చేస్తే తీవ్రవాదికి తనకు తేడా ఏం వుందనుకునేది మళ్లీ తనే. 'నన్ను కాల్చు. కానీ నేను చెప్పేది విను. నువ్వు చేస్తున్నది తప్పు. నాకు నీకు ఎలాంటి శత్రుత్వం లేదు. ప్రతి అమ్మాయి స్కూలుకు వెళ్లాలని నేను కోరుకుంటున్నా. అంతకు మించి నాకేం తెలియదు' అని ప్రార్థించాలని అనిపించేదామెకు.

ఆ సమాజంలో అమ్మాయిలు అయితే టీచర్లు, లేకపోతే డాక్టర్లు కావాలి. ఇతర వృత్తుల్లో చేడానికి అవకాశమే లేదు. ఫ్యాషన్ డిజైనర్ కావాలని వున్నా, రాజకీయవేత్త కావాలని వున్నా... పైకి చెప్పగలిగే సాహసం చేసేవారు కాదు అమ్మాయిలు. మలాలా సైతం మొదట డాక్టర్ కావాలని కలలు కంది. తర్వాత సైంటిస్ట్ కావాలనుకుంది. ఆ తర్వాత రాజకీయాల్లోకి వెళ్లాలనుకుంది. అయితే అది

చెప్పే అవకాశం వస్తుందనుకోలా.

## తూటాలకు వెరవని సాహసి

మలాలా, ఆమె కుటుంబం భయపడినట్టే జరిగింది. సరిగ్గా రెండేళ్ల కిందట ... అక్టోబర్ తొమ్మిదవ తేదీ. ఎప్పటిలాగే ఆరోజు స్కూలు బస్సులో స్నేహితులతో కలిసి బయల్దేరింది మలాలా. పేరుకి అది బస్సేగాని...నిజానికి అది టయోటా ట్రక్కు. అన్ని వైపులా మూసి వుండేది. బైటికిచూడ్డానికి వుండేది కాదు. బస్సు మలుపు తిరిగిందన్న విషయం మాత్రమే తనకు తెలుసు. ఈలోగా హఠాత్తుగా 'కుషాల్ స్కూలు బస్సు ఇదేనా?' అన్న మాటలు వినిపించాయి. తర్వాత కొంతమది విద్యార్థుల వివరాలు కావాలన్న మాట వినపడింది. అనంతరం మొహానికి రుమాలు కట్టుకున్న కుర్రాడు 'మలాలా ఎవరు?' అనడగడం... తెలుసుకున్న వెంటనే మూడు సార్లు తుపాకీతో ఆమెను కాల్చడం... రక్తపు మడుగులో మలాలా ఒరిగిపోవడం లిప్తపాటులో జరిగిపోయింది. తన పదకొండవ ఏట నుంచే బాలికల హక్కులకోసం ఉద్యమించినందుకు తాలిబన్లు విధించిన శిక్ష అది. మలాలా ఎడమ కంటి లోపల, భుజం మీద, చెవి మీద ... తగిలాయి బుల్లెట్లు. పాక్ వైద్యులు వెనువెంటనే బుల్లెట్లను తొలగించారు. అందుకోసం పుర్రె భాగాన్ని తొలగించి ... టైటానియం ప్లేటును అమర్చాల్సి వచ్చింది. మెరుగైన వైద్యం కోసం అక్కడినుంచి అరబ్ ఎమిరేట్స్‌కు... అనంతరం లండన్ క్వీన్ ఎలిజబెత్ ఆసుపత్రికి చేర్చారు మలాలాను. అక్కడ అందించిన వైద్యంతో నాలుగైదు నెలలకే లేచి కూర్చోగలిగింది.

కోలుకున్న అనంతరం మీడియాతో మాట్లాడుతూ...మలాలా ఏమన్నదో తెల్సా! "నాకు పునర్జన్మ లభించింది. నాకు ప్రజాసేవ చేయాలనుంది. ప్రతి అమ్మాయి, అబ్బాయి చదువుకోవాలని కోరుకుంటున్నారు. ఆ ఆశయంతోనే మేం 'మలాలా ఫండ్'ను ఏర్పాటు చేశాం. అవసరవేు నేను బలిదానానికి సిద్ధంగా వున్నాను. పాకిస్తాన్‌లో విద్యాభివృద్ధికి ఏదైతే అవసరమో అది చేయడానికి సిద్ధంగా వున్నాను. నా కోరిక ఒకటే ప్రతి బిడ్డా చదువుకోవాలి. మన దేశంలో... మొత్తం ప్రపంచంలో శాంతి నెలకొల్పాలి. శాంతి కోసం నన్ను నేను బలిదానమిచ్చుకుంటాను" అని చెప్పిందా చిన్నారి.

అప్పుడు కూడా తాలిబన్లు ఆమెను విడిచిపెట్టలేదు. ప్రపంచం అంతా ఆమె ఆరోగ్యం కోసం ప్రార్థనలు చేస్తున్న సమయంలో... ఆమెకు మరణశిక్షే సరైనదని ప్రకటించారా తాలిబన్ కర్కోటకులు. దాంతో పాకిస్తాన్ తిరిగి వెళ్లలేకపోయిందా కుటుంబం. బర్మింగ్ హామ్‌లోనే... పాకిస్తాన్‌కు ఐదుగంటల ప్రయాణపు దూరంలో... స్థిరపడ్డారు. అక్కడే స్థానిక పాఠశాలలో చేరి తిరిగి విద్యాభ్యాసాన్ని కొనసాగిస్తున్న మలాలా ప్రపంచ మహిళల విద్యాహక్కుకై పోరాటం మొదలెట్టింది. ఈ ఘటనతో మలాలా అత్యంత సాహసిగా ప్రపంచ గుర్తింపు పొందింది.

## మలాలా రోజు

జులై 12 మలాలా పుట్టిన తేదీ. గత సంవత్సరం ఆ రోజును 'మలాలా డే'గా ప్రకటించింది ఐక్యరాజ్యసమితి. ఆరోజు మలాలా వందలాదిమందిని ఉద్దేశించి ప్రసంగించింది. **"ప్రియమైన మిత్రులారా! వారు భావించవచ్చు... తూటాలకు భయపడి మనం మౌనంగా వుంటామని. కాని వారనుకున్నది సాధించలేకపోయారు. ... నాలో ఏం మార్పు రాలేదు. నాలో విశ్వాసం ఇంకా పెరిగింది. భయం అనేది పూర్తిగా పోయింది. నాలో శక్తి సామర్థ్యాలు మరింత పెరిగాయి. నేను అప్పటి మలాలానే. నా కోరికలు, ఆకాంక్షలు కూడా గతంలోనివే. నేను ఎవ్వరికీ వ్యతిరేకం కాదు. నాపై కాల్పులు జరిపిన తాలిబన్ల మీద కూడా నాకు ద్వేషం లేదు. అతను ఎదురుగా నిలబడినా .. నా చేతిలో తుపాకీ వున్నా కాల్చను... పేదరికం, అజ్ఞానం, తీవ్రవాదంపై పోరాటం ప్రకటిద్దాం రండి.... ప్రపంచాన్ని మార్చడానికి పెన్నూ, పుస్తకం, విద్యార్థీ, ఉపాధ్యాయుడూ వుంటే చాలు. అన్నిటికీ చదువు ఒక్కటే ఉపాయం. అన్నిటికంటే చదువే ప్రధానం...'** అని చెప్పిందా చిన్నారి. విద్యతోనే పరిష్కారం లభిస్తుందని పేర్కొంది.

## నేను మలాలాను

'ఐ యామ్ మలాలా' (నేను మలాలాను) పేరుతో తన ఆత్మకథను ప్రపంచం ముందుంచింది పదిహేడేళ్ల సాహస బాలిక మలాలా. స్వాత్ అమ్మాయిగా తన గురించి, తన అందమైన లోయ గురించే కాదు. అక్కడ తిష్టవేసిన మానవమృగాల్లాంటి తాలిబన్ల వికృత పాలననూ కళ్లకు కట్టిందీ పుస్తకంలో. తను ఎలా పోరుబాట పట్టింది.. తిరుగుబాటు చేసింది.. వివరించింది. భయం గుప్పెట్లో పాక్ ప్రజలు రోజులు వెళ్లదీసిన విధానాన్ని చిత్రీకరించింది. తనను వెంటాడిన తాలిబన్ క్రూరత్వాన్ని, వెన్ను తట్టిన ప్రపంచాన్ని, ఫలించిన వారి ఆశీస్సులను, సాకారమైన తన కలను... అన్నిటినీ ...పూర్తిగా చెప్తుందీ పుస్తకంలో. ఇప్పటికి ఆంగ్లంలోనే కాక పలు ప్రాంతీయ భాషల్లోను అందుబాటులోకి వచ్చింది.

బాలికల విద్యా హక్కు కోసం తూటాలకు వెరవని... వెన్ను చూపని బాల యోధురాలిని వరించిన పురస్కారాలెన్నో. అందిన సన్మానాలెన్నో. అంతర్జాతీయ బాలల శాంతి పురస్కారం, పాకిస్తాన్‌కు చెందిన యువశాంతి పురస్కారం, మదర్ థెరిస్సా మెమోరియల్ అవార్డు, సీమాన్ డి బహోవాయిర్ పురస్కారం, టిప్పరీ ఇంటర్నేషనల్ పీస్ అవార్డుతో పాటు అనేక ఆమె అనేక సన్మానాలు అందుకుంది. ఇక దాడికి గురైన రెండేళ్లకు నోబెల్ శాంతి బహుమతినే దక్కించుకున్న విషయం తెల్సిందే. ప్రపంచాన్ని ప్రభావితం చేసిన పాతిక మంది టీనేజర్లలో మలాలా ఒకరుగా ప్రకటించింది 'టైమ్' పత్రిక.

★

**సీరియల్**

*(గత సంచిక తరువాయి)*

**మరోఅమ్మ (మేరీజోన్స్ ఆత్మకథ)**

# హే మార్కెట్టు విషాదము

1880 నుండి నేను పూర్తిగా కార్మికోద్యమంలో చేరి పనిచెయ్యటం ప్రారంభించాను. అన్ని ప్రధాన పారిశ్రామిక కేంద్రాలలో కార్మికవర్గం తిరగబడే స్థితిలో ఉంది. ఐరోపా దేశాల నుండి గుంపులు గుంపులుగా వలస వచ్చిన కార్మికులతో మురికివాడలు కిటకిటలాడాయి. ఫలితంగా వేతనాలు తగ్గడంతోపాటు అమెరికన్ కార్మికులకు, తాము పోరాడి సాధించుకున్న జీవన స్థితిగతుల స్థాయి తగ్గిపోతుందన్న భయంకూడా పట్టుకుంది. దేశంలో వ్యాపార సంక్షోభం దానితోపాటు నిరుద్యోగం తాండవించింది. నగరాలు ఆకలి, అల్లర్లు, నిరాశతో నిండిపోయాయి. యూరోపియన్ నిరంకుశ ప్రభువుల వలన బాధలు పడి ఇక్కడకు వలస వచ్చిన ఆందోళనకారులు కార్మికులకు ఆర్థిక విముక్తి కోసం రకరకాల పథకాలను బోధించేవారు. ఆందోళనకారులు కార్మికులకు భవిష్యత్తును గురించిన ఆశలు చూపిస్తే పోలీసులు మాత్రం కార్మికులకు లాఠీ దెబ్బలు, అరెస్టులు, జైళ్ళు చూపించేవారు.




**అనార్కిస్టులను అడ్డం పెట్టుకొని యాజమానులు ఉద్యమాన్ని నాశనం చేయాలనుకున్నారు. 8గంటల పనిదినం కోరేవాడు దేశానికి శత్రువని, ద్రోహి అని, అరాచక వాది అని ముద్రవేశారు. ఈ అనార్కిస్టులనే పందికొక్కులు ప్రభుత్వ పునాదులను నమిలి వేస్తున్నాయని ప్రచారం చేశారు. ఉద్యమ తీవ్రత యజమానులకు కంటగింపుగా మారింది.**

చికాగో నగరంలో ఒక సమ్మె తరువాత మరో సమ్మె, అలా సమ్మెల పరంపర సాగేది. కొనసాగింపుగా బహిష్కరణలు, అల్లర్లు జరిగేవి. 1886వ సంవత్సరానికి ముందు వరుసగా లేక్ సీమెన్, డాక్‌లేబర్, రైల్వే వర్కర్స్ సమ్మెలు జరిగాయి. ఈ సమ్మెలను పోలీసుల లాఠీలు, కిరాయి గుండాల దౌర్జన్యంతో క్రూరంగా అణిచివేశారు. కార్మికుల కష్టాలపై కనీస ఆలోచన కూడా చెయ్యలేదు. కార్మికులు తమ జీతాలు పెంచాలనీ, పనిగంటలు తగ్గించాలన్న డిమాండ్లు సాధించుకునేందుకు శాంతియుతంగా జరుపుకొనే సమావేశాలను సైతం జాన్ బానిఫైడ్ అనే పోలీస్ ఇన్‌స్పెక్టర్ క్రూరంగా అణిచివేసేవాడు. ఈ ఉద్యమాల పట్ల యజమానులు విషం గక్కేవారు. ఆ ద్వేషం ఎంత దారుణంగా ఉండేదంటే, 'చికాగో ట్రిబ్యూన్' అనే ఓ యజమానుల పత్రిక 'ఇల్లినోయిస్ రైతులు పంటల్లో కలుపు తీసేందుకు స్ట్రెచ్‌నైన్ పురుగుమందు వేసినట్టే ఇబ్బడిముబ్బడిగా పారిశ్రామిక కేంద్రాలకు వస్తున్న కార్మికుల అన్నంలో కూడా పురుగు మందు వేయాలి' అని సలహా ఇచ్చింది.

సుదీర్ఘ పనిగంటలు భరించలేని కార్మికులు 8 గంటల పనిదినం కోసం సమ్మె ప్రారంభించారు. 'నైట్స్‌ఆఫ్ లేబర్' వంటి కార్మిక సంఘాలు ఈ ఉద్యమానికి అండగా నిలిచాయి. అయితే ఉద్యమ నాయకుల్లో అత్యధికులు ఐరోపా దేశాల నుండి వలస వచ్చిన వారు కావడంతో ఈ ఉద్యమాన్ని విదేశీయంగానూ, ఆమెరికాకు సంబంధం లేనిదిగానూ చూశారు. చాలా చిన్న గ్రూపు అయిన చికాగో అనార్కిస్టులు మాత్రమే 8 గంటల పనిదినాన్ని గట్టిగా సమర్థించారు. అప్పటినుండి చికాగో ప్రజలు అనార్కిజం పట్ల ఆకర్షితులయ్యారు.

అనార్కిస్టులను అడ్డం పెట్టుకొని యాజమానులు ఉద్యమాన్ని నాశనం చేయాలనుకున్నారు. 8గంటల పనిదినం కోరేవాడు దేశానికి శత్రువని, ద్రోహి అని, అరాచక వాది అని ముద్రవేశారు. ఈ అనార్కిస్టులనే పందికొక్కులు ప్రభుత్వ పునాదులను నమిలి వేస్తున్నాయని ప్రచారం చేశారు. ఉద్యమ తీవ్రత యజమానులకు కంటగింపుగా మారింది. చికాగో నగరం రెండు గ్రూపులుగా విడిపోయింది. ఒకవైపు ఆకలి, చలి, నిరుద్యోగంతో బాధలు పడుతూ కార్మికులు రిక్తహస్తాలతో పోలీసు లాఠీలు తూటాలకు, గుండాలకు ఎదురొడ్డి నిలిచారు. మరోవైపు యజమానులు పత్రికలు, పోలీసులు, అధికార యంత్రాంగం అండ దండలతో మదించి ఉన్నారు.

కార్మికుల్లో గూడు కట్టుకున్న అసంతృప్తిని ఉపయోగించుకుని అనార్కిస్టులు తమ సిద్ధాంతాలను ప్రచారం చేసుకున్నారు. మిచిగన్ సరస్సు ఒడ్డున వుండే పెద్ద పెద్ద గుంపులను ఉద్దేశించి ప్రసంగించే వారు. నేనెప్పుడూ అనార్కిజాన్ని సమర్థించలేదు. అయినా నది ఒడ్డున జరిగే సమావేశాలకు

తరచూ వెళ్ళేదాన్ని. కార్మికులకు వారు ఏమి చెబుతున్నారో వినేదాన్ని. యజమానుల మీటింగులు కూడా జరిగేవి. ప్రైరే అవెన్యూలోని జార్జ్ యం. పుల్‌మ్యాన్ ఇంటిలోనో లేక ప్రముఖ కార్పొరేషన్ లాయరు వ్రిక్ట్ డెక్స్‌స్టర్ ఇంటిలోనే కూర్చొని 8గంటల పనిదినం ఉద్యమాన్ని ఎలా నాశనం చెయ్యాలా, అనార్కిస్టుల సమావేశాలను ఎలా అణిచివెయ్యాలా అని కుతంత్రాలు పన్నేవారు.

ఒకవైపు ఎముకలు కొరికే చలికాలం. మరోవైపు దీర్ఘకాలం కొనసాగిన నిరుద్యోగం వల్ల భరించలేని బాధలు బ్రెడ్డుకోసం జనం బారులు తీరి నిలబడేవారు. వేలాది మందికి ఆకలిబాధ అంటే ఏమిటో తెలిసొచ్చింది.

క్రిస్మస్ రోజున ప్రైరే ఎవెన్యూలో ధనవంతుల మేడల ముందు, యజమానుల భవంతుల ముందు మాసిన బట్టలు, చినిగిన బూట్లతో వేలాది మంది పేద కార్మికులు నల్లజెండాలతో ప్రదర్శన చేశారు. ఈ ప్రదర్శన అనార్కిస్టుల పిచ్చిపని. దీనివలన పరిస్థితి ఇంకా దిగజారుతుందని ఊహించాను. అనుకున్నట్లుగానే ఈ చర్య కార్మికులకు మేలు చేయకపోగా హాని చేసింది. యజమానులను ఆందోళన పెట్టింది. పోలీసులను మరింత పాశవికంగా తయారు చేసింది. కార్మికుల అపరిమితమైన బాధల పట్ల ప్రజల్లో రావలసిన సానుభూతిని కూడా తగ్గించింది.

మే 1వ తేదీ 8 గం॥ల పని దినం ఉద్యమానికి ఊపునివ్వాల్సిన రోజు రానే వచ్చింది. వార్తాపత్రికలు అనవసర భయాలను కల్పించేందుకు కావల్సినంత ప్రచారం చేసిపెట్టాయి. నగరం మొత్తం సమ్మెలు, బహిష్కరణలతో నిండిపోయింది. యజమానులు భయంతో వణికిపోయారు. వాళ్ళు విప్లవాన్ని చూశారు. మెక్ కార్‌మిక్ హార్‌వెస్టర్ అనే ఫ్యాక్టరీ ముందు అందులో పనిచేసే కార్మికులు పోగయ్యారు. సమ్మెలోకి రాని కార్మికులను స్కాబ్స్ అని పిలిచేవారు. ఈ స్కాబ్స్‌ను కార్మికులు భయపెట్టారు. వారిపై ఇటుకలు విసిరారు. ఫ్యాక్టరీ అద్దాలు పగిలాయి. ఈ ఘటనలు అల్లర్లకు దారితీశాయి. పోలీసులు ఎటువంటి హెచ్చరికలూ లేకుండా విరుచుకుపడ్డారు. కాల్పులు జరిపారు. లాఠీలతో చితకబాదారు. అనేక మంది గుర్రాల కిందపడి నలిగిపోయారు. కాల్పులలో పెద్ద సంఖ్యలో కార్మికులు చనిపోయారు. తలలు పగిలాయి. పోలీసుల దెబ్బలకు యువతీ యువకులు అసువులుబాశారు. పెట్టుబడిదారులు 'పింకర్‌టెన్ ఏజెన్సీ' సహాయంతో పాత నేరస్థులకు, గుండాలకు ఆయుధాలిచ్చి, ఒక్కొక్కరికి రోజుకు 8 డాలర్లు కూలీ ఇచ్చి సాయుధమూకల్ని తయారు చేశారు. కార్మికులను అడ్డుకునేందుకు, అల్లర్లు సృష్టించేందుకు ఈ మూకల్ని వాడుకున్నారు.

> **మే 1వ తేదీ 8 గం॥ల పని దినం ఉద్యమానికి ఊపునివ్వాల్సిన రోజు రానే వచ్చింది. వార్తాపత్రికలు అనవసర భయాలను కల్పించేందుకు కావల్సినంత ప్రచారం చేసిపెట్టాయి. నగరం మొత్తం సమ్మెలు, బహిష్కరణలతో నిండిపోయింది. యజమానులు భయంతో వణికిపోయారు. వాళ్ళు విప్లవాన్ని చూశారు. మెక్ కార్‌మిక్ హార్‌వెస్టర్ అనే ఫ్యాక్టరీ ముందు అందులో పనిచేసే కార్మికులు పోగయ్యారు. సమ్మెలోకి రాని కార్మికులను స్కాబ్స్ అని పిలిచేవారు. ఈ స్కాబ్స్‌ను కార్మికులు భయపెట్టారు. వారిపై ఇటుకలు విసిరారు. ఫ్యాక్టరీ అద్దాలు పగిలాయి. ఈ ఘటనలు అల్లర్లకు దారితీశాయి.**

మే 4 సాయంత్రాన మురికి కూపంలా ఉండే 'హే మార్కెట్ స్క్వేర్' లో అనార్కిస్టులు సమావేశం జరిపారు. ఈ ప్రాంతమంతా పేదలతో నిండిన రైల్వే ట్రాక్స్, మాసిన సెలూన్‌లు, మురికి ఇళ్ళతో నిండివుంది. దీనికి కొద్ది దూరంలో డెస్ ప్లైన్ పోలీస్‌స్టేషన్ వుంది. ఈ స్టేషన్‌కు జాన్ బానిఫైడ్ ఇనస్పెక్టరుగా ఉండేవాడు. ఈ జాన్ బానిఫైడ్ ఇనస్పెక్టర్ చాలా క్రూరుడు. విచక్షణ, జాలీ, ఇంగితజ్ఞానం లేనివాడు. పాశవికంగా అణిచివెయ్యడమే పారిశ్రామిక అశాంతికి పరిష్కారమని నమ్మేవాడు.

చికాగో మేయర్, కార్టర్ హారిసన్ అనార్కిస్టుల మీటింగ్‌కు హాజరయ్యాడు. అక్కడున్న జనాల మధ్య తిరిగాడు. బయటకు వచ్చిన తరువాత పోలీస్ చీఫ్ దగ్గరకు వెళ్ళి, ఎవరికీ తెలియని పోలీసులను మీటింగ్ దగ్గరకు పంపమని ఆదేశించాడు. ఎందుకంటే తెలిసిన పోలీసులు వెళితే అప్పటికే కార్మికుల గుండెల్లో రగులుతున్న అగ్నికి ఆజ్యం పోసినట్లౌతుందని కానీ బహుశా ఇతర అధికారుల నుండి ఆదేశాలు వచ్చిన ఫలితంగా కావచ్చు. మేయర్ ఆదేశాలను పక్కనబెట్టి, పోలీస్ చీఫ్ అందరికీ తెలిసిన పోలీసులను భారీసంఖ్యలో మీటింగు దగ్గరకు పంపాడు. ఒక అనార్కిస్టు నాయకుడు మీటింగులో ప్రసంగిస్తున్నాడు. అంతలోనే ఎదురుగా ఉండే ఒక కిటికీగుండా బాంబు వచ్చిపడింది. ఈ బాంబు దాడిలో కొంతమంది పోలీసులు చనిపోయారు.

ఈ చర్యతో నగరం వెర్రెక్కిపోయింది. వార్తాపత్రికలు నగరాన్ని పిచ్చాసుపత్రిలా వుంచడానికి చెయ్యాల్సినదంతా చేశాయి. కార్మికులు న్యాయంకోసం చేసిన పోరాటం ప్రతీకార వాంఛ మాటున మరుగున పడిపోయింది. ప్రతీ ఐదు నిముషాలకీ బాంబులు "దొరికాయి" అనే పుకార్లు షికార్లు చేశాయి. జనం సాయుధులయ్యారు. రాత్రుళ్ళు కూడా తుపాకుల దుకాణాలు తెరిచే వున్నాయి. వందలకొద్దీ అరెస్టులు జరిగాయి. 8 గంటల పనిదినం ఉద్యమకారులను అరెస్టు చేశారు. వాళ్ళపై విచారణ జరిపి కొన్ని నెలల తరువాత ఉరి తీశారు. అయితే ఆరోజు బాంబులు విసిరిన స్నాబెల్ట్ అనేవాడ్ని ఈ కేసునుండి తప్పించారు. ప్రభుత్వ అధికారులు నడిపిన ఈ భయంకరమైన నాటకంలో అతని పాత్రను కప్పిపెట్టారు.

*తరువాయి 21వ పేజీ*



# ప్రజలు గళం విప్పాలి

(మాలిని భట్టాచార్య ఇంటర్వ్యూ - కె. అంజన)

ఒకప్పటి ఎర్రకోట పశ్చిమబెంగాల్. 34 సంవత్సరాల అనంతరం తొలిసారిగా వామపక్షేతర పార్టీ అధికారాన్ని చేపట్టింది. ఈ మూడేళ్లగా రాష్ట్రంలో అధికార పార్టీ తృణమూల్ కాంగ్రెస్ (టి.ఎం.సి), అది పెంచిపోషిస్తున్న సంఘ వ్యతిరేక శక్తులు సాగిస్తున్న దారుణాలు అన్నీ ఇన్నీ కావు. ఈ స్వల్ప కాలంలోనే ప్రజాస్వామిక విలువలు, మానవ హక్కులకు అయిన గాయాలెన్నో. మరీ ముఖ్యంగా మహిళల భద్రత అందని ద్రాక్షే అయ్యింది. అత్యాచారాలు, సామూహిక అత్యాచారాలు, హత్యలు నిత్యకృత్యమయ్యాయి. ఇటువంటి పరిస్థితుల్లో మహిళల భద్రత కోసం, న్యాయం కోసం పెద్ద ఎత్తున పోరాటాలు చేయాల్సి వస్తోందంటున్నారు అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం అధ్యక్షురాలు మాలినీ భట్టాచార్య. పశ్చిమ బెంగాల్‌లో అంతకంతకు పెరిగిపోతున్న హింస, నేరాలు... వాటికి వ్యతిరేకంగా తాము చేస్తున్న పోరాటాల గురించి ... ఐద్వా ఏ.పి 13వ మహాసభల సందర్భంగా విజయవాడ విచ్చేసినప్పుడు మాలిని చెప్పిన వాస్తవాలు...

**పశ్చిమబెంగాల్‌లో ఓ మహిళ తొలిసారిగా ముఖ్యమంత్రి పీఠాన్ని అధిష్టించారు. రాష్ట్రంలో మహిళల భద్రత ఎలా వుంది ?**

ఈ మూడేళ్లలో రాష్ట్రంలో ఆడవాళ్లపై నేరాలు పెద్ద ఎత్తున జరిగాయి. ప్రధానంగా లైంగిక నేరాలు. 2013లో ఇవి కొద్దిగా తగ్గుముఖం పట్టినా... గృహ హింస బాగా పెరిగింది. రాజకీయ హింస దీనికి తోడవుతోంది. ఈ రెండు రకాల హింసలకు సన్నిహిత సంబంధం వుంది. ప్రతిపక్ష పార్టీలకు చెందిన మహిళలను కొట్టడం, ఇళ్లలోంచి బయటకు లాగడం, హత్యలు చేయడం వంటి ఘటనలు వున్నాయి. ముఖ్యంగా యువతులపై లైంగిక హింస పెరిగింది. ఆడపిల్లల రక్షణ ప్రమాదంలో పడింది. అత్యాచారాలు, సామూహిక అత్యాచారాలు, అనంతరం హత్యలు, మైనర్ బాలికల హత్యలు సాధారణమైపోయాయి. అధికశాతం ఘటనలు క్రూరాతిక్రూరంగా వుంటున్నాయి. కొన్ని కేసుల్లో అధికార పార్టీకి సంబంధించిన వారి ప్రత్యక్ష పాత్ర వుంటోంది.

**ముఖ్యమైన దాడుల గురించి వివరిస్తారా ? !**

ఇటీవల జరిగిన మూడు కేసుల గురించి తప్పక ప్రస్తావించుకోవాలి. అజ్మీరా బేగం! నార్త్ 24 పరగణాలో పంచాయతీ సభ్యురాలు. లోక్ సభ ఎన్నికలు పూర్తయిన వెంటనే ఆమె హత్య జరిగింది. తృణమూల్ పార్టీకి చెందిన సాయుధ సంఘ వ్యతిరేక శక్తులు దౌర్జన్యంగా ఆమె ఇంట్లోకి ప్రవేశించి ఈ ఘాతుకానికి పాల్పడ్డాయి. లోక్ సభ ఎన్నికల్లో ఆమె చురుగ్గా పనిచేయడం, పోలింగ్ బూత్‌ల ఆక్రమణకు అంగీకరించకపోవడంతో ఆమె ప్రాణాలు తీయడానికి తెగబడ్డాయి. తూర్పు మిద్నపూర్‌కు చెందిన దీపాలీగిరి స్థానిక ఐద్వా నేత. టి.ఎం.సి గూండాల బెదిరింపుల కారణంగా ... ఆమె భర్త, కుమారుడు ఇంట్లో వుండ గలిగిన పరిస్థితి లేదు. వారిని గ్రామానికి రప్పించాలని, లేని పక్షంలో పెద్దమొత్తంలో జరిమానా చెల్లించాలని హుకుం జారీ చేశారు స్థానిక 'నేతలు'. ఆ రెండిట్లో ఏదీ చేయలేకపోయిందన్న సాకుతో ఆమె ఇంట్లోకి జొరబడి ... వివస్త్రను చేసి అత్యాచారం చేయడమే కాక ప్రాణాలనూ హరించారు. జల్పాయ్‌గురి జిల్లాలో ఓ పాఠశాల విద్యార్థినిని ఒకే గ్యాంగు వేర్వేరు ప్రదేశాల్లో మూడు సార్లు అత్యాచారం చేసి ... ఆఖరుకు హత్య చేసింది. మృతురాలి తండ్రి బీహార్ నుంచి బెంగాల్ వలసవచ్చిన రిక్షా కార్మికుడు. ఈ కుటుంబం సిఐటియు మద్దతుదారులే.

**పోలీసులు, న్యాయస్థానాలు, పాలనా యంత్రాంగం, అధికార పార్టీ స్పందన ఎలా వుంది ?**

హత్యలు, అత్యాచారాలకు పాల్పడినా ఎవ్వరూ తమను ఏమీ చేయలేరన్న ధీమా సంఘ వ్యతిరేక శక్తులలో కన్పిస్తోంది. దీనికితోడు ముఖ్యమంత్రి మొదలుకొని మంత్రులు, ఎమ్మెల్యేలు, ఉన్నతాధికారుల వరకు వివిధ సందర్భాలలో ఇస్తున్న ప్రకటనలు నేరస్తులను ప్రోత్సహించేలా వుంటున్నాయి. 'ఇది తప్పుడు కేసు. ప్రభుత్వాన్ని అపఖ్యాతి పాల్జేసేందుకు పన్నిన కుట్ర' అన్న మాటలు వీరి నోటెంట తరచూ

వినిపిస్తున్నాయి. కామ్‌ధునిలో బాలికపై సామూహిక అత్యాచారం-హత్యకు సంబంధించిన ఘటనపై ముఖ్యమంత్రి మమతా బెనర్జీ స్పందించిన తీరు సభ్యసమాజాన్నే ఆశ్చర్యపరచింది. ఘటన జరిగిన పది రోజులకు ముఖ్యమంత్రి అక్కడకు వెళ్లారు. ఆమెతో మాట్లాడ్డానికి వచ్చిన మహిళలను 'మీరంతా మావోయిస్టులు. సిపిఎం కార్యకర్తలు. నోరు మూసుకోకపోతే ఊరుకునేది లేదు...' అని తనదైన శైలిలో మాట్లాడారామె. నిజానికి ఆ గ్రామంలో టిఎంసి మద్దతుదారులే ఎక్కువ. తనను కలిసి మాట్లాడాలన్న కుతూహలంతో వెళ్లిన మహిళలను మమత ఆ విధంగా సత్కరించారు! ఇక, తృణమూల్ కాంగ్రెస్ ఎం.పి., జాతీయ స్థాయి నాయకుడు అయిన తపస్‌పాల్ 'సి.పి.ఎం మహిళలను బయటికి లాగి అత్యాచారం చెయ్యమని' ప్రకటన ఇస్తుంటే మిగతా వారి గురించి ప్రత్యేకంగా చెప్పేదేముంది? ఇతని మీద కేసు పెట్టాం. సి.ఐ.డి వారు ఎఫ్.ఐ.ఆర్ నమోదు చేసుకొని అవసరమైన చర్యలు చేపడతామన్నారు.

పోలీసులు అధికశాతం కేసులను మూసివేసేందుకు ప్రయత్నించారు. వక్రీకరణల సంగతి సరేసరి. అత్యాచారానికి గురై హత్య గావించబడిన జల్పాయ్‌గురి పాఠశాల విద్యార్థిని ఆత్మహత్య చేసుకుందని పోలీస్ కమిషనర్ వక్రీకరించి చెప్పారు. వివస్త్రను చేసి ఊరేగించి మరీ హత్యగావించిన ఐద్వా కార్యకర్త మరణాన్ని సైతం ఆత్మహత్యగా చిత్రించే ప్రయత్నం చేశారు. గతంలోనూ అత్యాచారాలకు సంబంధించిన కేసులున్నాయి. అయితే పోలీసులు కేసులు ఫైల్ చేసుకుని, విచారణ చేపట్టేవారు. ప్రస్తుత ప్రభుత్వం, పాలనా యంత్రాంగం ధోరణి ఎలా వుందంటే కేసులు చేపట్టడానికి కూడా సుముఖంగా లేదు. ఒక వేళ కేసు నమోదు చేసుకున్నా సాక్ష్యాలను తారుమారు చేయడానికి కూడా వెనకాడట్లా. మధ్యమ్‌లో జరిగిన టాక్సీ డ్రైవర్ కుమార్తె అత్యాచార ఘటనలోనూ సాక్ష్యాలను నాశనం చేయాలని చూశారు పోలీసులు. ఫోరెన్సిక్ పరీక్షలు చేయించకుండానే దహన సంస్కారాలు చేసేయాలని చూశారు. ఐద్వా, సిఐటియు కలగచేసుకొని శవాన్ని స్వాధీనం చేసుకొని ఫోరెన్సిక్ పరీక్షకు పంపించారు. ఘటన జరిగి ఏడాది పూర్తయింది. ఇప్పటికీ కేసు నడుస్తూనే వుంది. హింసాత్మక ఘటనలకు తోడు తృణమూల్ కాంగ్రెస్ ముఠాల మధ్య నిత్యం ఘర్షణలు జరుగుతుంటాయి. ఇన్నిటి మధ్య రాష్ట్రంలో భద్రత కరవైంది. చట్టం చట్టుబండలైంది. ఇలాంటి పరిస్థితుల్లో న్యాయం కోసం పెద్ద ఎత్తున ఉద్యమించాల్సి వస్తోంది. ఇన్నింటి మధ్యన ఒక మంచి మాత్రం జరిగింది. హింసాత్మక ఘటనలను ప్రభుత్వం అడ్డుకోలేకపోయిందని, పరోక్షంగా అసాంఘిక శక్తులను ప్రోత్సహిస్తోందన్న వాస్తవం ప్రజలకు అర్థమైంది.

**ఇన్ని నేరాలు ఘోరాలు చోటు చేసుకుంటున్నాయి. నేరస్థులకు ఏమేరకు శిక్షలు పడుతున్నాయి ?**

ఈ పరిస్థితుల్లో న్యాయం జరుగుతుందని ఆశించలేకున్నాం. పోరాటం ద్వారానే కొద్దిగానైనా సాధించగలుగుతున్నాం. 'కామ్‌ధుని ఘటన'నే చూద్దాం. ఐద్వా, ఇతర ప్రజాసంఘాలు, వ్యక్తులను కలుపుకుని 'ప్రొటెస్ట్ ఫారమ్'ను ఏర్పరిచాయి. ఇప్పటికీ పోరాటం నడుస్తోంది. నేరస్థుల్లో ఇద్దరు ముగ్గురు టి.ఎం.సికి సంబంధించిన వారున్నారు. పోస్ట్ మార్టమ్ నివేదిక, ఫోరెన్సిక్ నివేదికలను తారుమారు చేసేశారు పోలీసులు. కొన్ని సాక్ష్యాలను మార్చేశారు. చిట్టచివరికి కొందరిని అరెస్టు చేయగా...మరికొందరు ఇప్పటికీ దర్జాగా బయటే తిరుగుతున్నారు. ప్రజల నుంచి పెద్దఎత్తున వ్యతిరేకత, నిరసన రావడం వల్ల కేసు ఆమాత్రమైనా ముందుకు కదిలింది.

పదహారేళ్ల గిరిజన బాలిక సామూహిక అత్యాచారం కేసులో నేరస్థులకు శిక్ష పడింది. అందుకోసం పెద్ద ఎత్తున పోరాడాల్సి వచ్చింది. ఇతర సంఘాలతో కలిసి జాతీయ మహిళా కమిషన్‌కు (ఎన్.సి.డబ్ల్యు) రాశాం. రాష్ట్రానికి ఒక బృందాన్ని పంపమని ఛైర్‌పర్సన్‌ని కోరాం. ఆ బృందం రాష్ట్రానికి వచ్చినప్పుడు నేనక్కడే వున్నాను. మహిళా కమిషన్ పూర్వ సభ్యురాలిని కావడంతో నన్ను కూడా వారితో కలిసి వెళ్లమని ఛైర్‌పర్సన్ అడిగారు. బాధిత గిరిజన బాలికను, ఆమె తల్లిదండ్రులను, గ్రామస్తులను కలిసి మాట్లాడాం. పలు సంఘాల నుంచి వచ్చిన తీవ్ర వత్తిడి, జాతీయ స్థాయి వ్యతిరేకత, నిరసన ఫలితంగా... విచారణ శీఘ్రంగా జరిగి 13 మంది నేరస్థులకు 20 సంవత్సరాల జైలుశిక్ష పడింది. మాల్దాలో జరిగిన అత్యాచారం... అనంతర హత్య కేసులో కూడా త్వరగానే శిక్ష పడింది.

**హింసాత్మక ఘటనల వెనక రాజకీయ లబ్ధి కాకుండా మరేమైనా కారణాలున్నాయా?**

అధికారంలో వున్నవారికి రాష్ట్రం మీద పూర్తి నియంత్రణ వుండాలి. పోలీసులు, పరిపాలనా విభాగం సక్రమంగా పనిచేస్తే తమకు రక్షణ లభిస్తుందని ప్రజలకు విశ్వాసం ఏర్పడుతుంది. కానీ పశ్చిమబెంగాల్‌లో ప్రభుత్వం పూర్తిగా విఫలమైంది. రాష్ట్రం పూర్తిస్థాయిలో నేరపూరితమైపోయింది. అది సి.పి.ఎం, వామపక్ష కుటుంబమా... మరొకటా అన్న దాంతో సంబంధం లేకుండా హింస జరుగుతోంది. రాజకీయాల్లోకి సంఘ వ్యతిరేక శక్తులు ప్రవేశించాయి. రాష్ట్రంలో గతంలోనూ నేరాలు జరిగాయి. అయితే పోలీసులు కేసు తీసుకోకపోతే మహిళా కమిషన్‌ను కలిసేవారు. ఇవాళ మహిళా కమిషన్ వున్నా... మౌనం వహిస్తోంది. మానవహక్కుల కమిషన్ ఛైర్మన్‌గా మాజీ పోలీస్ చీఫ్‌ని నియమించారు. ఇది పూర్తిగా చట్ట వ్యతిరేకం. విశ్రాంత న్యాయమూర్తిని, రాష్ట్రపాలనతో సంబంధంలేని... అంతటి

స్థాయి కలిగిన వారిని మాత్రమే ఆ పదవిలో నియమించాలి. రిటైర్ట్ పోలీస్ అధిపతిని ఆ పదవిలో నియమించాక ... ఎలాంటి మానవ హక్కులను ఆశించగలం?

**మహిళలపై ఇంతటి హింస జరుగుతుంటే...దీనికి వ్యతిరేకంగా మేధావులు గళం విప్పరెందుకు ?**

మేధావులు మౌనం వీడకపోవడానికి ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలు ప్రధాన కారణం. ఉదాహరణకు... రాష్ట్రంలో నాటక రంగానికి చెందిన సమూహాలు అనేకం వున్నాయి. అన్యాయంపై గొంతు విప్పిన పక్షంలో ... ప్రభుత్వ వేదికలపై వీరికి స్థానం లభించడం లేదు. అదే సమయంలో మౌనంగా వున్నవారికి తక్షణ ప్రయోజనాలను అందించడంలో పాలకపక్షం ముందుంది. పలురకాల పదవులు, ఆర్థిక వెసులుబాట్లు కలిగిస్తోంది. మాట వినని ఎడల భయభ్రాంతులను చేస్తోంది. ఈ రెండు కోవలకు చెందని మేధావులు కొందరున్నారు. వీరు రాజకీయేతర మేధావులుగా గుర్తింపు పొందాలని ఆశిస్తున్నారు. దాంతో ఈ ఘోరాలపై గొంతు విప్పడానికి జంకుతున్నారు.

**రాష్ట్రంలో పలు సమస్యలపై, మహిళల రక్షణకై చేస్తున్న పోరాటాలలో... ఐద్వాకు, సి.పి.ఎంకు ఎటువంటి సమస్యలు, ఇబ్బందులు ఎదురౌతున్నాయి ?**

నేరపూరిత రాజకీయాల వల్ల, రాజకీయాల్లో సంఘ వ్యతిరేక శక్తుల జోక్యం వల్ల ... సమస్య ఉత్పన్నమైన చోటికి వెళ్లడానికి... మహిళలను కలవడానికి, సమీకరించడానికి కూడా అవకాశం లేకుండా పోతోంది. సభ్యత్వం గురించే కాదు! మేం చేపట్టిన కార్యక్రమాలను కింది స్థాయి వరకూ తీసుకుపోవడం కష్టమౌతోంది. అందుకోసం నూతన మార్గాలను వెతకాల్సి వస్తోంది. దిగువస్థాయి మహిళలతో, కార్యకర్తలతో సంబంధాలు నిలబెట్టుకోలేని పక్షంలో ... మా సంఘాలపై పట్టు కాపాడుకోవడం కష్టమౌతుంది. ఈ పరిస్థితుల్లో మేం వెనకపట్టు పట్టినట్టు అనిపించినా... దీపాలీ, అజ్మీరా బేగం వంటి మా మహిళలు... తమపై జరిగిన అన్యాయాలకు శక్తిమంతమైన నిరసన తెలిపారు. హింసాత్మక ఘటనలు జరిగిన ప్రతి చోటా ప్రజల నుంచి గొప్ప తిరుగుబాటు కనిపించింది. కనకనే కేసులు ఆ మాత్రమైనా ముందుకు కదులుతున్నాయి.

అమానవీయ దాడులకు వ్యతిరేకంగా ప్రజలు మరింతగా గళం విప్పాల్సిన అవసరం ఎంతైనా వుంది. విశాల సాంస్కృతిక వేదికలను ఏర్పాటు చేసి వామపక్షేతర సంస్థలను, మేధావులను, కవులు, కళాకారులను కలుపుకు పోవడానికి ప్రయత్నిస్తున్నాం. ఇది వామపక్ష పార్టీలకు, తృణమూల్ కాంగ్రెస్‌కు మధ్య మాత్రమే జరిగే ఘర్షణ కాదు. ప్రజాస్వామిక హక్కులను హరిస్తోన్న దుష్ట శక్తులపై జరుగుతున్న పోరాటమని తెలియడానికి, తెలుసు కోవడానికి కొంత సమయం పడుతుంది.

★

---

*18వ పేజీ తరువాయి*

8 గంటల పనిదినం ఉద్యమ నాయకులను, నవంబర్ 11 శుక్రవారం నాడు ఉరితీశారు. ఆరోజున చికాగో నంవన్నులు ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయ్యారు. జైలుకి అన్ని వైపులతాళ్ళు కట్టారు. తాళ్ళ వెంట రైఫిళ్ళు చేతపట్టిన పోలీసులు నిలబడ్డారు. జైలుకు దారితీసే అన్ని రోడ్ల మీద ప్రత్యేక పోలీస్ గస్తీ ఏర్పాటు చేశారు. జైలు పైకప్పు కూడా పోలీసులతో నిండింది. పత్రికలు జైలు ఘటనలతో, ప్రజల తిరుగుబాటు కథనాలతో ప్రజల ఊహాగానాలకు ఉప్పందించాయి. వాస్తవానికి జైలు నుండి ఎటువంటి ప్రతిఘటనలు లేవు. ఎటువంటి క్రొత్త కథలు లేవు. ఒక్క లూయిస్ లింగ్ తప్ప. ఈ హింసను ఖండించిన వారందరిలోనూ సరిగ్గా ఘటనపై మాట్లాడిన వాడు లూయిస్ లింగ్ మాత్రమే. తన ప్రాణాలను పణంగా పెట్టి ఉరికంబాన్ని ఓడించిన వీరుడు ఇతడే !

తరువాతి ఆదివారం ఉరితీయబడ్డ వారి అంత్యక్రియలు జరిగాయి. అమరవీరుల వెనకాల వేలాది మంది కార్మికులు నడిచారు. వారు అనార్కిస్టులే కావచ్చు, కానీ వారు అమరవీరులు. వారి సిద్ధాంతాలు ఏమైనప్పటికీ వారు కార్మికుల హక్కుల కోసం జరిగిన పోరాటంలో అశువులు బాశారు. ఈ ప్రదర్శన కిక్కిరిసిన జనంతో నిశ్శబ్దంగా మైళ్ళకొద్దీ సాగింది. వాల్డ్ హైమ్ స్మశానంలో ఉరితీసిన వారిని ఖననం చేశారు. వారితోపాటు వారి ఆశయం మాత్రం ఖననం కాలేదు. 8 గం॥ల పనిదినం కోసం, మానవీయ పనిపరిస్థితుల కోసం, మనిషికీ మనిషికి మధ్య మెరుగైన సంబంధాలకోసం పోరాటాలు జరుగుతూనే ఉన్నాయి.

ఏడు సంవత్సరాల తరువాత గవర్నర్ ఆల్ట్‌గ్లెడ్ ఈ కేసు సాక్ష్యాలను అన్నింటినీ చదివి అప్పటికీ బ్రతికి ఉండి ఉరిశిక్షనుండి తప్పించుకుని యావజ్జీవశిక్ష అనుభవిస్తున్న ముగ్గురు అనార్కిస్టులకు క్షమాభిక్ష ప్రసాదించారు. అప్పటి తీర్పు అన్యాయమైనదన్నారు. ఈ ప్రకటన అతనికి రాజకీయంగా ఆత్మహత్యా సదృశ్యమయ్యింది. అయితేనేం సత్యాన్ని ధైర్యంగా ఒప్పుకొనే వారందరి హృదయాలలో ఆయన చిరస్థాయిగా నిలిచారు.

**పాదసూచికలు :**

అ స్కాబ్స్ = కార్మికులు సమ్మెలో ఉండగా వారి స్థానంలో యజమానులు కొత్త కార్మికుల్ని పనిలో పెట్టుకుంటే అలా కొత్తగా వచ్చిన కార్మికులను స్కాబ్స్ అనేవాళ్ళు లేదా ఒకవైపు సమ్మె జరుగుతుండగా మరోవైపు సమ్మె విచ్ఛిన్నంచేసి పనిలోకి వెళ్ళేవాళ్ళను కూడా స్కాబ్స్ అనేవాళ్ళు.

★

మరణ సందేశం

# నా మరణానికి ముగింపులేదు...

మరణ సందేశం



రేప్ చేయాలని ప్రయత్నించిన వ్యక్తిని ఆత్మరక్షణలో భాగంగా హతమారిస్తే అది మన దేశంలో నేరం కాదు. కానీ ఇరాన్‌లో అతిపెద్ద నేరం. దానికి శిక్ష ఉరి. ఇలాంటి కేసులో రెహనా జబ్బారీని గత వారం ఇరాన్‌లో ఉరి తీసారు. ఇస్లామిక్ షరియత్ చట్టాలు అమలులో ఉన్న ఇరాన్‌లో జరిగిన ఈ సంఘటనపై అంతర్జాతీయంగా పెనుతుపాను చెలరేగింది. ఈ నేపథ్యంలో తనకు మరణ శిక్ష పడిందని తెలిసిన తర్వాత రెహనా తన తల్లికి ఒక వాయిస్ మెసేజ్‌ను పంపింది. ఆమెను ఉరితీసిన తర్వాత అధికారులు దీనిని విడుదల చేశారు. భగవంతుడి న్యాయస్థానంలో మనం ముద్దాయిలం కాదు అని తన తల్లికి ధైర్యం చెప్పటానికి ప్రయత్నించిన రెహనా తన శరీర అవయవాలను దానం చేయమని కూడా కోరింది. కరుడుగట్టిన హృదయాలను సైతం కరిగించే ఆమె పంపిన సందేశానికి తెలుగు అనువాదమిది.

**డియర్ షోలి,**

నేను క్విసాస్ (ఇరాన్ న్యాయవ్యవస్థలో ఒక అంశం) ను ఎదుర్కోవాల్సిన సమయం ఆసన్నమయిందనే విషయం ఈ రోజే నాకు తెలిసింది. ఈ విషయాన్ని నువ్వే నాకు చెప్పి ఉండాల్సింది. నా జీవితంలో ఆఖరి అధ్యాయానికి చేరుకున్నానని తెలిసిన తర్వాత నువ్వు నాకు ఈ విషయం చెప్పకపోవటం బాధ కలిగించింది. నాకు ఈ విషయం తెలుస్తుందని నువ్వు అనుకోలేదా? నువ్వు విషాదంగా ఉన్నావనే ఆలోచనే నన్ను ఇబ్బంది పెడుతోంది. నీ చేతిని, నాన్న చేతిని ముద్దాడే అవకాశాన్ని నాకు ఎందుకు ఇవ్వలేదు? ఈ ప్రపంచం నన్ను 19 ఏళ్ళు బతకనిచ్చింది. నన్ను చంపేసి నా శరీరాన్ని నగరంలో ఏ మూలో విసిరేసి, కొద్ది రోజుల తర్వాత మార్చురీలో నా శవాన్ని గుర్తించమని నిన్ను తీసుకువెళ్లేవారు. నన్ను రేప్ చేశారనే విషయం కూడా నీకు అపుడే తెలిసేది. నన్ను చంపిన వ్యక్తి ఎవరో కూడా ఎవ్వరికి తెలిసి ఉండేది కాదు. ఎందుకంటే వాళ్ల దగ్గర ఉన్నంత సంపద, శక్తి మన దగ్గర లేదు. ఆ తర్వాత నువ్వు సిగ్గుతో తలదించుకొని జీవితాన్ని గడపాల్సి వచ్చేది. అలా గడిపి... గడిపి.. బాధతో కొన్ని రోజుల తర్వాత నువ్వు కూడా మరణించి ఉండేదానివి. కథ అక్కడితో ముగిసిపోయి ఉండేది.

అయితే ఒక్క దెబ్బతో మొత్తం కథంతా మారిపోయింది. నా శరీరాన్ని నగరంలో ఏ మూలో పడేయలేదు. మొదట ఈవిన్ జైలులోను, ఇపుడు శ్మశానంలాంటి పరార్ ఈరే జైలులోను ఉంచారు. అయితే ఈ విషయాలు వేటికీ నేను ఫిర్యాదు చేయదలుచుకోలేదు. జీవితానికి మరణం ఒకటే ముగింపు కాదనే విషయం నీకు కూడా తెలుసు. ఈ ప్రపంచంలోకి వచ్చే ప్రతి వ్యక్తి కొన్ని అనుభవాలను సంపాదించుకోవటానికి, కొన్ని గుణపాఠాలు నేర్చుకోవటానికి, కొన్ని బాధ్యతలు నెరవేర్చటానికి, వస్తాడని నువ్వు నాకు చెప్పేదానివి. ఈ ప్రయాణంలో కొన్ని సార్లు మనం పోరాడాల్సి వస్తుందనే విషయాన్ని నేను నేర్చుకున్నా. నన్ను ఒక వ్యక్తి కొరడాతో కొట్టినప్పుడు అక్కడే ఉన్న మరొక వ్యక్తి ప్రతిఘటించాడు. అతనిని కూడా కొరడాతో కొడితే ఆ దెబ్బలకు అతను మరణించాడని నువ్వు నాకు చెప్పావు. ఒక వ్యక్తి చనిపోయినా పర్వాలేదు. కానీ ఈ మరణం వెనకున్న కారణం, దానికున్న విలువ గురించి అందరికీ తెలియాలి.

స్కూలుకు వెళ్లినపుడు, దెబ్బలాటలు వస్తాయని.. ఫిర్యాదులు చేస్తూ ఉంటారని వాటిని మనం ఎదుర్కోవాలని నువ్వు చెబుతూ ఉండేదానివి. మా ప్రవర్తనకు నువ్వు ఎంత ప్రాధాన్యం ఇచ్చేదానివో గుర్తుందా? అయితే నీ అనుభవం తప్పు. నన్ను ఒక వ్యక్తి రేప్ చేయటానికి ప్రయత్నించినప్పుడు నీ పాఠాలేమి పనిచేయులేదు. కోర్టులో హంతకురాలిగా చిత్రీకరించినపుడు అవి నన్ను కాపాడలేదు. కోర్టులో నన్ను ఒక హంతకురాలిగా చిత్రీకరించారు. నేను

> **మా ప్రవర్తనకు నువ్వు ఎంత ప్రాధాన్యం ఇచ్చేదానివో గుర్తుందా? అయితే నీ అనుభవం తప్పు. నన్ను ఒక వ్యక్తి రేప్ చేయటానికి ప్రయత్నించినప్పుడు నీ పాతాలేమి పనిచేయలేదు. కోర్టులో హంతకురాలిగా చిత్రీకరించినపుడు అవి నన్ను కాపాడలేదు. కోర్టులో నన్ను ఒక హంతకురాలిగా చిత్రీకరించారు. నేను కోర్టులో ఏడ్వలేదు. నన్ను క్షమించమని ప్రాధేయపడలేదు. నేను న్యాయాన్ని నమ్మాను. అందుకే ఒక్క కన్నీరు బొట్టు కూడా కార్చలేదు. నేను ఎప్పుడూ దోమలను కూడా చంపలేదని నీకు తెలుసు. బొద్దింకలను కుడా వాటి మీసాలు పట్టుకొని బయటపడేసేదాన్ని. అంతే తప్ప చంపేదాన్ని కాదు. అలాంటి నేను ఇప్పుడు ఒక కరుడుకట్టిన హంతకురాలిని అయిపోయాను. నాపై రకరకాల ఆరోపణలు మోపారు. న్యాయమూర్తుల దగ్గర నుంచి న్యాయం ఆశించటం కూడా ఆశావాద ధృక్పథమేమో అనిపిస్తోంది.**

కోర్టులో ఏడ్వలేదు. నన్ను క్షమించమని ప్రాధేయపడలేదు. నేను న్యాయాన్ని నమ్మాను. అందుకే ఒక్క కన్నీరు బొట్టు కూడా కార్చలేదు. నేను ఎప్పుడూ దోమలను కూడా చంపలేదని నీకు తెలుసు. బొద్దింకలను కుడా వాటి మీసాలు పట్టుకొని బయటపడేసేదాన్ని. అంతే తప్ప చంపేదాన్ని కాదు. అలాంటి నేను ఇప్పుడు ఒక కరుడుకట్టిన హంతకురాలిని అయిపోయాను. నాపై రకరకాల ఆరోపణలు మోపారు. న్యాయమూర్తుల దగ్గర నుంచి న్యాయం ఆశించటం కూడా ఆశావాద ధృక్పథమేమో అనిపిస్తోంది. న్యాయమూర్తి నన్ను ఎటువంటి ప్రశ్నలు వేయలేదు. ఇంటరాగేషన్ సమయంలో నన్ను కొడుతున్నప్పుడు.. అత్యంత హీనంగా దుర్భాషలాడుతున్నప్పుడు ఎవ్వరూ నా వైపు మాట్లాడలేదు. నా అందానికి చిహ్నంగా నేను భావించే జుట్టును తీసేసి గుండు చేయించినప్పుడు నాకు దక్కిన బహుమానం ఏమిటో తెలుసా జైలులో 11 రోజుల ఏకాంత నిర్బంధం.

ఇదంతా వింటూ నువ్వు ఏడవకు. మొదటి రోజు ఒక పెళ్ళికాని ముసలి పోలీసు నా గోళ్లను విరిచేశాడు. అప్పుడు అందాన్ని ఇక్కడ హర్షించరనే విషయం అర్థమయింది. అందమైన ఆకృతి, అందమైన ఆలోచన, అందమైన భావన, అందమైన రాత, అందమైన చూపు, అందమైన గొంతు వేటికి ఇక్కడ విలువ లేదు. అమ్మా, నా ఆలోచనా విధానం మారిపోయిందేమిటా అనుకోకు. దానికి నువ్వు బాధ్యురాలివి కావు. నా మనసులోంచి అనేక మాటలు ప్రవాహంలా వస్తున్నాయి. నువ్వు లేకుండా, నీకు తెలియకుండా నన్ను ఉరితీసినప్పుడు – నా జ్ఞాపకాలుగా నీకు మిగిలేవి ఈ మాటలే. నేను మరణించే ముందు నాదో కోరిక... నీ శక్తి మేరకు దాని కోసం ప్రయత్నించు. నేను నిన్ను, ఈ దేశాన్ని కోరేది ఇదొక్కటే. దీనిని సాధించాలంటే కొంత సమయం పడుతుందని నాకు తెలుసు. అమ్మా.. ఏడవకు. నేను చెప్పేది జాగ్రత్తగా విను. నేను ఒక విల్లు రాయాలనుకుంటున్నా. జైలులో ఉత్తరం రాయాలన్నా అధికారి అనుమతి కావాలి. అందువల్ల నువ్వు కోర్టుకు వెళ్లి అభ్యర్దనను నా తరపున వారి ముందు ఉంచు. నా వల్ల నువ్వుకూడా బాధపడుతున్నావనే భావనే నన్ను ఇబ్బంది పెడుతోంది. అమ్మా. నేను నిన్ను అభ్యర్థించేది ఇదొక్కటే. కోర్టులో నాకు శిక్ష వేయవద్దని న్యాయమూర్తులను అభ్యర్థించమని చాలా సార్లు చెప్పావు. కానీ నేను అంగీకరించలేదు. కానీ నా ఈ చివరి అభ్యర్థనను మాత్రం నువ్వు మన్నించాలి. అమ్మా.. నువ్వు నాకు నా జీవితం కన్నా ఎక్కువ. అందుకే నువ్వు నాకీ పని చేసి పెట్టాలి. మరణించిన తర్వాత నా శరీరం మట్టిలో కలిసిపోకూడదు. నా అందమైన కళ్ళు, చలాకీగా పనిచేసే నా గుండె ఎందుకూ పనికి రాకుండా పోకూడదు. అందువల్ల నన్ను ఉరితీసిన వెంటనే నా గుండె, కాలేయం, కళ్లు ఇలా అవయవ మార్పిడికి పనికొచ్చే అవయువాలన్నింటినీ ఈ ప్రపంచానికి నా బహుమతిగా ఇచ్చేయండి. అవి అమర్చిన వారికి నా పేరు తెలియనివ్వకండి. అంతే కాదు, నాకు నువ్వు సమాధి కట్టొద్దు. దాని దగ్గరకు వచ్చి ప్రార్ధనలు చేసి నువ్వు బాధపడటం నాకు ఇష్టంలేదు. నాకోసం నువ్వు నల్ల బట్టలు వేసుకోవటం నాకు ఇష్టం లేదు. నేను కష్టపడిన రోజులన్నీ మర్చిపోవటానికి ప్రయత్నించు.

ఈ ప్రపంచం మనల్ని ప్రేమించలేదు. అందుకే నేను మృత్యువు ఒడిలోకి వెళ్లిపోతున్నాను. నన్ను కొట్టినందుకు ఇన్‌స్పెక్టర్ షావెరోలపైన, అతనిని నివారించలేకపోయినందుకు సుప్రీం కోర్టు జడ్జీలపైన భగవంతుడి న్యాయస్థానంలో కేసు పెడతాను. అదే కోర్టులో నా హక్కులను హరించినందుకు డాక్టర్ ఫార్వాడిపైన, ఖాసీం షబానీపైన కూడా కేసులు పెడతాను. కొన్ని సార్లు మనం నిజమనుకున్నదంతా నిజం కాదు. అమ్మా. ఆ సృష్టికర్త ప్రపంచంలో నువ్వు నేను ఒకటి. మనం ముద్దాయిలం కాదు. మనపై ఫిర్యాదులు చేసిన వారందరూ ముద్దాయిలు. భగవంతుడు ఏం చేస్తాడో అప్పుడు చూద్దాం... నేను మరణించేదాకా నిన్ను కౌగిలించుకోవాలని ఉందమ్మా. ఐ లవ్ యూ...

ఇట్లు ..

**నీ రెహానా**

# ఏది అనౌచిత్యం

- కొండేపూడి నిర్మల

ఆగస్టు 2వ, తేదీన చర్ల పట్టణంలో వున్న స్కూల్లో ఒక లెక్కల టీచరు విద్యార్థుల చేతులకు కాశీ దారాలు, మెడలో ఆంజనేయుడి బిళ్ళలూ చూసి నిబంధనలకు వ్యతిరేకంగా వున్నందున వారందరినీ గోడ కుర్చీ వేయించాడు.

జనవరి నెల 2004లో తమిళనాడు లోని ఒక స్కూల్లో ఎనిమిదో తరగతి చదువుతున్న విద్యార్థుల్ని సైన్సు టీచరు నల్లదుస్తులు వదిలి యూనిఫాంలో స్కూలుకు రమ్మని గట్టిగా చెప్పినందుకు నలభై అయిదుమంది అయ్యప్ప భక్తులు ఆమె ఇంటి మీద అర్ధ రాత్రి దాడి చేశారు. ఆమె ప్రతి ఆదివారం తన ఇంట్లో క్రైస్తవం బోధిస్తూ మత మార్పిడి కార్యక్రమాలు చేస్తోందని ఆరోపిస్తూ కేసు కూడా పెట్టారు.
మొదటి సంఘటనలో టీచరు బహిరంగ క్షమాపణ చెప్పగా, రెండవ సంఘటనలో వున్న అనౌచిత్యం దాడి కారణంగా ఆమె తిరిగి వారి మీద కేసు పెట్టింది.

ఈ రెండు వార్తలూ చూసినప్పుడు మీకేం అనిపిస్తోంది? ఈ మధ్య టీచర్ల మీద తరచూ నమోదవుతున్న అభియోగాల్లో కొన్నయిన అత్యాచారాలు, నిర్బంధాలు, ఆత్మహత్యలకు పురికొల్పే విధంగా అవమానించడాలు లాంటివి చదవడానికి అలవాటు పడ్డ పాఠకులకు ఇది కూడా అదే మూసలో కనిపించే ప్రమాదం వుంది. కానీ వాటన్నిటి నుంచి ఈసందర్భాన్ని విడదీసి చూడాల్సినఅవసరం వుంది. ఆ మాటకొస్తే ఆ వార్తల వెనక వున్న మెజారిటీ మనుషుల దృక్పథాన్ని గురించి కూడా చర్చ జరగాలి.

అసలు పిల్లలు స్కూలు నిబంధనలకు అనుగుణంగా యూనిఫాంలో రావాలా...? ఎవరిష్టం వచ్చినట్టు వారు రావచ్చా...? ఈ ప్రశ్న సూటిగా వేసుకుంటే చాలావాటికి జవాబు దొరుకుతుంది. గుడికీ బడికీ ఖచ్చితమైన తేడా వుంది. గుడికి వెళ్ళినట్టు బడికి వెళ్లడం హాస్యాస్పదం..బడి అనేది భారతదేశం లాంటిది అనుకుంటే అందులో అనేక మతాల కులాల, వర్గాల వాళ్ళువుంటారు. కాబట్టి కుల,మత,వర్గ వర్ణ లింగ వివక్ష లేని లౌకిక ప్రజాస్వామ్యంగా వుండాలని రాసుకున్న షరతును గౌరవించి తీరాలి. అందలోనూ పిల్లల జీవితంలో బడికి అత్యంత ప్రాధాన్యత వుంది. ఇక్కడ నేర్చుకోని ఏ విలువా ఇక జీవితకాలంలో అబ్బదు. కాబట్టి పిల్లలందరూ యూనిఫాంలో



రావాలని, కలిసి కూచుని భోజనం చెయ్యాలని, ఆడుకోవాలని, పాడుకోవాలని, అనుకుంటాం కదా..మరి ఇప్పుడు కొందరు మాత్రం వంటినిండా విబూది నామాలు, మెళ్ళో ఆంజనేయ బిళ్ళలు, చేతికి కాశీదారాలతో వస్తే వాతావరణం ఎలా తయారవుతుంది? ఇది ఎలాంటి సూచన ఇస్తుంది? అక్కడ పాఠాలు చెప్పే సైన్సు టీచరు శాస్త్రీయత గురించి, సోషల్ టీచరు మానవహక్కుల గురించి చెప్పి ఏమిటి ప్రయోజనం ? ఇలాంటి నేల మీద సమ నమానత్వ భావనలు వికసిస్తాయా? తల్లిదండ్రులే స్వయంగా తమ పిల్లల మానసిక వికాశాన్ని చేజేతులా నీరు కారుస్తూ, తమ భయాలకి, భ్రమలకి, మూఢ నమ్మకాలకి పిల్లలని వారసులుగా ప్రకటించడానికి చూస్తుంటే బడుగుజీవి అయిన టీచరు పాత్ర ఏమిటి?

నిస్సహాయంగా క్షమాపణ చెప్పి ఉద్యోగం దక్కించుకోవడమా? వివేకంలేని ఈ సమాజంతో చట్ట బద్ధ పోరాటం చెయ్యడమా? పైన ప్రకటించిన టీచర్లు ఇద్దరూ తలొక రకంగా స్పందించారు.

అసలు పాఠశాలలో ఇంత మత చొరబాటు అవసరమా..? అయితే క్రైస్తవమతం బోధిస్తోందన్న ఆరోపణతో తమిళనాడు టీచరు మీద దాడి చెయ్యడం ఎందుకు..? మన స్కూళ్ళలో సరస్వతీ పూజలు బాహాటంగానే జరుగుతాయి కదా. ఒకవేళ ఆమె కూడా ప్రతి గుడ్ ఫ్రైడే రోజో ఇంకో రోజో క్లాసులో వున్న బెంచీలు బయట పడేసి కొవ్వొత్తులు వెలిగిస్తే ఎలా వుంటుంది ? లేక ఇంకో కమ్యూనిటీ వారు ప్లే గ్రౌండ్ మొత్తం చాపలు పరచి నమాజుకి కూచుంటే ఎలా వుంటుంది? ఎవరి వ్యక్తిగత విశ్వాసం అయినా అది వ్యక్తిగత పరిధిలో వున్నప్పుడే గౌరవం. లేకపోతే అనవసర వివాదాలకు, అనౌచిత్యానికి దారి తీస్తుంది.

అసలు ప్రజాస్వామ్యం అనేమాట మనం గూండాయిజానికి ప్రత్యామ్నాయంగా వాడుకుంటున్నామనిపిస్తోంది. ఇక్కడ కేవలం కాశీ దారాలు చుట్టుకుని, విబూది నామాలు దిద్దుకోవడం వల్లగానీ, యూనిఫాం ధరించకపోవడం వల్లగానీ నష్టం ఏమిటనీ మీరు అనుకోవచ్చు. ఇవి ఈ చిహ్నాలతో ఆగవు. కొన్ని రకాల దీక్షలు నెలన్నరో, అంతకంటే ఎక్కువ రోజులో కూడా వుంటాయి. అన్నేసి రోజులపాటు అర్ధరాత్రి అపరాత్రి వరకూ జరిగే భక్తి కార్యక్రమాల వల్ల పిల్లలు చదువుమీద శ్రద్ధ

తరువాయి 27వ పేజీ

ఆరోగ్యం



# సోరియాసిస్ వ్యాధి - కారణాలు, చికిత్స

- డా॥ భారతీసాగర్

సోరియాసిస్ చర్మవ్యాధిలా అనిపించే ఇమ్యూన్ వ్యవస్థకి సంబంధించిన వ్యాధి. కానీ లక్షణాలు మాత్రం చర్మం మీదనే ఎక్కువగా కనిపిస్తాయి. ఈ వ్యాధి స్త్రీ, పురుషులు ఇరువురిలోనూ రావచ్చు, వచ్చే అవకాశాలు కూడా ఇరువురికీ సమానంగా ఉన్నాయి. ఇది పుట్టినప్పటి నుంచి, వృద్ధావస్థ వరకు ఎప్పుడైనా రావచ్చు. కానీ సాధారణంగా ఇరవైలనుంచి నలభైల వయస్సులో ఎక్కువగా వస్తుంది. ఎక్కువ శాతం మంది రోగుల్లో ఇది వంశపారపర్యంగా వస్తుంది. అందువల్ల ఈ వ్యాధి రావటానికి గల కారణాల్లో జన్యువుల పాత్ర కూడా ఉన్నట్టు గమనించడమైనది. ఇది ఒక శారీరిక-మానసిక వ్యాధి (Psycho-somatic disease). ఏ విధమైన అంటువ్యాధి కాదు.

**కారణాలు :** పైన చెప్పిన జన్యు కారణాల వలన వ్యాధి వచ్చే అవకాశం ఉన్న వాళ్ళలో వాతావరణ కాలుష్యం వలన, కొన్ని ప్రత్యేక ఋతువులలో, మానసికమైన వత్తిడివలన, అధికకాలం ఊర్ధ్వ శ్వాస నాళ ఇన్ఫెక్షన్స్‌తో భాధాపడతా ఉంటే లేదా అధిక సమయం నుంచి బీటాబ్లాకర్స్, లిథియం మరియు క్లోరోక్విన్ లాంటి మందులు వాడటం లాంటివి ఈ వ్యాధి రావటానికి ఉత్ప్రేరకాలుగా పనిచేస్తాయి. చర్మం పైన ఎక్కడైనా దెబ్బ తగిలినపుడు, ముఖ్యంగా గోళ్ళు కత్తిరించుకునేటపుడు కలిగే గాయం కూడా సోరియాసిస్ వ్యాధి రావటానికి ఉత్ప్రేరకంగా పనిచేస్తుంది.

పైన చెప్పిన కారణాలు శరీరంలోని ఇమ్యూన్/తెల్లరక్త కణాలలో ఒక రకమైన టీ-లింఫోసైట్ కణాల పైన ఉత్ప్రేరకాలుగా పని చేసి మన శరీరానికి వ్యతిరేకంగా ఇమ్యూన్ వ్యవస్థని పని చేసేలాగా చేస్తాయి. రక్తంలోకి కొన్ని అలెర్జెన్స్ (అలర్జీని కలిగించే కారకాలు) విడుదల అవుతాయి. ఇవి టీ-లింఫోసైట్ కణాలపైన ప్రభావాన్ని చూపిస్తాయి. తద్వారా టీ-లింఫోసైట్ కణాలనుంచి సైటోకైన్స్ విడుదల అయి చర్మంపైన ఇన్ఫ్లమేషన్ కలిగించి తద్వారా చర్మంలో కణాల ఉత్పత్తిని అధికంగా చేస్తాయి. సాధారణంగా అయితే చర్మకణాలు నిత్యం రాలిపోతుంటాయి. వాటి స్థానంలో కొత్తవి నాలుగు వారాల సమయంలో ఏర్పడతాయి. కానీ సోరియాసిస్ వచ్చిన వారిలో కొత్త చర్మకణాలు తొందరగా అంటే కొన్ని రోజుల సమయంలోనే అధిక సంఖ్యలో ఏర్పడుతూ ఉంటాయి. చర్మం పైన కలిగిన ఇన్ఫ్లమేషన్ కారణంగా ఎర్రగా ఉండే పెద్ద మచ్చలు (ఎరిథీమా) ఏర్పడతాయి. మెల్లగా చర్మకణాలు అధికమవుతూ, చర్మం త్వర త్వరగా ఊడిపోతూ, పైన వెండి రంగులో మైకా లాగా ఉండే పొక్కులు ఏర్పడుతూ ఉంటాయి. దీనివలన అధికంగా చర్మంపైన దురద వస్తుంది. చర్మం పొడిబారిపోతుంది. ఆ పొక్కులని తొలగిస్తే, దాని కింద ఉండే సూక్ష్మ రక్తకేశనాళికలు చిట్లి రక్త బిందువులు కూడా కనబడవచ్చు(ఆస్పిట్జ్ సైన్). చర్మంపైన వత్తిడీ, రాపిడి ఎక్కువగా ఉన్న ప్రదేశాలలో లేదా చర్మంపైన అధికంగా రసాయనాలు పూసే ప్రదేశాలలో ఈ పొక్కులు అధికంగా వస్తాయి.

ఈ వ్యాధి కలిగే ప్రదేశాలను బట్టి, దీనిని వివిధ రకాలుగా వర్గీకరించారు. గట్టేట్ సొరియాసిస్, క్రానిక్ ప్లేక్ సోరియాసిస్, పామోప్లాంటార్ సోరియాసిస్, ఫ్లెక్సరల్ సోరియాసిస్ మొదలగునవి. గట్టేట్ సోరియాసిస్ ముఖ్యంగా చిన్న పిల్లల్లో, స్ట్రెప్టోకొక్కల్ ఇన్ఫెక్షన్స్‌తో భాదపడే వారిలో వస్తుంది. ఇందులో గుండుసూది తల అంత సైజు నుంచి పెద్ద బఠాణి సైజు పరిమాణంలో ఉండే పొక్కులు శరీరంపై రెండుపక్కలా (కుడి, ఎడమ), అకస్మాత్తుగా ఏర్పడతాయి.

క్రానిక్ ప్లేక్ సోరియాసిస్ సాధారణంగా వచ్చే సోరియాసిస్, ఇందులో పొక్కులు నాణాల సైజు నుంచి అరచేయంత సైజు వరకు ఎరుపు తెలుపు రంగులో ఏర్పడతాయి. శరీరంలోని రెండు భాగాలలో సమానంగా ఏర్పడతాయి, ముఖ్యంగా మోచేతులు, నడుము, వీపు భాగాలలో అధికంగా ఏర్పడతాయి. పామోప్లాంటార్ సోరియాసిస్ కూడా అత్యంత సాధారణంగా వచ్చే రకము, ఇందులో పొక్కులు అధికంగా అరికాళ్ళలో, అరచేతుల్లో వస్తాయి. ఫ్లెక్సరల్ సోరియాసిస్ లో వ్యాధి చంకలు, గజ్జల్లో, స్తనాల క్రింద భాగంలో, జననేంద్రియాల దగ్గర, ఇన్‌ఫెక్షన్తో కూడి, ఇరువైపులా వస్తుంది. ఇవే కాకుండా గోరు క్రిందిభాగంలో కూడ ఈ వ్యాధి రావచ్చును, దీనిని నెయిల్ సోరియాసిస్ అంటారు. ఇంకా పొక్కులతో పాటు నీటితిత్తులుతో కూడి వచ్చే సోరియాసిస్ ని పస్చులార్ సోరియాసిస్ అంటారు. ఇందులో పొక్కులు నీటితిత్తులతో, నొప్పితో కూడి వస్తాయి. ఇది శరీరం మొత్తంలో రావచ్చును, అట్లాగే జ్వరము, చలి, మోకాళ్ళు, ఇతర కీళ్ళలో నొప్పులుతో కూడి వస్తుంది.

**సోరియాటిక్ ఆర్థ్రైటిస్ :**

సాధారణంగా సోరియాసిస్ ఉన్న వాళ్లలో ఐదు నుంచి పదిశాతం మందిలో సోరియాటిక్ ఆర్థ్రైటిస్ వస్తుంది. కొంత మందిలో సోరియాసిస్ వ్యాధి రాక ముందే ఇది రావచ్చు. లేదా వచ్చిన ఒక సంవత్సర కాలంలో రావచ్చు లేదా రెండూ ఒకేసారి కూడా రావచ్చును. ఇందులో కీళ్ళనొప్పులు, చిన్న కీళ్ళు అంటే చేతి వేళ్ళలో ఉండే కీళ్ళలో మొదలవ్వచ్చు లేదా ఏదైనా ఒక పెద్ద కీలులో మొదలవ్వచ్చు. శరీరంలో రెండువైపుల కీళ్ళలోకూడా రావచ్చును. కీళ్ళలో రెండువైపులా వచ్చే సోరియాసిస్ రుమటాయిడ్ ఆర్థ్రైటిస్ లాగానే అనిపిస్తుంది. కానీ జాగ్రత్తగా రక్తపరీక్షలు, ఎక్స్-రే వంటి వాటితో వ్యాధి నిర్ధారణ చేయవచ్చును.

**సోరియాసిస్ చికిత్స :**

**సోరియాసిస్ ఒక దీర్ఘకాల వ్యాధి, ఇది వచ్చిన తరువాత మధ్య మధ్యలో తగ్గటం, మధ్య మధ్యలో ఎక్కువ కావటం జరుగుతూ ఉంటుంది. ఈ వ్యాధిని పూర్తిగా నయం చేయటం కష్టం. అందుకే వ్యాధిని నియంత్రించటానికి, రోగి జీవన పరిస్థితి మెరుగు పరచటానికి ప్రయత్నం చేయవలసి ఉంటుంది. సోరియాసిస్ చికిత్స ముఖ్యంగా రెండు రకాలుగా ఉంటుంది. స్థానికంగా పొక్కులు ఉన్న ప్రదేశంలో పై పూతగా వాడేవి మరియు కడుపులోకి తీసుకునేవి.**

**1. స్థానిక చికిత్స :**

ఎక్కువ శాతం రోగులలో వ్యాధి నియంత్రణ ఈ పూతమందులతో చేయవచ్చు. లిక్విడ్ పారఫిన్ చాలా మంచి పూతమందుగా పనిచేస్తుంది. అయితే వస్తూ పోతూ ఉండే సోరియాసిస్ వ్యాధికి ఇది బాగా పనిచేస్తుంది. స్థిరంగా ఉండే సోరియాసిస్ వ్యాధిలో స్టిరాయిడ్ మందులు, లేదా కెరటొలైటిక్ (సాలిసిలిక్ యాసిడ్ మొ.) మందులు బాగా పనిచేస్తాయి. కానీ వ్యాధి ఎక్కువ శరీరభాగంలో వచ్చినపుడు బీటామెథసోన్ లాంటి స్టిరాయిడ్ మందులు పూతగా పూస్తే అవి చర్మం ద్వారా రక్తంలోకి వెళ్ళి దుష్పరిణామాలను కలుగ చేస్తాయి. ఈ కోణంలోంచి చూసినపుడు మొమెటాసోన్ లేదా ఫ్లూటికోసోన్ లాంటి స్టిరాయిడ్ మందులు కొంతవరకు ఉపయుక్తం. స్టిరాయిడ్స్ కాకుండా విటమిన్ డి, రెటినాయిడ్స్ (విటమిన్ ఎ)తో చేసిన ఆయింట్‌మెంట్స్, కోల్‌టార్ మొదలగునవి కూడా ఉపయుక్తం.

**కాంతి చికిత్స :**

సూర్యుని నుంచి వచ్చే అతినీలలోహిత కిరణాలు, కృత్రిమంగా ప్రసరింపచేసే అతినీలలోహిత కిరణాలు ఈ వ్యాధి చికిత్సలో ఉపయోగ పడతాయి. కాకపోతే ఇది వైద్యుని సలహాలతో లేదా పర్యవేక్షణలో జరగవలసి ఉంటుంది. సూర్యకాంతిలోని అతినీలలోహిత కిరణాలను శరీరం శోషించుకున్నపుడు, అవి చర్మంలో ఉత్తేజితమైఉన్న టీ-లింఫోసైట్లను చంపివేసి, చర్మకణాలలో ఉన్న అధిక పెరుగుదలను నియంత్రిస్తుంది.

ఇందులో ఒక కృత్రిమ కాంతిజనకం ద్వారా షార్ట్ వేవ్ లెంగ్త్ కాంతిని చర్మం మీదికి ప్రసరింపచేస్తారు. ఇది పొక్కులు చిన్నవిగా ఉండి, శరీరంలో ఎక్కువ భాగంలో కలిగినపుడు ఉపయోగపడుతుంది. అయితే ఇది వైద్యుని పర్యవేక్షణలోనే తీసుకోవాలి.

**అంతర్గత చికిత్స :**

శరీరం లోపలికి తీసుకొనే ఔషధాలలో ముఖ్యమైనవి మెథొట్రిక్సేట్, సైక్లోస్పొరిన్, రెటీనాయిడ్స్. ఇవి శరీరంలోని ఇమ్యూన్ వ్యవస్థని అణిచివేసి, తద్వారా టీ-లింఫోసైట్లను నియంత్రించి, చర్మంలోని కణాల పెరుగుదలని కంట్రోల్ చేస్తాయి. సాధారణంగా స్థానిక చికిత్స మరియు అంతర్గత చికిత్సలని కలిపి చేస్తారు.

మానసిక చికిత్స-కౌన్సిలింగ్: ఇది ఒక శారీరక-మానసిక వ్యాధి కనుక, ఈ వ్యాధిగ్రస్తులకు కౌన్సిలింగ్ ఇవ్వటం ద్వారా వారికి స్వాంతన కలిగించి వ్యాధి ప్రోగ్రెస్‌లో కొంత పరివర్తన తేవచ్చును. అలాగే కుటుంబసభ్యుల నుంచి సహకారం, మానసిక మద్దతు చాలా అవసరం ఉంటుంది. సమాజం కూడా వీరిని వెలివేసినట్లు చూడకూడదు. సోరియాటిక్ ఆర్థ్రైటిస్ చికిత్సలో నొప్పి నివారణ ఔషధాలతోపాటు చాలా మందులు ఉన్నాయి.

ఈ వ్యాధి నివారణ కొరకు ఇంకా చాలా పరిశోధనలు జరుగుతున్నాయి.

**ఆయుర్వేద చికిత్స :**

అల్లోపతి మందులు చాలాకాలం వాడటానికి కొన్ని పరిమితులు మరియు దుష్పరిణామాలు కూడా ఉన్నాయి. సైడ్ ఎఫెక్ట్స్ లేకుండా ఈ వ్యాధికి చికిత్స చేయటానికి, చాలావరకు వ్యాధిని నియంత్రించటానికి, వ్యాధి ప్రోగ్రెస్ ఆపటానికి ఆయుర్వేద వైద్యంలో మంచి మందులు, చికిత్సా పద్ధతులు ఉన్నాయి. అయితే రోగి క్వాలిఫైడ్ వైద్యుని దగ్గరికే వెళ్ళవలసి ఉంటుంది. ఆయుర్వేద మందులు కూడా పై పూతకి వాడేవి మరియు లోపలికి తీసుకునేవి ఉంటాయి. పైపూతకి వాడటానికి చక్రమర్ద కేరము, దుర్ధూరాది తైలము, అల్లోవీరా మొక్కనుంచి తీసిన జెల్స్, 777ఆయిల్ మొదలగునవి ఉన్నాయి.

**ఈ వ్యాధి కలిగే ప్రదేశాలను బట్టి, దీనిని వివిధ రకాలుగా వర్గీకరించారు. గట్టేట్ సొరియాసిస్, క్రానిక్ ప్లేక్ సోరియాసిస్, పామోప్లాంటార్ సోరియాసిస్, ఫ్లెక్సరల్ సోరియాసిస్ మొదలగునవి. గట్టేట్ సొరియాసిస్ ముఖ్యంగా చిన్న పిల్లల్లో, స్ట్రెప్టొకొక్కల్ ఇన్ఫెక్షన్స్‌తో బాధపడే వారిలో వస్తుంది. ఇందులో గుండుసూది తల అంత సైజు నుంచి పెద్ద బఠాణి సైజు పరిమాణంలో ఉండే పొక్కులు శరీరంపై రెండుపక్కలా (కుడి, ఎడమ), అకస్మాత్తుగా ఏర్పడతాయి.**

అలాగే లోపలికి తీసుకోవటానికి ఏకమూలిక చూర్ణాలు-పిప్పలీ చూర్ణము (మనం ఇంట్లో వాడే పిప్పళ్ళు), గుడూచీ చూర్ణము, నింబ చూర్ణము (వేప చెట్టు ఆకులు, బెరడు నుంచి చేసేది), మహాతిక్తక కషాయము, భల్లాతక అవలేహ్యము, అమృతప్రాశభల్లాతక లేహ్యము, మొదలగునవి ఉన్నాయి. అయితే ఆయుర్వేద వైద్యుడు రోగిని పరీక్షించి అతని లక్షణాలను, వ్యాధి తీవ్రతను బట్టి చికిత్స చేస్తాడు.

పైన చెప్పినవే కాకుండా వ్యాధి తీవ్రదశలో ఉన్నపుడు శరీరాన్ని శుద్ధి చేయటానికి, ఇమ్యూన్ వ్యవస్థని నియంత్రిచటానికి, పంచకర్మలని చేస్తారు. ఈ వ్యాధి కొరకు ముఖ్యంగా వమనకర్మ (మందులతో వాంతిని కలిగించే క్రియ) మరియు విరేచనకర్మ (మందులు ఇచ్చి విరేచనాలు అయ్యేలాగా చేస్తారు) ఉపయుక్తంగా ఉంటాయి. ఈ క్రియలు చేయటానికి ముందు వైద్యుడు రోగి శరీరాన్ని ఆ క్రియలకు అణుగుణంగా శరీరాన్ని తయారు చేస్తాడు. తరువాత తన పర్యవేక్షణలోనే క్రియలని చేస్తాడు. సోరియాటిక్ ఆర్థ్రైటిస్ వచ్చినవారికి కూడా ఆయుద్వేద వైద్యంతో చికిత్స చేయవచ్చు. దీనిని కూడా పంచకర్మలు మరియు లోపలికి తీసుకునే మందులతో నయం చేయవచ్చు. ఆయుర్వేద వైద్యులు చికిత్సతో పాటు పథ్యానికి కూడా చాలా ప్రాధాన్యతని ఇస్తాడు, రోగి దానిని పాటించవలసి ఉంటుంది.

ఈ వ్యాధిలో ధ్యానం, ప్రాణాయామం లాంటి యోగిక క్రియలు కూడా రోగికి స్ట్రెస్ తగ్గించడంలో ఉపయుక్తంగా ఉంటాయి. ప్రస్తుత సమయంలో వీధికొక ఆయుర్వేద వైద్యుడని బోర్డు పెట్టుకున్న వారుంటారు, రోగులు వైద్యుల దగ్గరికి వెళ్ళేటపుడు, వారు సంస్థాగతంగా ఆయుర్వేద కాలేజీలలో శిక్షణ పొందిన వారా కాదా అనేది చూసి నిర్ధారించుకొని వెళ్ళవలసి ఉంటుంది. రోగులలో ఇంకొక అపోహ కూడా ఉంది. ఆయుర్వేద వైద్యం కొరకు కేరళ వెళ్ళవలసి ఉంటుంది అనేదికూడా సరికాదు. తెలుగు రాష్ట్రాలలో కూడా కేరళ వైద్యులకి దీటుగా వైద్యం చేసే వైద్యులున్నారు. ఇంకొక విషయం కూడా ఇక్కడ మనవి చేయదలచుకొన్నాను. ఆయుర్వేద కాలేజీ ఆసుపత్రులకి వెళ్ళి కూడా చికిత్స చేయించుకొనవచ్చును.

అల్లోపతి, ఆయుర్వేద, యోగాలాంటి పద్ధతులను కలిపి పాటిస్తూ చికిత్స తీసుకుంటే ఈ భయంకర వ్యాధిని చాలా వరకు అదుపులో పెట్టవచ్చును. అయితే డ్రగ్ ఇంటరాక్షన్స్ గురించి తప్పక అడిగి తెలుసుకోవాలి. ★

*24వ పేజీ తరువాయి*

**అసలు పిల్లలు స్కూలు నిబంధనలకు అనుగుణంగా యూనిఫాంలో రావాలా...? ఎవరిష్టం వచ్చినట్టు వారు రావచ్చా...? ఈ ప్రశ్న సూటిగా వేసుకుంటే చాలావాటికి జవాబు దొరుకుతుంది. గుడికీ బడికీ ఖచ్చితమైన తేడా వుంది. గుడికి వెళ్ళినట్టు బడికి వెళ్లడం హాస్యాస్పదం..బడి అనేది భారతదేశం లాంటిది అనుకుంటే అందులో అనేక మతాల కులాల, వర్గాల వాళ్ళువుంటారు. కాబట్టి కుల,మత,వర్గ వర్ణ లింగ వివక్ష లేని లౌకిక ప్రజాస్వామ్యంగా వుండాలని రాసుకున్న షరతును గౌరవించి తీరాలి.**

చూపలేరు...ఏక భుక్తం, చన్నీటి స్నానం లాంటి నియమాల వల్ల సరిగ్గా పరీక్షల నాటికి ఆరోగ్యాలు చెడతాయి. సున్నా మార్కులు వస్తాయి. దీనివల్ల మళ్ళీ దేవుడే దిక్కు అనుకుని గుళ్ళచుట్టు తిరుగుతారు. గుండె తీసి గుండే పెడుతున్న సాంకేతిక విజ్ఞానం విరిసిన ఈ నేలమీదే పరీక్షల గండం గట్టెక్కించేందుకో దేవుడు, వీసాలకో దేవుడు, మీసాలకో దేవుడు వుండనే వున్నారు కదా. ఇక వీటన్నిటికీ దొరికిన సామాజిక మద్దతు వల్ల ఇప్పుడు తెలీకుండా కాశీదారాలతో వచ్చిన బడి పిల్లలు రేపు కాలేజీల్లోకి కత్తులతోనూ, త్రిశూలాలతోనూ వస్తారు.

బహిరంగ ప్రదేశాల్లో జరుగుతున్న మత ప్రదర్శన ఉన్మాదం ఉద్యోగి పని సామర్థ్యాన్ని దెబ్బతీస్తుంది. ఉదాహరణకి ఆగస్టు నెల అంతా మెజారిటీ స్త్రీలు మంగళ, శుక్రవారాలు ఆలస్యంగా ఆఫీసుకొచ్చి త్వరగా ఇళ్ళకి వెళ్లిపోతారు. లేదా సెలవలు పెట్టేస్తారు. కొందరయితే తమ కమ్యూనిటీ మనుషుల్ని వెతుక్కుని ఆఫీసులోనే వాయినాలు ఇచ్చుకోవడం, పుచ్చుకోడం లాంటి పనులు పరమ నిర్లజ్జగా చేస్తారు. ఆలోచిస్తే ఇవన్నీ చట్ట విరుద్ధ, రాజ్యాంగ విరుద్ధ, శాంతి భద్రతలకు భంగం వాటిల్లే చర్యలే.

మనది నిజంగా ప్రజాస్వామ్యమే కనక అయితే వీటిని ప్రశ్నించి తీరాలి. ప్రశ్నించడమే నేరమనుకునే రాజ్యంలో మీ పిల్లలు ఎదుగుతున్నారంటే అంతకంటే దయనీయమయిన విషయం ఇంకోటి లేదు. ఎందుకు, ఏమిటి, ఎలా అనే మూడు ప్రశ్నలు లేకపోతే మానవ జాతికింత సాంకేతిక ప్రగతి లేదు. చెట్టుమీద నుంచి ఆపిల్ పండు కిందికే ఎందుకు పడుతుంది? పైకి ఎందుకు ఎగరడంలేదు? అనే ప్రశ్న న్యూటన్ అనే ఒక బాలుడి నోట రాకపోతే ఇవాళ భూమ్యాకర్షక సిద్ధాంతమే లేదు. మీ పిల్లలకు శాస్త్రీయత నేర్పుతారో, భజనలు నేర్పుతారో మీ ఇష్టం కాదు. పిల్లలు సామాజిక శక్తులు. వాళ్ళు సమాజానికి ఉపయోగపడాలి.

★

# సమానత్వంతోనే సవ్యమైన ప్రపంచం

- హర్ష మందర్



స్త్రీపురుష సమానత్వం ఈ ప్రపంచాన్ని మరింత దయార్ద్రమైనదిగా, తక్కువ హింసాత్మకమైనదిగా, అదే విధంగా పురుషుల కోసం తక్కువగా డిమాండ్ చేసేదిగా ఉంటుంది. ప్రేమికుల రోజున కొంతమంది యువతీయువకులు తమ ప్రేమను చాటుకుంటూ ఆనంద డోలికల్లో మునిగిపోతుండగా, మరోవైపు స్త్రీ పురుష విచక్షణ లేకుండా అందరికీ భద్రత, సమానత్వం, గౌరవంతో కూడిన మరో ప్రేమ కావాలని 160 దేశాలలోని స్త్రీపురుషులు గత మూడు సంవత్సరాలుగా నినదిస్తున్నారు. తమ జీవితకాలంలో ఏదో ఒక రకంగా హింసకు గురైన బాలికలు, యువతులు ప్రపంచవ్యాప్తంగా 100 కోట్ల మందికి పైగా ఉన్నారని వివిధ సర్వేలు చెబుతున్నాయి. ఈ 100కోట్ల మంది హింసా బాధితులు తమపై జరిగిన అమానుష దాడులకు వ్యతిరేకంగా సమైక్యంగా కదలాలని ఇచ్చిన ఈ పిలుపు విశ్వవ్యాప్తంగా ప్రజల దృష్టిని ఆకర్షించింది.

గత సంవత్సరం ప్రపంచవ్యాప్తంగా మహిళలపై సాగుతున్న అనేక రకాల హింసను వెలుగులోకి తేవడం జరిగింది. భారతదేశంలో అత్యంత అమానవీయ " నిర్భయ ఘటన" వెలుగులోకి వచ్చింది. ఈ సంవత్సరం హింసా బాధితులకు న్యాయం అందించాలనే డిమాండ్ ముందుకొచ్చింది. ఈ ప్రపంచ పిలుపు బాధిత మహిళల శారీరక, మానసిక గాయాలకు ఒక స్వాంతన కూర్చి తాము ఒంటరి వారమనే ఆలోచన పోగొట్టి వారందరినీ ఏకతాటిపై నడిపించడానికి తోడ్పడుతుంది. స్త్రీపురుష సమానత్వం బాలికలకు, మహిళలకు రక్షణను, ఆనందాన్ని, గౌరవాన్ని ఇస్తుందని తరచూ భావించబడుతుంది. సమాజంలో దయను పెంచుతుంది. మహిళపై హింసను, పురుషాధిక్యాన్ని తగ్గిస్తుంది. ప్రపంచం పారదర్శకంగా, ప్రమాదరహితంగా ఉండాలంటే మహిళలు పురుషులతోను, బాలికలు, బాలురతోను కలిసి పని చేయగలిగి ఉండాలి. మహిళలపై హింసను అరికట్టేందుకు పురుషుల కార్యాచరణ(ఎంఎఎస్‌విఎడబ్ల్యు), ఫోరం టు ఎంగేజ్ మెన్(ఎఫ్ఇఎం), మెన్ ఎంగేజ్ అలియన్స్(ఎంఇఎ), సౌత్ ఆసియన్ నెట్‌వర్క్ టు అడ్రస్ మాస్క్యులైనిటీస్) వంటి అనేక సంస్థలు పురుషత్వానికి సంబంధించిన అంశాలపైన పని చేస్తున్నాయి. బాలురు, పురుషులు తమ సామాజీకీకరణ తమను ఏవిధంగా ఒత్తిడి చేసి దృఢంగా, సామర్థ్య సహితంగా, శక్తివంతులుగా తయారుచేసిందో, స్త్రీపురుష సమానత్వం వారికి ఏవిధంగా నిజమైన విముక్తిని కల్పిస్తుందో అనే విషయాలను బాలురు, పురుషులు వారి ఆత్మవలోకనం ద్వారా అవగాహన చేసుకునేట్లు ఈ సంఘాలు ప్రయత్నిస్తున్నాయి.

'ప్రతి మహిళ భావోద్వేగాలకు లోనవుతుందని భావిస్తున్న సందర్భంలో పురుషునికి ఏడ్చే హక్కు, సున్నితత్వం నిరాకరించబడుతున్నాయి. మహిళల కంటే పురుషులు అధికులు అనే భావజాలం పితృస్వామిక వ్యవస్థకు ఆధారం. కానీ పురుషత్వం సామాజికంగా ఉత్పన్నమైనది, పురుషుడిగా ఉండటమెలాగో తెలియజేసేది. అయితే సమాజం పురుషత్వానికి, నిర్దేశించిన ప్రమాణాలను వారు సాధించలేనప్పుడు ఏం జరుగుతుంది? పురుషులందరూ తమ మృధు స్వభావాన్ని దాచి ఉంచలేరు. లేదా సంపాదనలో ఇతర పురుషులతో పోటీ పడటంలో విజయం సాధించలేరు. తమ కుటుంబాలకు ఊతమివ్వలేరు. ఆర్థిక విషయాలలో కానీ, సామాజిక విషయాలలోకానీ, లైంగికంగా కానీ అపజయం పొందినప్పుడు పురుషులు వాటిని తట్టుకోవడానికి కావలసిన భావోద్వేగ వనరులు వారికి లభ్యంకావు.

మహిళను శృంగారానికి సంకేతంగా చూస్తున్నప్పటికీ పురుషుడు తన లైంగిక సామర్థ్యాల పట్ల ఆందోళన చెందే పరిస్థితి కూడా ఉన్నది. ఆధిపత్య ధోరణి, ఓటమిని తట్టుకునే శక్తి లేకపోవడం అనే విషయాలు పురుషుడిని హింసకు ప్రేరేపిస్తున్నాయి. అందువల్లనే అనేక సంస్కృతులలో 'హింస' అనేది పురుషత్వంలో ప్రధాన అంశంగా మారింది. 'జీవ సంబంధమైన పురుషత్వానికి భిన్నంగా యువకులకు క్రమంతప్పని పరిశీలన కార్యాచరణ ఉండాలి. అని మైఖేల్ కాఫ్ మేన్ అనే పండితుడు వ్యాఖ్యానించాడు. అపజయం వల్ల ఏర్పడిన అభద్రతా భావం పురుషులలో ముఖ్యంగా యుక్తవయస్సు వారిలో విపరీత భయాన్ని, ఒంటరితనాన్ని, కోపాన్ని, తమను తాము శిక్షించుకోవడాన్ని ఆత్మవంచనను, ఆధిపత్యధోరణిని నింపుతుంది. బలమైన (మానసిక దృఢత్వం కలిగిన) పురుషులు మాత్రమే మహిళల పట్ల సానుభూతి, సున్నితత్వంతో వ్యవహరిస్తారు. బలహీనమైన(మానసిక దృఢత్వం లేని), అభద్రతా భావం కలిగిన వారు

***తరువాయి 34వ పేజీ***

అవగాహన సందర్భం

# భవిష్యత్తుకు పునాది పిల్లల పెంపకమే !

- డా॥ శిలాలోలిత

స్త్రీవాదం చర్చకు పెట్టే అంశాల్లో పితృస్వామ్యమంత ప్రధానమైంది ఈ జెండర్. ఆంగ్లంలో 'సెక్స్' అనేమాట లింగ బోధకం. శారీరకంగా, ఆడ,మగ భేదాలను గుర్తించి చెప్పేది. జైవిక లక్షణాలను బట్టి, శరీర ధర్మాలను బట్టి ఆడవాళ్ళుగా, మగవాళ్ళుగా విభజించేది. ఇది సహజమైంది. ఇక జెండర్ అనేది సాంఘికంగానూ, సాంస్కృతికంగానూ స్త్రీత్వ, పురుషత్వ లక్షణాలను ఆపాదించి, వారిని విడదీసి స్త్రీలను స్త్రీలుగా, పురుషులను పురుషులుగా తయారు చేయబడతారు. దీనిని మనం జాగ్రత్తగా గమనించాలి. స్త్రీల విషయంలో "హఅవ అం అశీ ఎశీతీఅ ఖం షశీఎవఅ తీఫ్ష్రవతీ ఎవషశీఎవం ఖ షశీఎవఅ " అన్న సైమన్ ది బోవర్ చేసిన సూచన జెండర్ వివక్షలోని నిశ్శబ్ద కుట్రని తెలియజేస్తుంది.

పిల్లల్ని కనడం, పాలివ్వడం, పెంపకం అనేవి స్త్రీకి శారీరకంగా ఉన్న శక్తులు. అవి సహజమైనటువంటివి. తల్లిప్రేమ, మార్దవం, దయ, త్యాగ గుణం మొదలైన లక్షణాలు స్త్రీలు కలిగి ఉండాలనేది జెండర్ విధానం అమలులో ఉండటం వల్ల ఏర్పడిన భావజాలం. ఈ భావజాలం మీదే ఫెమినిజం తన విమర్శను ఎక్కుపెడుతుంది. అంటే, జెండర్ వివక్ష వల్ల స్త్రీ పురుషుల మధ్య అసమ సంబంధాలను వృద్ధి చేస్తుంది కనుక ఈ వివక్షను రూపుమాపేందుకు ఫెమినిజం ప్రయత్నిస్తుంది. పిల్లల్ని ఎలా పెంచుతాం, పెంచుతున్నాం అనే విషయాల్లో ఆత్మవిమర్శ చేసుకోవడం, ఆలోచనాత్మక చర్యల్ని చేపట్టడం చేస్తున్నారు.

పుట్టిన శిశువును స్త్రీగా, పురుషుడిగా పెంచబడే క్రమాన్ని జెండర్ స్పష్టంగా చూపిస్తుంది. బాల్య దశ నుంచి ప్రారంభమయ్యే అదుపును, నియంత్రణను కవిత్వంలో కవయిత్రులు వెలిబుచ్చిన తీరును పరిశీలిద్దాం.

'భారతి' అనేక కవయిత్రి-'ఇంతేనా... ఇంకేం లేదా? కవితలో కబడ్డీ..ఒడుపుగా/ ఓహ్ !అలలు, కేకలు/ మగపిల్లలతో చేరి పాల పోంగులో నీళ్ళు అంతే / పూల పరికిణీలు, రంగుల ఓణీలు/ చుక్కల ముగ్గులూ, పూసల రవికెలూ/ ప్రశ్నించనివ్వని చదువులూ/ ఆలోచించనివ్వని పరీక్షలూ, ఆడపిల్లకి స్కూల్ ఫైనల్ చాలదూ/ మరి ఊళ్ళేలుతుందా..!

**ఆడుకునే స్వేచ్ఛ దగ్గర్నుంచి, దుస్తులు, పని ఆలోచనలు, చదువు వీటన్నింటిపై ఎలాంటి అదుపు వుంటుందో తెలియజేస్తుంది. ఇంత వ్యతిరేకత మధ్య పుట్టి బతికిన ఆడపిల్లని అచ్చమైన స్త్రీగా తయారుచేయటానికి పితృస్వామిక సంస్కృతి ప్రత్యేకమైన పెంపకపు పద్ధతిని సిద్ధం చేసి ఉంచుకుంది. ఆ పనిని సమర్ధవంతంగా నిర్వహించదానికి ఈ వ్యవస్థ అమ్మను, నాన్నను, అన్నయ్యను, అధికార స్థానంలో ఉంచుతుంది.**

'ఈ ఆకును తెంపవు' అనే కవితను 'కనక దుర్గ' రాసింది. చావుకు సిద్ధంగా వున్న స్త్రీ స్థితిని వర్ణిస్తూ బాల్యం నుంచి బతుకు చివర వరకు ఆమె జీవిత దశలల్లో తల్లి, తండ్రి, అన్న ఎటువంటి అధికార బాధ్యతల్ని నిర్వహించారో చెబుతుంది." నాన్న చూసి చూడకుండా/చూపుతో వెంటాడే వాడు/ అన్నకి ఆందోళన అనవసరంగానే /మాట మాటనీ వెతికేవాడు/ వాళ్ళంతా ఎక్కడా ఏమీ జరక్కుండా/ కాలూ, చెయ్యి జారకుండా/ పరువూ ప్రతిష్టా కాపాడు కోవాలని/ ఆమె నెప్పుడూ ఆలోచించనీయలేదు-వ్యవస్థలో స్త్రీలు ఒదిగుండే స్థితిని, స్త్రీలుగా తయారు చేయబడటాన్ని ఈ కవిత చెబ్తోంది.

తల్లీ, తండ్రీ, సోదరుల తర్వాత స్త్రీ కదలికలను అదుపు చేసే అధికారం, భర్తకు బదలాయించ బడుతుంది. భర్తగానీ, ప్రేమికుడు గానీ, స్నేహితుడు గానీ, భార్యకు, ప్రేమకు ఇచ్చే స్వేచ్ఛ ఎన్ని షరతులతో వుంటుందో "జయప్రభ"-"స్నేహితుడి స్వగతం" కవితలో చర్చించింది.



కళ్ళ కదలికల మీద / కంటి మెరుపు మీదా/ నవ్వు అలలమీదా/ నిఘావేసి తాను అనుమతించే స్వేచ్ఛను మాత్రమే పాడమని చెప్పే స్నేహితుడు పలుపుతాడును తన చేతిలో ఉంచుకుని, తాను తాడు వదిలిన మేరకు మాత్రమే స్వేచ్ఛగా తిరగడానికి పశువుకి ఇచ్చే అవకాశం లాంటి అవకాశమే తన సహచరికి ఇస్తున్నాడన్నది ఈ కవిత అంతర్భావం. స్త్రీ అణిచివేతలోని పలువిధాల్ని పరిచయం చేస్తుంది.

ఆడపిల్లల్ని స్త్రీలుగా తయారు చేయడంలో, సంస్కృతిలో భాగంగా అలంకరణ రీతులు నిర్వహించే పాత్రకూడా సామాన్యమైనదేమీకాదు. స్త్రీలు స్వయం ప్రతిపత్తి ప్రవర్తనను ఆశించే స్త్రీవాదులకు స్త్రీల కదలికలను అదుపు చేసే వస్త్రధారణ, అలంకరణరీతులు ప్రశ్నించేవిగా కనబడతాయి. "చెట్టు ఒక్కటే అయిన బతుకు పువ్వు మరోలా" కవితలో శిలాలోలితా చిన్నప్పటి నుంచీ పెంచే క్రమంలో ఎంత తేడా ఉంటుందో ఆడపిల్లలు, మగపిల్లలుగా ఎలా పెంచబడతారో వివరిస్తుంది. అమ్మకడుపు చల్లగా/ అమ్మ ప్రేమ తియ్యగా/ అన్నీ ఐదారేళ్ళ లోపే అని బాగా చిన్నప్పుడు అంతగా పట్టించుకోకపోయినా, తర్వాత్తర్వాత ఎలా విడదీసి పెంచుతారో చెబ్తుంది.

"చెట్టు ఒకటే అయినా బతుకుపువ్వు మాత్రం మరోలా/ లక్షణ రేఖలు, స్పీడ్ బ్రేకర్లు, పాతివ్రత్యపు బురఖాలు/ శరీరానికి శవాలంకరణాలు/ బతుకు కొనదాకా వెంటాడే సంకెళ్ళు / చరిత్రెప్పుడూ కొత్త శిశువుల్ని కంటుందే కాని/ కొత్త జీవితాల్ని కనడం లేదు అని స్పష్టం చేస్తుంది. ఇది స్పష్టంగా బయటకు కనిపించే సమస్యలా అనిపించక పోయినా, దీని తీవ్రత మాత్రం ఎక్కువ. నరనరాల్లో జీర్ణించుకున్న ఈ వివక్ష స్త్రీపట్ల ఒక అణచివేతను ప్రదర్శిస్తూనే వుంది. ఇది పైకి కనబడని హింసగా చెప్పొచ్చు.

స్త్రీని అన్ని దశల్లోనూ అణచివేసి ఎందుకూ పనికిరాని బద్ధకస్తురాలిగా ఎలా చేస్తారో-రజియా బేగం -"అలాగే అన్నారు"- కవితలో చెబ్తుంది. "బాల్యంలో చిన్నపిల్లవి నీకేం తెల్సు కూర్చో ! అన్నారు/ యవ్వనంలో ఉడుకు రక్తం మంచి చెడూ తెలీదు కూర్చో !అన్నారు./ వృద్ధాప్యంలో ముసల్దానివి ఇంకేం చేస్తావు కూర్చో ! అన్నారు./ అవకాశం రానందుకు కోపంగా లేదు నాకు/ కూర్చొని, కూర్చొని బద్ధకం వచ్చినందుకే బాధగావుంది-అంటుంది. స్త్రీ ఎందుకు పనికిరానిదానిగా ఏ పని చేయలేని నిస్సత్తువులోనికి ఎలా లాగబడుతుందో, చాలా మామూలు మాటల్తో జీవిత దర్శనం చూపించింది. శ్రీమతి అనే కవయిత్రి "నిషిద్ధ స్వప్నం" కవితలో - నాబ్రతుకొకరికి బరువట/ నాబాధ్యతలు మరింత బరువట/ బుడిబుడి గారాలతో గడపాల్సిన నాబాల్యం / పసిగుడ్డుగా ఉన్నప్పుడే చేదెక్కిపోతుంది/ తొమ్మిది నెలల ప్రయాణం అలసట తప్ప/ పదినిమిషాల విశ్రాంతి కూడా నాకు నిషిద్ధం../ అమ్మ మౌనంగా కుళ్ళి పోయినప్పుడు/నేననుకున్నా.../నేనొక నిషిద్ధ జీవినే కాదు- నిషిద్ధ స్వప్నాన్ని కూడా" - అని అంటుంది.

**సరదాగా ఆడుకున్న ఆటల్లోనే జీవితం ఒలికి పోతుందన్న నిజాన్ని "అంజన" కవిత -"అమ్మ-బొమ్మ"లో ఇలా అంటుంది. బాల్యంలో బొమ్మకు అమ్మనయ్యానని సంతోషించాను. ఇప్పుడు అమ్మను నేనే/ బొమ్మను నేనే.**

చిన్నప్పుడు కనకుండానే తల్లయిపోయి, పెంపకాన్ని భుజాన మోస్తూ, అలసి పోతున్న పసితల్లిని చూసి "తల్లి కాని పిల్లల తల్లి" కవిత రాసింది. నేను ఏడేళ్ళకే తల్లినయ్యాను/ మా అమ్మ నవ మాసాలు మోసి/ కన్న పిల్లాడికి ఇప్పుడు నేనే తల్లిని/ బుడి బుడి రాగాలు మాత్రమే మిగిలిన నాకు/ బడి అంటే ఏమిటో తెలీదు/ అక్షరాలు దిద్దటానికి చిక్కని కాలం నాది/ హాయిగా ఆడి పాడే వయసుకి దొరకని సమయం నాది/ దరిద్రానికి ధారపోస్తున్న భద్రత నాది/ అన్నం వండి వార్చటానికీ / తమ్ముళ్ని సాకటానికి / బుజ్జి బుజ్జి చెల్లెళ్ళి బుజ్జగించటానికి / శాపవిమోచన లేని ఆడపిల్లనై / ఏడేళ్ళకే పిల్లల తల్లినై/ ఈ భూమి మీద అందరి సాక్షిగా పెరుగుతున్నాను అంటుంది.

మచ్చుకి కొన్ని మాత్రమే ఇవి. జీవిత ప్రతిఫలనాలన్నింటినీ సాహిత్యం ప్రతిఫలిస్తుంది. కాబట్టి బాల్యపు చేదు అనుభవాలను కవయిత్రులు ఇలా కవిత్వీకరించారు. ఈ వివక్షను రూపుమాపడమే మన బాధ్యత.

★

## "ఆడమ్ టు (ఆపిల్) ఐ ఫోన్"

ఆపిల్ "ఇట్స్ బ్రాండ్ నేమ్'....
ఆపిల్ ఫ్రూట్స్‌కే ఒక ఐకాన్...
ఆపిల్ తింటే ఏ పిల్ అక్కరలేదు నయా డాక్టర్స్ టాక్....
ఆపిల్ న్యూటన్ మేధను మధించిన క్రియేటర్....
ఆపిల్ కాస్ట్‌లోనూ.... టేస్ట్‌లోనూ.... అల్టిమేటర్....
ఆపిల్ మాయలో జగతి మతి తప్పి అల్లాడుతోంది....
ఆపిల్....ఆపిల్....ఆపిల్....ఏమిటి ఆపిల్ మానియా....
చరిత్ర గతిని మార్చేసిన మూడు ఆపిల్స్.... మూడు సెన్సేషన్స్....
నిను సిగ్గుల నయగారాలకు తెరతీసింది మానవుడి తొలితరం అమ్మ "ఆడమ్" తిన్న
మొదటి ఆపిల్ .... (ఇది ఒక మతగ్రంథం చెప్పే మాట
చెట్టు నుండి రాలుతున్న ఆపిల్ నూతన జగత్తుకు నాంది పలికి....
ఐజాక్ న్యూటన్‌ని పరిశోధనారంగ పితామహుడ్ని చేసింది రెండవ ఆపిల్....
ఆపిల్ ఫోన్ సృష్టించిన స్టీవ్ జాబ్‌ని మొబైల్ రంగంలోనే రారాజుని చేసి....
స్మార్ట్ ఫోన్ రంగంలో ఐఫోన్ 6తో అగ్రభాగాన నిలిపింది నేటి ఆపిల్ ....
ఆపిల్ మేనియాతో ఆగమైపోతోంది ఆధునికత....
ఆపిల్‌తో మమేకమైన మానవుడ్ని మాయతో మంత్రముగ్ధుడ్ని చేసేస్తోంది....
ఆడమ్.... న్యూటన్.... నేటి స్టీవ్ జాబ్ ఆపిల్‌తోనే చరిత్రలో నిలిచిపోయారంటే అతిశయోక్తి కాదేమో....
ఏది ఏమైనా ఆపిల్ ఒక బ్రాండే కాదు.... ఒక సెన్సేషన్.... ఒక డిస్కవర్.... ఒక క్రియేటర్....

మైలవరపు నాగమణి

కథ

# " కలకానిది, విలువైనది......"

డా|| ఎం. ప్రగతి

నరసమ్మకు ప్రొద్దుటి నుంచీ గాల్లో తేలిపోతున్నట్టుంది. ఒకచోట నిలబడలేకపోతోంది, ఎక్కడా కుదురుగా కూర్చోలేక పోతోంది. కోడలు లక్ష్మి నెల తప్పిందని తెలియడమే ఆమె సంతోషానికి కారణం. కొడుకు శీనుతో ఈ సంతోషాన్ని పంచుకుందామంటే ఎక్కడో దూరంగా మహారాష్ట్రలో వున్నాడు. ఫోన్ చేసి చెప్పాలని ప్రయత్నిస్తే అందుకోవడం లేదు. ఆర్నెల్ల క్రితం వరకూ నరసమ్మకు శీను మాత్రమే ఏకైక బంధం. శీనుతో లక్ష్మి పెళ్ళయిన తర్వాత తన ప్రపంచంలోకి మరోమనిషి ప్రవేశించినట్లయింది.

పాతికేళ్ళ క్రిందట శీను పుట్టగానే టి.బి. బారిన పడింది నరసమ్మ. అప్పటి మదరాసులో రైల్వేలో చిన్న ఉద్యోగి ఆమె భర్త. భార్య జబ్బు పడగానే ఆమెను కొడుకుతో సహా పుట్టింట్లో వదలివెళ్ళి పోయాడు. ప్రకాశం జిల్లాలో పల్లెకు ఎక్కువ, టౌనుకు తక్కువై ట్రంకు రోడ్డు సమీపంలో వున్న తన ఊళ్ళో చుట్టు ప్రక్కల వాళ్ళు తన గురించి గుసగుసలాడుకోవడం తను గమనించకపోలేదు. జబ్బుతో ఒకవైపు, భర్త నిర్లక్ష్యంతో మరోవైపు బెంగతో వున్న నరసమ్మను అమ్మలక్కల సూటిపోటిమాటలు మరింత బాధించడంతో చిక్కిసగమైంది. ఆ తర్వాత సంవత్సరానికి తన జబ్బయితే తగ్గింది కానీ, భర్త మాత్రం ఆమెను కాపురానికి తీసుకెళ్ళలేదు. కొంత కాలానికి అతను ఇంకోపెళ్ళి చేసుకున్నట్లు తెలిసింది. ఇక భర్త గురించిన ఆశ వదిలేసింది. పుట్టింటికి భారం కావడం ఇష్టంలేక, పక్కనే చిన్న గది అద్దెకు తీసుకొని, తనకు నయం చేసిన డాక్టర్ విశాల ఆస్పత్రిలో ఆయాగా చేరి బతుకు తెరువు చూసుకుంది. కొడుకును బళ్ళో వేసి, బాగా చదివించాలనుకుంది. కానీ తన దురదృష్టం శీనుకు చదువబ్బలేదు. ఏడవ తరగతి వరకు ఎట్టాగో బండి లాగించినా, అటుపై చదవలేక ఆపేశాడు. ఆ తర్వాత గ్యారేజీలో మెకానిక్ పని నేర్చుకోవడానికి కుదిరి, ఆపనిలో మెళకువలన్నీ త్వరగా నేర్చేసుకున్నాడు. ఆరేళ్ళలో ట్రంకు రోడ్డుపై సొంతంగా గ్యారేజీ పెట్టుకోగలిగాడు. చదువైతే అబ్బలేదు కానీ, మిగితా విషయాలలో శీను చాలా బుద్ధిమంతుడు. ఏ అవలక్షణమూ లేదు, ఎలాంటి దురలవాట్లూలేవు. పైగా తల్లంటే ప్రాణం పెట్టేవాడు. నరసమ్మకు తన జీవితంలో అదొక్కటే ఊరట. ఆర్నెల్ల క్రిందటే లక్షణమైన పిల్ల లక్ష్మితో శీను పెళ్ళి జరిపించింది. లక్ష్మి కూడా తమతో త్వరగా కలసిపోయింది. శీను తన గ్యారేజీకొచ్చిన లారీలను బాగుచేయడంతో పాటు, అవసరాన్ని బట్టి అప్పుడప్పుడు దూర ప్రాంతాలకు కూడా వెళ్తుండే వాడు. అలాగే ఇప్పుడు కూడా మెకానిక్ పని మీద నాగపూర్ వెళ్ళాల్సి వచ్చింది. తిరిగి రావడానికి బహుశా మరోరెండు మూడు రోజులు పట్టవచ్చు.

లక్ష్మి నెల తప్పిన వార్తను ఎప్పుడెప్పుడు కొడుకుతో పంచుకుందామా అని ఆరాటంగా వుంది నరసమ్మకు. కానీ మాయదారి సెల్లు తగలడమే లేదు. ఒకచోట కాలు నిలవక, ఆస్పత్రికి వెళ్ళి పనిలో పడిపోయింది. ఓగంట గడిచిందో లేదో ఓకాంపౌండరు నరసమ్మ దగ్గరికి పరిగెత్తుకొచ్చాడు. "ఇదిగో నర్సమ్మా ఇట్రా, చూడు నాగపూర్ దగ్గర ఏదో ఆంధ్రాలారీ యాక్సిడెంటని టీవీ వార్తల్లో చూపిస్తన్నారు. నీ కొడుకు నాగపూర్ పొయ్యిండంటివి గదా!" నరసమ్మ గుండె గుభేల్‌మన్నది. ఆలారీలో తన కొడుకుండకూడదని, ఉన్నా ఏం కాగూడదని మనసులో కోటి దేవుళ్ళకు మొక్కుకుంటూ టీవీ ముందుకు చేరింది. కానీ ఆదేవుళ్ళెవరూ నరసమ్మ కోరికను మన్నించినట్లు లేరు. రెండులారీలు ఢీకొన్న దుర్ఘటనలో శీను వున్నలారీ నుజ్జు నుజ్జయింది. శీనుతోపాటు లారీడ్రైవరు, క్లీనరు కూడా అక్కడికక్కడే చనిపోయినట్లు టీవీలో వివరాలు ప్రకటిస్తున్నారు. నరసమ్మ కుప్ప కూలిపోయింది. హాస్పిటల్ సిబ్బంది సపర్యలతో స్పృహలోకొచ్చింది గానీ, కాళ్ళ క్రిందభూమి కంపించిపోతున్నట్లుంది. కోడలికేం చెప్పాలి? ఇప్పుడిప్పుడే తల్లి కాబోతున్నాననే సంబరంలో వుందా పిల్ల! ఈపాటికి టీవీలో చూసేసుంటే...? పరుగున ఇల్లు చేరిన నరసమ్మకు సొమ్మసిల్లి పడిపోయిన లక్ష్మికనిపించింది. టీవీలో పదేపదే అవే వార్తలు ప్రసారమవుతున్నాయి. నరసమ్మకు విషయం అర్థమయింది లక్ష్మికి విషయం తెలిసిపోయిందని !

ఇన్నేళ్ళు తను ఒంటరిగా జీవితంతో పోరాడింది. కొడుకు చేతి కొచ్చాడనే సంతోషాన్ని పూర్తిగా అనుభవించకుండానే మరో ఉపద్రవం. శీను తండ్రికి విషయం చెప్పాలా వద్దా అని సంశయం. చివరికి ఏదైతే అదవుతుందని సమాచారం చేరవేసింది. కానీ అటువైపు నుంచి స్పందన కరువు. కొండంత దు:ఖాన్ని పంటి బిగువున అదిమి పెట్టి హాస్పిటల్ సిబ్బంది సహకారంతో అంతిమ సంస్కారం, ఇతర కార్యక్రమాలన్నీ ముగించింది. లక్ష్మి తనకేం సంబంధం లేదన్నట్లుగా శూన్యంలోకి చూస్తూ, అచేతనంగా పడివుంది. లక్ష్మినలా చూస్తున్న నరసమ్మకు గుండె తరుక్కుపోతోంది. పదకొండో రోజుకు మరోరెండు రోజులు మాత్రవే మిగిలుంది. నరసమ్మకు ఊహించుకుంటుంటేనే ఓవైపు భయం, మరోవైపు దు:ఖం . ఆరోజు లక్ష్మి గాజులు, బొట్టు తీసేయాలంటే, మొట్ట మొదటిసారిగా లోకం మీద కోపం తన్నుకొస్తోంది.

ఇన్నేళ్ళూ తన భర్త బతికున్నా, తనకు లేనట్లే బతికింది. అందులో తన తప్పేమీ లేకపోయినా లోకం తనదే తప్పని నిందించింది. ఓవైపు అనారోగ్యంతో కృశిస్తుంటే, తనకు తోడుగా నిలవాల్సిన వ్యక్తి పట్టనట్టు వదలి వెళ్ళిపోయి, తనకు నయమవుతుందేమో అన్న ఆలోచన కూడాలేకుండా మళ్ళీ పెళ్ళి

చేసుకోవడం గుండెను కోసేసినట్లయింది. అదే తన భర్తకు ఆరోగ్యం బాగలేక పోతే, తను అలా నిర్లక్ష్యం చేసి వుండేదా? తనేకాదు, ఏ స్త్రీ అలాచేయదు. పాడులోకం - మగాడి కోన్యాయం, ఆడదానికోన్యాయం? కనీసం కన్నకొడుకు బాగోగులు కూడా ఆ మహానుభావుడే నాడూ పట్టించుకోలేదు. ఓవైపు చిన్న పిల్లాడు, మరోవైపు సమాజంలో చులకన, ఇవి కాక ఒంటరి ఆడదాని చుట్టూ తోడేళ్ళ లాంటి మగమృగాలు. ఎలానెట్టు కొచ్చిందో, ఎంతలా పోరాడిందో తనకు మాత్రమే తెలుసు. ఇప్పుడు లక్ష్మి భవిష్యత్తు గురించి ఆలోచిస్తుంటే చెప్పలేనంత భయం, కొండంత దు:ఖం ఒకేసారి కమ్ముకొచ్చాయి. ఏం చేయాలి? మరోవైపు లక్ష్మి పరిస్థితి దిగజారిపోతోంది. తిండి తినడం మానేసి, చిక్కి శల్యమైపోతోంది. లక్ష్మి జీవితం తనలా కాకూడదు, ఏదో ఒకటి చేసితీరాలి. చివరికో నిర్ణయాని కొచ్చిన నరసమ్మ దిగాలుగా కూచున్న లక్ష్మి చేయిపట్టుకుంది.

"అమ్మాయ్ లే, నాతోరా !" అంటూ లాక్కెళ్ళ సాగింది. "యాడకత్తమ్మా, నన్నెందుకిట్ట ఇగ్గక పోతుండావు?" లక్ష్మి ప్రశ్నకు జవాబు చెప్పకుండానే, "నోర్మూసుకొని పా" అంటూ నరసమ్మ లక్ష్మిని ఆస్పత్రికి లాక్కెళ్ళింది. "నువ్విడే కూచో, నేనిప్పుడే వస్తా" నంటూ డాక్టర్ విశాల గదిలోకెళ్ళి, ఆమె కాళ్ళమీదపడింది. "డాక్టమ్మా, నా కోడలికి కడుపు తీసెయ్యాలమ్మా!". అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది. "ఏమంటున్నావు నరసమ్మా నువ్వు, భర్త చనిపోయి కడివెడు దు:ఖంలో వున్న ఆపిల్లను కనీసం బిడ్డనైనా చూసుకొని బతకనీవా? నాచేతులతో నేనా పని చేయలేను." లక్ష్మికి అబార్షన్ చేయడానికి విశాల ససేమిరా ఒప్పుకోలేదు. నరసమ్మ విశాల కాళ్ళ మీద పడి రోదించసాగింది. "నాకు మొగుడున్నా లేనట్టే ఇన్నేండ్లూ గడిసిపోయినియి. ఇప్పుడు లచ్చిని జూస్తంటే దాని బతుకూ నాలాగే అయ్యిద్దని బయమయితందమ్మా! నిండా ఇరవైయేండ్లు లేవా పిల్లకి. తన బిడ్డను సూసుకుంటూ బతికినంతకాలం ఏడుస్త సావాల్నా? నాబతుకులాగా దాని బతుకూ తెల్లారి పోగూడదు. ఆనలుసు లేకపోతే ఏమనసున్న మారాజో మనువాడక పోతాడా? బిడ్డ పుడితే లచ్చి ముందరి కాల్లకు బందమయిపోద్ది. నామాటిని ఆ కడుపు తీసేయమ్మా, సచ్చి నీకడుపున పుడతా".

నరసమ్మ మాటలు విన్న విశాల నిశ్చేష్టురాలయింది. తనలాగే తన కోడలి జీవితం నాశనం కాకూడదని, ఎంతో ముందుచూపుతో ఆలోచించిన ఆమె మంచి మనసుకు లోలోపలే జోహార్లర్పించింది. బయటికి మాత్రం "నరసమ్మా, నన్ను కొంచెం ఆలోచించుకోనీ." అంటూ చెప్పి, తనగదిలోకి నడిచింది. కుర్చీలో చేరగిలబడి ఆలోచనలోపడింది. నరసమ్మ తన ఆస్పత్రిలో పేషెంటుగా వచ్చినప్పటికి శీనుకు రెండేళ్ళయినా వుంటాయోలేదో. రోగం బాగయినా భర్త తీసుకెళ్ళక పోవడంతో ఒంటరిదైన నరసమ్మను తన ఆస్పత్రిలోనే ఆయాగా చేర్చుకొని ఓదారి చూపింది. ఒకరకంగా చూస్తే తన జీవితానికి, నరసమ్మ జీవితానికి చాలా పోలిక. నరసమ్మలాగానే తనూ ఒంటరిగా జీవితంతో పోరాడాల్సి వచ్చింది. పెద్దలందరినీ కాదని ప్రేమవివాహం చేసుకున్నా, ఆపెళ్ళి ఎక్కువకాలం నిలబడలేదు. ఒక్కగానొక్క కూతురు శిల్ప ఏడేళ్ళ వయసులో వుండగా భర్త డాలర్ల మీద వ్యామోహంతో తను ఎంత వద్దన్నా వినకుండా అమెరికా ఎగిరిపోయాడు. సంపాదనకు తన రెండు చేతులూ చాలక మరో లేడీ డాక్టర్ చేయందుకొని అక్కడే సెటిలయిపోయాడు. చుట్టు పక్కల పల్లెలనుంచి వచ్చేపేషెంట్లతో విశాల హాస్పిటల్ కూడా ఎప్పుడూ రద్దీగానే వుంటుంది. కానీ తను కొన్ని విలువలకు కట్టుబడి ఎవరినుంచీ అదనంగా ఒక్కరూపాయి కూడా ఆశించదు. వైద్యాన్ని వ్యాపారం చేయకూడదనే తన దృక్పథానికి కట్టుబడివుంది. అందుకే సౌకర్యాలకు తగినంత సంపాదన వున్నా, మిగిలిన డాక్టర్లతో పోలిస్తే విలాసవంతమైన జీవితం కాదు తనది. అలాంటి జీవితం కావాలని కూడా తనేనాడు కోరుకోలేదు. అయినా ఆస్పత్రిలో రోగులు, సిబ్బంది చూపించే ప్రేమాభిమానాలు, ఆత్మీయతల ముందు ఎన్ని సంపదలైనా దిగదుడుపేననిపిస్తుంది తనకు. ఆ పరిమితులలోనే ఆస్పత్రి నిర్వహించుకుంటూ, శిల్పను పెంచి పెద్దచేసింది. శిల్ప నరసమ్మ కొడుకు శీను కంటే రెండేళ్ళు పెద్దది. శిల్పపెద్దయ్యే కొద్దీ తనను అర్థం చేసుకొని, తోడుగా వుంటుందనుకున్న విశాల ఆశ అడియాశే అయింది. చీటికి మాటికి తల్లిమీద చిరాకు పడటం, తండ్రి ఆలోచనలకు తగినట్లు నడచుకోలేదని తప్పు పట్టడం విశాలను బాధించేవి. శిల్ప తండ్రికి కేవలం గ్లామర్ నిండిన జీవితమే కాదు, గ్లామర్ వున్న జీవిత భాగస్వామి కూడా కావాలని తన కూతురికి ఎలా చెప్పగలదు తను?

శిల్పకు పద్నాలుగేళ్ళ వయసులో ఓ ఆత్మీయహస్తం చేయందించినా, తను అందుకోలేని పరిస్థితి. తను సమస్యల్లో వున్నపుడు ఎవరూ రాకపోయినా, కాస్త ఆర్థికంగా నిలదొక్కుకునేసరికి బంధువులనిచెప్పుకునేవాళ్ళు రాబందుల్లా చేరారు. చేరినవాళ్ళు తనమీద పెత్తనం చేయడం మొదలెట్టారు. "ఇప్పుడు నీకు ఇంకో తోడు అవసరమా?" అని ఎద్దేవా చేయడంతోపాటు కూతురికి తనపై వ్యతిరేకతను నూరిపోశారు. ఆ దెబ్బతో తను ఇక ఆ ఆలోచన మానుకుంది. కానీ తనకూతురు మాత్రం తనకు దగ్గరకాలేకపోయింది. కొన్నేళ్ళకు చదువు కోసం భౌతికంగా కూడా దూరమైంది. చదువు పూర్తయ్యా కాగానే తన సహాధ్యాయిని పెళ్ళిచేసుకోవాలన్న నిర్ణయాన్ని తెలిపింది. విశాల తన పెద్దరికానికి లోటు లేకుండా, తన చేతుల మీదుగానే వారి పెళ్ళిజరిపించింది. పెళ్ళయిన వెంటనే శిల్ప భర్తతో కలిసి అమెరికా వెళ్ళిపోయింది. ఎప్పుడో గుర్తొచ్చినపుడు ముక్తసరిగా ఫోన్‌చేయడమే తప్ప, వచ్చి చూసేదంటూ లేదు. ఇండియాలో కాలుష్యం, అపరిశుభ్రత, కరెంటు కోత భరించ లేనంటూ, మొహం మీదే రానని తెగేసి చెబుతుంది. ఆవిషయంలో నరసమ్మకూ తనకూ అసలు పోలికలేదు. నరసమ్మ చాలా అదృష్టవంతురాలని విశాల అభిప్రాయం. శీను తల్లిని కళ్ళల్లో పెట్టుకొని చూసుకునే వాడు.

**తన దిష్టే తగిలిందేమో? ఆ అదృష్టం నరసమ్మకు దూరమైపోయింది. లక్ష్మికూడా తామిద్దరిలాగే కాకూడదనే నరసమ్మ బాధలో అర్థముందనిపించింది విశాలకు. ఓ నిర్ణయానికొచ్చి నరసమ్మను పిలిపించింది. "నరసమ్మా, నీ కోడలిని థియేటర్‌లోకి తీసుకుపద." నరసమ్మ ముఖంలో కృతజ్ఞతతో కూడిన సంతృప్తితో చేతులు జోడించింది.**



# మాతృత్వపు సౌకర్యాల చట్టం 1961

- ఆర్. దుర్గాప్రసన్న, అడ్వకేట్



**కుటుంబమైనా, సమాజమైనా, దేశం అయినా అభివృద్ధి దిశగా అడుగులు వేయాలన్నా సంపదను వృద్ధి చేయాలన్నా స్త్రీ పురుషులు ఇరువురూ భాగస్వాములు కాక తప్పదు. పిల్లలను 9 నెలలు మోసి కనడం అనేది ప్రకృతి సిద్దమైన చర్య. అది స్త్రీ మాత్రమే నెరవేర్చవలసిన భాధ్యత. కుటుంబ జీవనంలో పిల్లలను కని పెంచడానికి మహిళకు కావలసిన అన్ని వసతులూ కల్పించి ఆనందకరమైన, ఆరోగ్యకరమైన వాతావరణం కలిగించే బాధ్యత ఆ కుటుంబంలోని వ్యక్తులదే. అప్పుడే ఆరోగ్యకరమైన శిశువుకు స్త్రీ జన్మనివ్వగలుగులుతుంది. మరి పురుషులతో సమానంగా కార్ఖానాలలోనూ, కార్యాలయాలలోనూ పనిచేసే స్త్రీల పరిస్థితులేంటి? స్త్రీలకు ప్రసవానికి ముందు, ప్రసవానంతరం కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కల్పించవలసి ఉంటుంది. 1919లో మొట్టమొదటి సారిగా International labour organisation (ILO) ప్రపంచ శ్రామిక వ్యవస్థ కొన్ని ప్రతిపాదనలు చేసింది. పనిచేసే శ్రామిక స్త్రీలకు ప్రసవానికి వేతనముతో కూడిన సెలవులు ఇవ్వాలని ప్రతిపాదించడం జరిగింది. తరువాతి కాలంలో ఆ ప్రతిపాదనలు చట్టరూపం దాల్చడం జరిగింది.**

మాతృత్వం అనేది స్త్రీకి ఒక హక్కు. అంతేకాదు ఆరోగ్యవంతమైన సమాజం, ఆరోగ్యకరమైన పరిస్థితులలో శిశువు జన్మించాలంటే-ఆ శిశువు తల్లి గర్భంలో ప్రాణం పోసుకోవడానికి ముందు నుండే అనేక జాగ్రత్తలు తీసుకోవడం, మరెన్నో వేడుకలు జరిపే సాంప్రదాయం మన దేశంలో ఆదినుండి వున్న ఆచారమే. ఆహ్లాదకరమైన, ఆరోగ్యకరమైన పరిస్థితులలో జన్మించే శిశువులే శారీరక మానసిక దృఢత్వాన్ని కలిగివుంటారనడంలో అతిశయోక్తి లేదు. కార్యాలయంలో పనిచేసే స్త్రీలు గర్భం దాల్చినపుడు వారు చేసే పనినుండి వైదొలగవలసి వచ్చేది. మొదట శిశువు ఆరోగ్య పరిరక్షణ కొరకు, రెండు పని సామర్థ్యం ఆ సమయంలో వారిలో తక్కువగా ఉంటుందని అయితే 1948లో ప్రవేశపెట్టిన Employee's State Insurance act (The ESI act 1948) గర్భవతులకు బాలింతలకు కొన్ని హక్కులను కల్పించింది Sec 46 (ఎ) లో గర్భవతులకు వచ్చే చిన్న చిన్న అనారోగ్యాలకూ, గర్భవిచ్ఛేదం జరిగినపుడు, నెలలు నిండకుండా శిశువు జన్మించినపుడు 'Meternity Benefits' (మాతృత్వపు సౌకర్యంగా) కొన్ని రాయితీలు అంటే వేతనంతో కూడిన సెలవుని మంజూరు చేయడమే కాకుండా అవి పొందడానికి అవసరమైన విధి విధానాలను రూపొందించడం జరిగింది. తరువాతి కాలంలో పురుషులతో సమానంగా పని చేసే స్త్రీలందరికీ సాంఘీక న్యాయం జరగాలన్నా, సామాజికంగా వారి సేవలను పొందాలన్నా మాతృమూర్తులకు ప్రసవకాలంలో సౌకర్యాలను కల్పించి తీరాలి. అలాంటి సౌకర్యాలను పొందడం ఏదైనా సంస్థలలో పనిచేసే స్త్రీలందరికి వర్తించేలా రూపు దిద్దుకున్న చట్టమే The Meternity Benefits act 1961 మాతృత్వపు సౌకర్యాల చట్టం. 1976వ సంవత్సరంలోని సవరణలవల్ల 'ఉద్యోగినులు' అంటే ప్రభుత్వ, ప్రభుత్వేతర రంగాలలోని కార్యాలయాలు, ఫ్యాక్టరీలు, మున్నగు చోట్ల పనిచేసే వారందరికీ వర్తిస్తుంది. ఈ చట్టం వలన పనిచేసే ఉద్యోగినులకు మాతృత్వపు సౌకర్యాలు కార్యాలయపరంగా పొందడం ఒక హక్కు. కార్యాలయాలు అంటే ప్రభుత్వ, ప్రయివేటురంగ కార్యాలయాలు కూడా వారి యొక్క బాధ్యతను సక్రమంగా నిర్వర్తించవలసి ఉంటుంది. ఉద్యోగినుల యొక్క మాతృత్వపు సౌకర్యాలు/ప్రసూతి సౌకర్యాలకు భంగం కలిగించినపుడు ఆయా సంస్థలకు చట్టప్రకారం శిక్షలు నిర్దేశించడమైనది. అంటే ఉద్యోగినులు గర్భిణులగా ఉన్న కాలంలో వేతనంతో కూడిన సెలవుని మంజూరు చేయడమే కాక మాతృత్వపు సౌకర్యాల చట్టంలో నిర్ధేశించిన సౌకర్యాలను వారికి చట్టబద్ధంగా కల్పించవలసిన బాధ్యత ఆయా సంస్థల యజమానులదే.

ఉద్యోగినులు ఈ చట్టం క్రింద గర్భవతులుగా ఉన్నపుడు వారిని పనిలోనుండి తొలగించకుండా, ఉద్యోగినులుగా కొనసాగుతారు. అంతే కాదు, వారికి కావలసిన విశ్రాంతినిస్తూ తేలికపాటి పనులను మాత్రమే చేయనివ్వాలి. తల్లి, గర్భస్థశిశువుల సంక్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని అందుకు అనుకూలమైన పరిస్థితులను కల్పించాలి. మాతృత్వపు సౌకర్యం అంటే 12 వారాల ప్రసూతి సెలవు జీతంతో పొందవచ్చును. అంటే ఈ వేతనంతో కూడిన సెలవుకాలం ప్రసవానికి ముందు, వెనుక లేదా మొత్తంగా ప్రసవానంతరం వాడుకోవచ్చును. ఇందుకు సంబంధించి ఒక ఫామ్ ఉంటుంది. ఆ ఫామ్‌లో నామినీ పేరును కూడా సూచించినపుడు దాని ప్రకారం వేతనంతో కూడిన సెలవును

**ఈ చట్టం వలన పనిచేసే ఉద్యోగినులకు మాతృత్వపు సౌకర్యాలు కార్యాలయపరంగా పొందడం ఒక హక్కు. కార్యాలయాలు అంటే ప్రభుత్వ ప్రయివేటురంగ కార్యాలయాలు కూడా వారి యొక్క బాధ్యతను సక్రమంగా నిర్వర్తించవలసి ఉంటుంది. ఉద్యోగినుల యొక్క మాతృత్వపు సౌకర్యాలు/ప్రసూతి సౌకర్యాలకు భంగం కలిగించినపుడు ఆయా సంస్థలకు చట్టప్రకారం శిక్షలు నిర్దేశించడమైనది. అంటే ఉద్యోగినులు గర్భిణులుగా ఉన్న కాలంలో వేతనంతో కూడిన సెలవుని మంజూరు చేయడమే కాక మాతృత్వపు సౌకర్యాల చట్టంలో నిర్దేశించిన సౌకర్యాలను వారికి చట్టబద్ధంగా కల్పించవలసిన బాధ్యత ఆయా సంస్థల యజమానులదే.**

మంజూరు చేస్తూ మెడికల్ బోనస్ (వైద్య ఖర్చుల నిమిత్తం) ఆయా సంబంధిత ఎమ్ప్లాయర్/సంస్థ ఆ ఉద్యోగినికి గానీ, ఆమె సూచించిన నామినీకి గానీ చెల్లించవలసి ఉంటుంది.

సెక్షన్ **9** : గర్భధారణ సమయంలో అనారోగ్యాలు ఎదురై నెలలు నిండకముందే ప్రసవించినా, గర్భస్రావం జరిగినా కూడా వేతనంతో కూడిన సెలవుని 45 రోజులు పొందవచ్చును.

సెక్షన్ **10** : గర్భధారణ సమయంలో పూర్తి విశ్రాంతిని డాక్టర్లు సిఫారసు చేసినపుడు కూడా ఈ 6 వారాలు (45 రోజులు) సెలవును వాడుకోవచ్చును. ప్రసవానంతరం పుట్టిన పిల్లలకు 15 నెలలు వచ్చేవరకు తల్లి సంరక్షణ ఆవశ్యకాన్ని గుర్తించాలి. పిల్లలకు తరచుగా వచ్చే జలుబు, జ్వరం లాంటి పరిస్థితులలో 1, 2 రోజుల సెలవులను మంజూరు చేయాలి. అంతేకాకుండా పాలిచ్చే తల్లులకు శిశువు పాలకోసం విరామం మంజూరు చేయాలి.

ప్రసవంలో తల్లి మరణించినప్పుడు ఆ మొత్తాన్ని పుట్టిన శిశువుకూ లేదా తల్లీ బిడ్డ ఇరువురూ మరణించినట్లయితే నామినీగా పేర్కొన్న వ్యక్తికి యాజమాన్యం/ఎమ్ప్లాయర్ చెల్లించాలి. ఈ చట్టం అమలులోకి వచ్చినందున ప్రసవానికి ముందు, ప్రసవానంతరం స్త్రీలకు మాతృత్వం ఒక హక్కుగా గుర్తించబడింది. పని సామర్థ్యం తగ్గి ఉద్యోగంనుండి తొలగించే పరిస్థితి లేదు. వేతనంతో కూడిన సెలవులవల్ల ఆర్థిక తోడ్పాటు, ఉద్యోగ భద్రతా కలిగాయి. తద్వారా సాంఘిక భద్రత కూడా కలుగుతుంది. ఇంటికి, వంటకీ మాత్రమే పరిమితమైన స్త్రీల శక్తి సామర్థ్యాలు దేశపురోభివృద్ధికి ప్రయోజనకరమైనవని వేరే చెప్పనవసరం లేదు. ★

---

*28వ పేజీ తరువాయి*

హింసాయుతంగా వ్యవహరిస్తారు. ఈరోజు చాలామంది స్త్రీలు శ్రామిక మార్కెట్‌లో చేరుతున్నారు. చాలా తక్కువ వేతనాలు, తీవ్రమైన దోపిడీ, హింసకు గురయ్యే స్థితి, సామాజిక రక్షణ కరువవడం లాంటి విపత్కర పరిస్థితులను ఎదుర్కొంటున్నారు. అయినప్పటికీ పురుషులు భయంతో తత్తరపాటుకు గురవుతున్నారు. తమ అభద్రతా భావాన్ని, ఆత్మన్యూనతను స్త్రీలను హింసించటం ద్వారా భర్తీ చేసుకుంటూ స్వల్పకాలికంగా అధికారాన్ని అనుభవించామనే భావనకు లోనవు తున్నారు.

**'ప్రతి మహిళ భావోద్వేగాలకు లోనవుతుందని భావిస్తున్న సందర్భంలో పురుషునికి ఏడ్చే హక్కు, సున్నితత్వం నిరాకరించబడుతున్నాయి. మహిళల కంటే పురుషులు అధికులు అనే భావజాలం పితృస్వామిక వ్యవస్థకు ఆధారం. కానీ పురుషత్వం సామాజికంగా ఉత్పన్నమైనది, పురుషుడిగా ఉండటమెలాగో తెలియజేసేది. అయితే సమాజం పురుషత్వానికి, నిర్దేశించిన ప్రమాణాలను వారు సాధించలేనపుడు ఏం జరుగుతుంది? పురుషులందరూ తమ మృదు స్వభావాన్ని దాచి ఉంచలేరు. లేదా సంపాదనలో ఇతర పురుషులతో పోటీ పడటంలో విజయం సాధించలేరు. తమ కుటుంబాలకు ఊతమివ్వలేరు.**

మహిళలు సమాన వేతనాలు, సరైన ఉద్యోగాలు పొందలేనప్పుడు పురుషుడే ఆ కుటుంబంలోని మరో జీవి కోసం కుటుంబ ఆర్థిక బాధ్యతలను స్వీకరించ వలసిన ఉంటుంది. వర్గ, కుల, ధన, జాతి రీత్యా ఆధిపత్యం చెలాయిస్తున్న పురుషులు మహిళలపై హింసను ప్రయోగించటం ద్వారా తమ ఆధిపత్యాన్ని సంపూర్ణంగా పొందినట్లు భావిస్తారు. స్త్రీలపై ఆధిపత్యం వహించాలనుకునే పురుషులు సహజంగా తమ సహచర పురుషులపై కూడా ఆధిపత్యాన్ని చెలాయించాలని చూస్తారు. అణచివేతకు గురైన పురుషులు మహిళలను హింసించడం ద్వారా సామాజికంగా తమ పురుషత్వాన్ని తిరిగి నిలబెట్టుకునే ప్రయత్నం చేస్తారు. ఓటమిపాలైన పురుషుడు చివరి ఆయుధంగా మహిళలపై హింసకు పాల్పడుతున్నాడు.

నేడు అనేకమంది మహిళలు సమానత్వ స్ఫూర్తిని నింపుకుని, ఆటంకాలను అధిగమిస్తూ ఇంటా, బయటా తమ సామర్థ్యాలను నిరూపించుకోవడానికి శక్తివంచన లేకుండా కృషి చేస్తున్నారు. మెరుగైన ఫలితాలు సాధిస్తున్నారు. మహిళలపై ఆధిపత్య భావన, ప్రత్యేక హక్కు, అధికారం కలవనే పురుషులు వాటిని వదులుకోవటం ద్వారా మాత్రమే తమను తాము విముక్తులను చేసుకుంటున్నట్లు మరింతగా గమనించాల్సిఉంది. ప్రతి మహిళా తన రక్షణ, స్వేచ్ఛ, సమానత్వం కోసం వేసే ప్రతి అడుగు తన సంపూర్ణ స్వేచ్ఛా మార్గాన్ని సులభతరం చేస్తుందని పురుషుడు గమనించాలి.

★

మీడియా

# 'హైదర్' రివ్యూ




- కె. సమత

హైదర్ సినిమా వివాదాస్పదమైంది. షేక్‌స్పియర్ **'హామ్లెట్'**ను కాశ్మీర్‌కి అన్వయించి ఈ సినిమా తీశారు. అలా అన్వయించి ఒక అర్థవంతమైన, అందరికీ అర్థమయ్యేరీతిలో కథనాన్ని రూపొందించడం చాలా కష్టం. ఆ విధంగా దర్శకుడు సాహసం చేశాడనే చెప్పుకోవాలి. ఈ సినిమాకి దక్కాల్సిన ప్రశంసలు పక్కన పెడితే, జాతీయవాద వ్యతిరేక సినిమాగా విమర్శల పాలయింది. ఇదే కథనాన్ని ఒక పుస్తక రూపంలో అందిస్తే దీనిని ఆదరించే పాఠకులు చాలా తక్కువమంది ఉంటారు. ఆ కథనాన్ని విమర్శించాలన్నా, ప్రశంసించాలన్నా ఒక్క మేధావులే చేయగలరు. రచయిత సినిమాను మాధ్యమంగా ఎంచుకోవడం ప్రశంసనీయం. **'హైదర్'లో** అనేక సన్నివేశాలు, మనల్ని ప్రస్తుత కాశ్మీర్ పరిస్థితుల గురించి ఆలోచించేలా చేస్తాయి. కాశ్మీర్ అనగానే కొండలు, లోయలతో సందర్శకులకు అందమైన అనుభూతులను కలిగించే ప్రదేశంగానే చూస్తాం. కానీ అక్కడ ప్రజలు ఎదుర్కొనే ఇబ్బందులు, పడేపాట్లు ఎలా ఉంటాయో భిన్నమైన కోణంలో మనకళ్ళకు కట్టినట్లు చూపించింది **'హైదర్',** ఈ సినిమా కాశ్మీర్ రాజకీయ చరిత్రగానో, భారత సైనిక సిబ్బందికి వ్యతిరేకంగా రూపొందించిన కల్పనగానో కాకుండా ఒక సాధారణ కుటుంబ కథలా చూస్తే భారతీయులుగా మనం ఎన్నడూ ఊహించని, అనుభవించని, అనుక్షణం భయాందోళనకి గురయ్యే ఒక జీవితం కనిపిస్తుంది. ఈ రెండున్నర గంటల సినిమా రాజకీయాల్లోనూ, కాశ్మీర్ పరిస్థితిలోనూ మార్పులు తీసుకురాక పోవచ్చుగానీ, ఒక బయటి వ్యక్తి చూపు, లోపలి వ్యక్తుల చూపులకు ఎంత భిన్నంగా ఉంటుందో అర్థమయ్యేలా చేస్తుంది. మన సైనికులు గాఢ జాతీయతాభావంతో కాశ్మీర్ రక్షణకు పాటుపడుతూ త్యాగాలు చేస్తూ మనకు ప్రశాంత జీవితాన్ని ప్రసాదిస్తున్నారనే మాట ఎంత నిజమో, - కాశ్మీర్ సరిహద్దుల్లో నివసిస్తున్న అమాయక ప్రజలు రెండు సైనిక దళాల మధ్య నలిగిపోతున్నారన్నదీ అంతే నిజం.

ఎప్పుడూ కర్ఫ్యూలూ, కాల్పులు, కుటుంబసభ్యులు కనపడకుండా పోవడం, కనిపించకుండా పోయిన వాళ్ళు జీలం నదిలో శవాలుగా తేలడం... ఇవన్నీ ఊహించడానికే చాలా భయంగా ఉంటుంది. ఈ సినిమా చూడడానికి ముందు, కాశ్మీర్‌లో ప్రజల జీవన పరిస్థితి గురించీ, అక్కడ సైనికులకు ఎవరి మీదైనా ఏ మాత్రం అనుమానం కలిగినా వారిపై ఉగ్రవాదులుగా ముద్రవేసి వాళ్ళను ఎంతగానో హింసిస్తారన్న సంగతీ అనేక సందర్భాలలో నా కాశ్మీర్ క్లాస్‌మేట్ చెప్పగా విన్నాను.

హైదర్ సినిమాలో షాహిద్ కపూర్, టబూ పాత్రలు కీలకమైనవి. కథనం మొత్తం వీరి చుట్టూ తిరుగుతూ ఉంటుంది. హైదర్ (షాహిద్ కపూర్) ఒక కాశ్మీరీ కుటుంబానికి చెందిన యువకుడు. చిన్నా పెద్దా తేడా లేకుండా అందరూ తీవ్రవాదానికి సులభంగా ఆకర్షితులయ్యే వాతావరణం అది. హైదర్ చిన్న వయస్సులోనే తుపాకీ చేతపట్టడం, తల్లితండ్రులను ఎదిరించడం చూసి ఇక్కడ ఉంటే ఎక్కడ తీవ్రవాదుల్లో చేరిపోతాడో అని, హైదర్ తల్లి (టబూ) ఆందోళనకి గురై, ఇంటికి, హింసకు దూరంగా కొడుకును చదివించాలనుకుంటుంది. బలవంతపెట్టి హైదర్‌ను అలీగఢ్ పంపిస్తుంది. తండ్రి

కనిపించకుండా పోయిన విషయం తెలుసుకుని అతన్ని వెతుక్కుంటూ వచ్చిన హైదర్, తండ్రి ఆచూకీ కోసం పడే తపన, అతనిలాగే **తమ కుటుంబ సభ్యులను వెతుక్కుంటూ మరెందరో పడే ఆవేదన, ఇంటినీ, జీవన ఆధారాన్ని కోల్పోయి రోడ్డుపై పడ్డ చాలా మంది పడే కష్టాలు మనల్ని చలింపచేస్తాయి. అక్కడ బాధిత కుటుంబాల** వ్యధను సైతం రాజకీయ లబ్ధికోసం **వినియోగించుకునే రాజకీయ పార్టీలను చూసి రాజకీయాలు ఎంత దిగజారాయో అనిపిస్తుంది. 'రెండు కూటముల మధ్య జరిగే ఘర్షణలో మధ్యలో ఉన్నవాళ్ళు నలిగిపోవడం అతి సాధారణం' అని సైన్యానికి ఆర్మీ ఆఫీసర్ చెప్పే సన్నివేశం చూస్తే కాశ్మీర్ ప్రజల పరిస్థితి ఇంత దయనీయంగా ఉంటుందా అనిపిస్తుంది. జీలం నదిలో పడవ నడిపేవాడికి హైదర్ తన తండ్రి ఫోటో చూపించి ఈ నదిలో ఎక్కడైనా శవం దొరికితే చూడమని చెప్తాడు.** జీలం నదిలో శవాలు దొరకడం, ఒక వాహనంలో మృతదేహాలను తీసుకొచ్చి, మీ వారు ఎవరో వెతుక్కోండని కుటుంబ సభ్యులకు చెప్పడం, వారు వెతుక్కోవడం సన్నివేశం చూస్తే ఒళ్ళు జలదరించి పోతుంది. భర్త చనిపోయాడో, ఏ జైల్లోనో బతికే ఉన్నాడో తెలియదంటూ హైదర్‌తో టబూ చెప్పే 'సగం వితంతు' పరిస్థితి, స్త్రీల నిస్సహాయతను, బాధను చూపిస్తుంది. తన తండ్రికి పాకిస్తాన్ మిలిటెంట్‌లతో సంబంధం ఉందని, భారత సైన్యం అతన్ని బంధించి చంపేసిందని హైదర్ తెలుసుకుంటాడు. తన మరణానికి కారణమయిన వాళ్ళను చంపేయమని తన తండ్రి చివరి కోరిక కోరాడని, అతనితోపాటు జైలులో శిక్ష అనుభవించి, తప్పించుకున్న ఒక తీవ్రవాది చెప్పినమాటలు విని, ఆయుధాన్ని చేపడతాడు. అప్పటిదాకా తను దూరంగా ఉన్న తీవ్రవాదానికి చేరువవుతాడు. ఏదైతే జరగకూడదని తనను దూరంగా ఉంచి తల్లి చదివించిందో, హైదర్ అదే బాటను ఎంచుకునే సరికి టబూ కుంగిపోతుంది. తీవ్రవాదుల్లో చేరాడని భారతీయ సైన్యం, పోలీసులు అతన్ని చంపడానికి వెతుకుతున్న సమయంలో కొడుకును ఎలాగైనా కాపాడుకోవాలని టబూ ప్రయత్నిస్తుంది. హైదర్‌ను ఆ దారిలో వెళ్లొద్దనీ, హింసకి హింస జవాబుకాదని అర్థమయ్యేలా చెప్పడానికి అనేక రకాలుగా ప్రయత్నిస్తుంది. తను చంపాలనుకున్న వాళ్ళను చంపేతీరుతానని, తండ్రి కోరికను నెరవేర్చడమే తన లక్ష్యమని అంటూ తల్లి మాటల్ని కొట్టి పడేస్తాడు హైదర్. చివరి ఘట్టంలో సైన్యం హైదర్ ఉన్న స్థావరాన్ని చుట్టుముట్టి అతన్ని అంతం చేయడానికి సిద్ధంగా ఉన్న సమయంలో తనకి ఒక్క ఆఖరి అవకాశం ఇవ్వమని, తన కొడుకుకు నచ్చచెప్తానని వెళ్ళి, ఈ హింస వద్దని, ఎవరినీ చంపనని ప్రమాణం చేయమని హైదర్‌ను చివరి కోరిక కోరుతుంది. అందుకు హైదర్ నిరాకరిస్తాడు. తన కొడుకును కాపాడుకోలేక, అతన్ని మార్చలేక టబూ మానవ బాంబుగా మారి పేల్చుకుని చచ్చిపోతుంది. తను చంపాలనుకున్న వ్యక్తి కళ్ళముందు ఉన్నా తండ్రి చివరి కోరికైన ప్రతీకారం, తల్లి చివరికోరికైన మానవత్వం... రెంటి మధ్య సంఘర్షణకు లోనై హైదర్ చివరికి అతన్ని చంపకుండానే వదిలేస్తాడు.

ఈ సినిమా సాదత్ హసన్ మంటో రాసిన "ది డాగ్ ఆఫ్ టిట్వాల్", "దిలాస్ట్ సెల్యూట్" అనే రెండు కథలను గుర్తుచేసింది. ఈ రెండూ, భారత్ – పాక్ విభజన తర్వాత సరిహద్దుల్లోని పరిస్థితిని ప్రతిబింబిస్తాయి. "ది డాగ్ ఆఫ్ టిట్వాల్"లో ఒక కుక్క భారత సైన్యం ఉన్న ప్రాంతానికి, పాక్ సైన్యం ఉన్న ప్రాంతానికి మధ్యలో తిరుగుతూ ఉంటుంది. దాని మెడలో పాక్ కుక్క అని భారతీయ దళం, భారతీయ కుక్క అని పాకిస్తాన్ దళం ఒక బిళ్ల వేళ్లాడదీసి అటూ ఇటూ తిప్పుతారు. చివరికి ఆ కుక్కను రెండు దళాల వాళ్ళూ కాల్చి చంపేస్తారు. ఈ కుక్క బోర్డర్‌లో నివసిస్తున్న ప్రజానీకానికి చిహ్నం. "ది లాస్ట్ సెల్యూట్" అనే కథకు వస్తే దేశ విభజనకు ముందు ఒకే ప్రాంతానికి చెందిన స్నేహితులు ఆ తర్వాత ఒకరు భారత సేనలో చేరగా, మరొకరు పాక్ సేనలో చేరుతారు. ఒక సందర్భంలో ఇద్దరూ ఎదురుపడి మేము గొప్ప అంటే, మేము గొప్ప అని వాదించుకుంటారు. ఒక దశలో ఆవేశం పట్టలేక భారతీయ మిత్రుడు పాక్ మిత్రుడిపై కాల్పులు జరిపి చంపేస్తాడు. జాతీయతాభావంతో పాటు దేశాల మధ్య పెరుగుతున్న ద్వేషం ఎంతవరకు మంచిదో ఆలోచించాలి. కాశ్మీర్ వివాదం ఏ దిశగా మనల్ని నడిపిస్తోందో, ఎవరు ఇందులో బాధితులుగా మారుతున్నారో కూడా ఆలోచించాలి.

★

> **ఈ రెండున్నర గంటల సినిమా రాజకీయాల్లోనూ, కాశ్మీర్ పరిస్థితిలోనూ మార్పులు తీసుకురాకపోవచ్చుగానీ, ఒక బయటి వ్యక్తి చూపు, లోపలి వ్యక్తుల చూపులకు ఎంత భిన్నంగా ఉంటుందో అర్థమయ్యేలా చేస్తుంది. మన సైనికులు గాఢ జాతీయతాభావంతో కాశ్మీర్ రక్షణకు పాటుపడుతూ త్యాగాలు చేస్తూ మనకు ప్రశాంత జీవితాన్ని ప్రసాదిస్తున్నారనే మాట ఎంత నిజమో,– కాశ్మీర్ సరిహద్దుల్లో నివసిస్తున్న అమాయక ప్రజలు రెండు సైనిక దళాల మధ్య నలిగిపోతున్నారన్నదీ అంతే నిజం.**

# మనోధైర్యంతో ముందుకురికిన మహిళలు

- టి. వరమ్మ

ఎంతో కాలం నుండి గుండెల్లో అణిగివున్న ఆగ్రహం ఒక్కసారిగా కట్టలుదెంచుకున్న రోజది. అబలలని సమాజం చిన్న చూపు చూసే ఆడవాళ్ళ ముందు తమ దర్పానికి, దౌర్జన్యానికి తిరుగులేదనుకునే శక్తులు తలదించిన సందర్భమది. మహిళలంతా తిరగబడి మద్యం దుకాణాన్ని వూరి నుండి తరిమివేసిన సంచలన సంఘటన అది. "మన మోపాడులో మద్యం దుకాణాన్ని లేపాశాం" అని వందల గొంతులు విన్పించాయి. అది ఎలా సాధ్యమయిందనే లోపే వారి ఆత్మాభిమానం, ఆత్మవిశ్వాసం ఒక్కసారే పెల్లుబికింది. వృత్తిరీత్యా స్వంత వూరికి ఎంతో దూరంగా ఎప్పుడో ఒకసారి చుట్టపు చూపుగా వెళ్ళే నాకు గ్రామ మహిళలు సాధించిన విజయం అద్భుతం అనిపించడంలో ఆశ్చర్యం లేదు.

మోపాడు గ్రామ జనాభా సుమారు 5000 వుంటుంది. వూర్లోకి కొత్తగా దుకాణం రావటం మందుబాబులకు సంతోషం కల్గింది. కానీ అనేక కుటుంబాలకు అది రక్తాన్ని పీల్చి పిప్పి చేసే జలగలాగా మారింది. షాపుకు పశువుల పాకను అద్దెకిచ్చిన యజమాని రు. 400 కూడా అద్దె రాని దానికి రు. 10,000 అద్దె వస్తే జాక్‌పాట్ కొట్టినట్లు అన్పించి వుంటుంది. అప్పటివరకు అలవాటు లేని యువకులు మద్యానికి అలవాటుపడుతుంటే, అప్పటికే అలవాటు వున్న వారు బానిసలవుతున్నారు. రెక్కలు ముక్కలు చేసుకుని, వళ్ళు హూనం జేసుకుని, రాత్రింబవళ్ళు కష్టపడి సంపాదించుకున్న సొమ్ము మద్యం దుకాణానికి పురుషులు ధారపోస్తుంటే మహిళలు నిస్సహాయంగా కుమిలి పోవాల్సి వచ్చింది. తాగి ఎక్కడ పడితే అక్కడ పడిపోతుంటే, అర్థరాత్రి, అపరాత్రికి కూడా ఇంటికి చేరటం లేదు. పైరు పెట్టుబడికి, బిడ్డ చదువుకు, పండుగ సరుకులకు తెచ్చుకున్న డబ్బునూ వదిలిపెట్టటం లేదు. డబ్బుకు డబ్బు పోగా సంసారాలు ఛిద్రం అవుతున్నాయి. పురుషులకు కుటుంబాలవట్ల బాధ్యతారాహిత్యం మరోపక్క ఆరోగ్యం దెబ్బతింటుంది. కుటుంబభారమంతా మహిళలపై పడుతుంది.

విసిగిపోయిన మహిళలు ఎంతకాలం ఓపికపడతారు. వారి ఓపికకు ఒక హద్దు వుంటుంది. సెప్టెంబరు నెలలో షాపు యజమాని భారీగా మద్యాన్ని దుకాణానికి తెస్తున్న వార్త వూరికి చేరింది. అప్పటికే ఒకటిన్నర లక్షల రూపాయల సరుకు షాపులో వుంది. అదనంగా మూడున్నర లక్షల విలువగల మద్యం వస్తున్నదన్న వార్త దావానలంలో వ్యాపించింది. విషయం ఎలా క్షణాలలో మహిళలకు చేరిందో ఆశ్చర్యం. ఇప్పుడు ఎదురుతిరగకపోతే తమ కుటుంబాలకు భవిష్యత్తు లేదనుకున్న మహిళలు ఎదురు తిరిగారు. క్షణాలలో వందల మంది పోగయ్యారు. వారికి ఎవరు వాదనలు చెప్పారో చెప్పలేం. అందరూ నాయకులే. వారికి ఆ ధైర్యసాహసాలు ఎవరిచ్చారో తెలియదు. ఒక మీటింగు వేసుకుని పథకం రూపొందించుకున్న దాఖలాలు లేవు. అంతా ఉప్పెనలాగా ఎగిసిపడింది. నిత్య జీవిత అనుభవమే వారిని ఈ స్థితికి తెచ్చింది.

కసి, ఆగ్రహం, అసంతృప్తి అంతా ఒక్కసారిగా ఉగ్రరూపం దాల్చింది. మద్యం సీసాలు బద్దలయ్యాయి. దుకాణం ధ్వంసం అయింది. మళ్ళీ దుకాణం తెరిచే అవకాశం ఇవ్వకుండా ఫర్నీచర్ ముక్కలయింది. గత రెండు సంవత్సరాల నుండి కరువుతో, పాడి, పంటలు ఎండిపోయిన తమను వెక్కిరిస్తున్న కాలము. వున్నది కూడా వూడ్చి వేసి తమ బతుకును ఎడారి జేస్తున్న మద్యం దుకాణాన్ని ధ్వంసం చేశారు. ప్రజలకవసరమైనప్పుడు స్పందించని పోలీసులు ఈ సందర్భంలో యజమాని సమాచారం ఇవ్వగానే క్షణాల్లో, మహిళా పోలీసులతో చేరుకున్నారు. అదిరించి, బెదిరించి మహిళలను వెనక్కువంపే ప్రయత్నం జేశారు. మహిళాపోలీసులు లాఠీలతో కొడుతుంటే మద్యాన్ని పగులగొట్టేవరకు ఓపిక పట్టి ఆ లాఠీలకు మహిళలే పని చెప్పేపరిస్థితి ఎదురయ్యింది. మహిళా పోలీసులు వారిని నానా దుర్భాషలాడారు. మీకు డ్వాక్రా ఋణాలు, రేషన్ బియ్యం పెన్షన్లు ఇవన్నీ ఎలా వస్తాయి? మద్యం దుకాణాలు వుంటేనే కదా? అనే మహిళా పోలీసుల దుందుడుకు మాటలు వారిని ఇంకా రెచ్చగొట్టాయి. ఆ స్థలయజమాని భయపడి పరుగెత్తి ఎవరింట్లోనో తలదాచుకోవల్సిన పరిస్థితి ఏర్పడింది.

డి.యస్.పి., ఎస్సై, షాపు యాజమాన్యం మహిళందరినీ షాపును వుంచాలని ఒప్పించే ప్రయత్నం జేశారు. కానీ మహిళలందరూ ఒకే గొంతుతో మా ఊరికి దుకాణం వద్దని నినదించారు. ఈ దుకాణం వుంటే "మా మెడల్లో పుస్తెల తాళ్లకు బదులు పసుపుకొమ్ముతాడులుంటున్నాయని" "మానోట్లోకి ముద్ద వెళ్ళడం కరువైందనీ"

**తాగి ఎక్కడ పడితే అక్కడ పడిపోతుంటే, అర్థరాత్రి, అపరాత్రికి కూడా ఇంటికి చేరటం లేదు. పైరు పెట్టుబడికి, బిడ్డ చదువుకు, పండుగ సరుకులకు తెచ్చుకున్న డబ్బునూ వదిలిపెట్టటం లేదు. డబ్బుకు డబ్బు పోగా సంసారాలు ఛిద్రం అవుతున్నాయి. పురుషులకు కుటుంబాలపట్ల బాధ్యతారాహిత్యం మరోపక్క ఆరోగ్యం దెబ్బతింటుంది. కుటుంబభారమంతా మహిళలపై పడుతుంది.**

ఎదిరించారు. మరెన్నో విధాల నచ్చజెప్పే ప్రయత్నం జేసినా మహిళలు రాజీపడలేదు. రేపటికయినా వీరిని ఒప్పించవచ్చు, లేదా వారి వూరి నాయకత్వంతోనైనా ఒప్పించవచ్చు, వారి పురుషులతోనైనా మహిళల మానసికస్థైర్యాన్ని దెబ్బతీసి షాపును నిలబెట్టవచ్చు అనే ఆలోచనలతో అధికారులు రేపు మరలా సమావేశం పెడతామని వెళ్లిపోయారు. కానీ మహిళల ఆత్మస్థైర్యం ఏమాత్రం తగ్గలేదు. మరుసటిరోజు ఆ గ్రామ రామాలయం నుండి మైకులో అధికారులు వచ్చారు, మీరు ఇక్కడకు వచ్చి చెప్పుకోవచ్చని ప్రకటన చేశారు. ఆ క్షణంలో వందలమంది మహిళలు పోగయ్యారు. ఇదే వారి పట్టుదలకు నిదర్శనం. వారు ఆరోజు కూలిపని మానుకుని అక్కడే తిష్టవేశారు. ఎలాగైనా ఈ రోజు షాపును తరిమికొట్టాలి అనే దృఢసంకల్పంతో వుండిపోయారు. మరలా ఆ అధికార్లు ఈ ఒక్కసారీకీ అవకాశమివ్వండి అతను పర్మిషన్ తెచ్చుకున్నారు. వేలంజరగకముందు మీరు కంప్లయింట్ జేయాల్సింది అని బ్రతిమాలాడే పరిస్థితికి వచ్చారు. కానీ వారు తలొగ్గలేదు. అధికారులు ప్రకటన చేయకుండా వెళ్ళటానికి సిద్ధమైతే వారి వాహనాన్ని చుట్టుముట్టి "మీరు షాపు తీసేస్తున్నాము, యిక నడపం" అని ప్రకటించే వరకు ఒక్క అడుగు కూడా కదలనీయం అని అధికార్లను నిలదీశారు. ఇక చేసేదేమీలేక ఆ అధికార్లు ఇక్కడ షాపు నిర్వహించరని చెప్పి వెనుదిరిగారు. మహిళలు విజయోత్సాహంతో ముందుకు కదిలారు. ఈ పని నాలుగేళ్ళ క్రితం చేసుంటే మనకు ఇంత నష్టం జరిగివుండేదికాదని పశ్చాతాపపడ్డారు. ఈ స్ఫూర్తి అన్ని గ్రామాలకు వ్యాపించాలి. ★

# మళ్ళీ వేట ను ప్రారంభించు !

– బిక్కి కృష్ణ

వేట మొదలయ్యిందెక్కడ?
వేల వేల ఏళ్లక్రితం అడవుల్లోనే కదా...
ఆకలి తీర్చుకోవడం కోసమే ఆనాడు
ఆదిమానవులు అడవి జంతువులను వేటాడారు
ఇప్పుడు పట్టణాల్లో మాస్కులు ధరించిన మానవ రూపాల్లో
సంచరిస్తున్న అడవి జంతువులకోసమే వేట ప్రారంభం కావాలి.
ఇప్పుడు ఏ జంతువు ఎవరిలో ఉందని ఎలా గుర్తించగలం?

ఇంటి బోనులో ఉన్న సింహం ఉన్నట్టుండి
ఇల్లాలి లేడిపై అమాంతం లంఘించి గొంతు కొరికేస్తుంది.
రక్తపు మడుగులో విలవిలలాడుతుంటే తృప్తిగా చూస్తూ
అవసరం తీరిన దేహాన్ని గుట్టుగా ఖననం చేస్తుంది.
మరో లేడికూన ఆ మదమృగం ఖాకీ జేబులో నాలుగు కాసులు
వేసి, ఎఫ్ఐఆర్‌లో ఆత్మ హత్యగా పేరును నమోదు చేయిస్తుంది.
మెడపై తాళి యమపాశం పంజా విసురుతుంది.
హఠాత్తుగా ఆఫీసు కుర్చీలో కులికే ఓ పెద్దపులి కన్ను
తనముందు తిరుగాడే ఓ కన్నె కుందేలుపై పడుతుంది.
ఓ సెలవు దినాన అర్జెంటుగా ఆఫీసుకు రమ్మని కబురంపి
పైళ్లు తిరగేస్తూ వేళ్ళ గోళ్లను కుందేలు దేహంపై
జెర్రుల్లా పాకించి కుందేలు ప్రాధేయపడినా వినకుండా
తలుపులు మూసి చెవుల పిల్లిని చెరుస్తుంది.

రక్షణ కల్పించమని రక్షకభట నిలయానికి
ఓ అమాయక గొర్రెపిల్ల వెళితే
తోడేలు రూపంలో ఉన్న ఓ వింతమృగం
గుట్టుచప్పుడు కాకుండా నేరస్తుల గదిలోనే
గొర్రెపిల్ల గొంతు కొరికేస్తుంది.

శాసన సభల్లో ఎలుగుబంట్లు
శమంతక మణిలాంటి సెల్ ఫోన్లలో నీలి చిత్రాలు వీక్షిస్తాయి.
పాఠశాలల్లో గోవులరూపాల్లో ఉన్న గురువులు ఆంబోతులై
లేలేత లేగదూడలపై విరుచుకు పడతాయి.
గుంటనక్కలు రాజ్యమేలుతున్న కలికాలంలో
ఢిల్లీలోనేకాదు పల్లెల్లోనూ పట్టణాల్లోనూ మెట్రోనగరాల్లోనూ
మనుషుల రూపాల్లో ఉన్న మృగాలు
మహిళలపై దాడులు చేస్తున్నాయి.

నిర్భయ చట్టాలకు మగమృగాలు భయపడి ఉంటే
ఫాంహౌస్‌లలో పట్టపగలే రేప్‌లు జరిగి ఉండేవా?
చావలేని చట్టాలతో మదమెక్కిన మగమృగాలను
బంధించాలనుకుంటే ఈ దేశంలో ఉన్న జైళ్ళబోనులు చాలవు
కళ్లకు గంతలు కట్టుకున్న న్యాయదేవత
ఈ దేశపు ఆడాళ్లకు ఎన్నటికీ న్యాయం చేయదు.
రక్తపు మరకలు మృగాళ్ళ గోళ్ళ ముద్రలు
కోర్టుల్లో ః వక్ష్యాలుగా నిలబడవు.

మరి మృగాలనుండి ఆడాళ్ళు తప్పించుకునే మార్గమే లేదా?
గాయపడ్డాక ఎంత ఏడ్చినా ప్రయోజనం లేదు.
వేటమొదలయింది నీతోనేనని తెలుసుకో చెల్లీ!
ఆనాడు మగాళ్లతో పాటు మృగాలను వేటాడిన నీవు
నీ ఆత్మ రక్షణకై మళ్ళీ విల్లంబులందుకో
ఇంటా బయటా నీపై దాడి చేసే మగమృగాలపై విల్లు సంధించు
తిరిగి వేటను ప్రారంభించు !



# బాలల సంక్షేమం - రక్షణ కొరకు నేడున్న చట్టాల అమలు

- డి. రమాదేవి

*భారతదేశంలో ఉన్న మానవ వనరుల కారణంగా ప్రపంచంలో అభివృద్ధిని వేగంగా అందుకోగలుగుతుందని అగ్రనేతలు నమ్మబలుకుతున్నారు. ఎప్పుడు అది? పిల్లల అభివృద్ధికి అవసరమైన అన్ని చర్యలూ తీసుకోగలిగే సమాజం అయినపుడే.*

కానీ నేటి స్థితి ఏమిటి? పిల్లలు తమకు ఉండాల్సిన సదుపాయాలను కాని హక్కులను గానీ ప్రశ్నించలేరు. కడపలో కృపాకర్ కుటుంబం, హైదరాబాద్‌లో గురు ప్రసాద్ బిడ్డల దుర్మార్గమైన హత్యలు పిల్లలు, పెద్దలు కుటుంబ సభ్యుల ద్వేషం కారణంగా జరగటం చూస్తాం.

పిల్లలపై సాగుతున్న హింసాకాండలో 92% కుటుంబ సభ్యులు, స్నేహితులు, బంధువులు పాత్రధారులుగా ఉంటున్నారు. వేధింపులకు గురవుతున్న పిల్లల్లో 53% బాలురు ఉండటం ఆశ్చర్య కల్గిస్తుంది. ఆడపిల్లల మీద జరిగిన అత్యాచారాలు వెలుగులోకి వచ్చినా మగ పిల్లల మీద జరుగుతున్న లైంగిక దాడులు, వేధింపులు ఇంకా పెద్దగా వెలుగు చూడటంలేదు. సభ్య సమాజం సిగ్గు పడే రీతిలో పిల్లలు అడుక్కోవటం, అనాధలుగా జీవించాల్సి రావటం, బాల కార్మికులుగా చాకిరీ చేయటం, విద్యకు నోచుకోకపోవటం, పౌష్టికాహారం లేక అనేక జబ్బులకు గురి కావటం, చనిపోవటం వంటి అనేక రూపాలు రోజూ చూస్తున్నాం. ఒకవైపు సంపద పెరుగుతుంటే మరోవైపు బాలల జీవితమే ప్రశ్నార్థకమవుతుంది. ప్రపంచంలో బడికి వెళ్ళలేని పిల్లల్లో 3వ వంతు మంది భారతదేశంలో ఉన్నారు. సగంమంది పిల్లలు చదువులకు నోచుకోవడం లేదు. బాల కార్మికుల సంఖ్య సుమారుగా 3 కోట్లుగా చెప్పబడ్తున్నారు. కాని 10 కోట్ల మంది బడికి వెళ్ళలేని వారు బాల కార్మికులుగా జీవిస్తున్నారని ప్రముఖ పిల్లల హక్కుల ఉద్యమకారులు శాంతాసిన్హా అభిప్రాయం.

పిల్లల దుస్థితిని, పెరుగుతున్న అకృత్యాలతో పిల్లల హక్కులకు సంబంధించి కార్యాచరణ ప్రారంభమైంది. 1992లో ఐక్య రాజ్య సమితి బాలల హక్కులను సభ్య దేశాలు రక్షించేందుకు అవసరమైన చట్టాలు చేయాలని తీర్మానించింది.

ఆమేరకు 2005లో బాలల హక్కుల పరిరక్షణ చట్టం, 2009లో విద్యా హక్కు చట్టం, 2012లో లైంగిక వేధింపుల నుండిరక్షణ కల్పించే చట్టాలను పార్లమెంటు చేసింది. 2007లో బాలల హక్కుల రక్షణ కొరకు జాతీయ కమీషన్ ఏర్పడింది. ఆయా రాష్ట్రాలలోకూడా కమీషన్లు ఏర్పాటు చేయాలని అన్ని జిల్లాల్లో పిల్లల సంక్షేమ కమిటీలు వేయాలని చట్టం చేయబడింది.

**2005లో చేయబడిన సిపిసిఆర్‌లో పిల్లల హక్కులను గుర్తించి వాటిని కాపాడటం ప్రధాన లక్ష్యం.**

ప్రతి బిడ్డకూ చదివే హక్కు ఆరోగ్య హక్కు, పౌష్టికాహారం పొందే హక్కు నివాసం, వివక్షతలేకుండా ఉండటం తదితర సదుపాయాలు ఉండాలని గుర్తించారు. చట్టాలు చెయ్యడంలో, అమలులో పిల్లల హక్కులకు భంగం లేకుండా ప్రభుత్వాలు జాగ్రత్తలు తీసుకోవాలి. మత హింస, ఉగ్రవాదుల దాడులు, ప్రకృతి వైపరీత్యాలు, పునరావాసము, కుటుంబ హింస, అక్రమరవాణా, వ్యభిచారం, పోర్నోగ్రఫి (అసభ్య చిత్రీకరణ), హెచ్.ఐ.వి. తదితర అన్ని అంశాలలో పిల్లలకు అవసరమైన అన్ని చర్యలు చేపట్టాలి.

ఫోక్సో (POCSO) లైంగిక వేధింపుల రక్షణ చట్టం 2012 నవంబరు నుండి అమలులోకి వచ్చింది. మొత్తం 44 సెక్షన్లు ఈ చట్టం ద్వారా వివిధ రూపాలలో జరుగుతున్న లైంగిక నేరాలను గుర్తించి వాటికి కఠిన శిక్షలు విధించాలని పేర్కొంది. అంతేకాక ఈనేరాలను నమోదు చేయడంలో, గుర్తించడంలో పోలీస్, న్యాయ వ్యవస్థ పిల్లలతో స్నేహ పూర్వకంగా (సరియైన వాతావరణం) మెలిగే విధంగా కూడా నిబంధనలు రూపొందించారు. భారతనేర శిక్షా స్మృతి(ఐపిసి) మేరకు కొన్ని నేరాలను నిర్వచించడం, నేర పరిధిలోకి రాకపోవడంలాంటి లోపాలు ఫోక్సో చట్టంలో తొలగించబడ్డాయి.

సెక్షన్ 375ఐపిసి అత్యాచారం గురించి నిర్వచించింది. కాని ఈ సెక్షన్ క్రింద బాలుర మీద జరుగుతున్న లైంగిక అత్యాచారాలు రావు. అదేవిధంగా అంగ ప్రవేశం కాకుండా ఇతర విధాలుగా జరుగుతున్న అత్యాచారాలు కూడా రావు. అందువలన అసహజలైంగిక ప్రవృత్తులు, మర్మావయవాలను లైంగిక దృష్టితో తాకడం, సంజ్ఞలు, మాటలు వంటి అనేక చర్యలు అభం శుభం తెలియని బిడ్డల జీవితంలో కల్లోలం సృష్టిస్తున్నాయి. పసి వయస్సులోనే మానసిక సమస్యలకు గురువుతున్నారు. బాల్యంలో ఎదుర్కొన్న అనుభవాలు జీవితాంతం వెంటాడటం, కుటుంబాలలో సమస్యలు రావడం, పర్వర్టెడ్ వ్యక్తులుగా రూపొందటం జరుగుతుంది.

అదేవిధంగా తమ సంరక్షణలోఉన్న వారి మీద కూడా లైంగిక వేధింపులు సాగడం వెలుగులోకి వస్తున్నాయి. జంగారెడ్డి గూడెం, శ్రీకాకుళం హాస్టల్‌లోఉన్న అమ్మాయిల మీద అత్యాచారాలు వెలుగులోకి వచ్చాయి. అనాధాశ్రమాలలో సంరక్షకులు పిల్లల మీద అత్యాచారాలు జరిపిన ఉదంతాలు బయటకు వచ్చాయి. అందువలనే ఫోక్సో చట్టంలో పోలీసులు, జైళ్ళ నిర్వాహకులు, హాస్టల్స్ నిర్వహకులు సైనికులు తదితరులు తమ అధికారం ద్వారా పిల్లలపై సాగించే నేరాలను అధిక తీవ్రత కల్గినవిగా గుర్తించి మరణశిక్ష, జీవితఖైదు వంటి శిక్షలను విధించే అవకాశాన్ని పొందుపర్చారు.

**ఎఫ్ఐఆర్ నమోదు సమయంలో, విచారణ సందర్భంలోనూ న్యాయ ప్రక్రియలోనూ పిల్లలను స్నేహ పూర్వకమైన, ఏ రకమైన భయాందోళనలకు గురికాని వాతావరణం కల్పించాలని ప్రత్యేకంగా పొందుపర్చారు. అవసరమైతే పిల్లల ఇంటికి వెళ్ళి నేర విచారణ చేయాల్సి ఉంటుంది. కోర్టులోసాక్ష్యం చెప్పే సమయంలో కూడా నిందితుడు ఎదురుగా ఉండ కూడదు. క్రాస్ పరీక్ష పేరిట పిల్లలకు ఇబ్బంది కల్పించకూడదు. సహాయకులను అనుమతించాల్సి ఉంటుంది. వికలాంగులకు మరింత ప్రత్యేక సదుపాయాలను కల్పించాలి.**

ఫోర్నోగ్రఫికి సంబంధించి కూడా విస్తృత అంశాలను పొందుపర్చారు. అసభ్య చిత్రాలు చూపించటం, లైంగిక నేరాలకు సంబంధించిన ప్రకటనలు, సినిమాలు వగైరాలలోనటింపచేయడం, అలాంటి వాటిని నిల్వ చేయటం, అలాంటి చిత్రాలను ప్రచారం చేయటం తదితర అంశాలు చట్టం పరిధిలోకి తీసుకురాబడ్డాయి. పిల్లలపై అసహజ లైంగిక ప్రవృత్తికి కారణమయ్యే ఏ పని అయినా ఈ చట్టం క్రింద చర్య తీసుకునే విధంగా రూపొందించబడింది.

**ప్రతి బిడ్డకూ చదివే హక్కు, ఆరోగ్య హక్కు, పౌష్టికాహారం పొందే హక్కు, నివాసం, వివక్షతలేకుండా ఉండటం తదితర సదుపాయాలు ఉండాలని గుర్తించారు. చట్టాలు చెయ్యడంలో, అమలులో పిల్లల హక్కులకు భంగం లేకుండా ప్రభుత్వాలు జాగ్రత్తలు తీసుకోవాలి. మత హింస, ఉగ్రవాదుల దాడులు, ప్రకృతి వైపరీత్యాలు, పునరావాసము, కుటుంబ హింస, అక్రమరవాణా, వ్యభిచారం, ఫోర్నోగ్రఫి(అసభ్య చిత్రీకరణ), హెచ్.ఐ.వి. తదితర అన్ని అంశాలలో పిల్లలకు అవసరమైన అన్ని చర్యలు చేపట్టాలి.**

బాధిత బిడ్డలకు నష్ట పరిహారాన్ని ప్రభుత్వాలు అందించటమేగాక నేరస్తుల నుండి కూడా జరిమానాలు విధించి బాధితులకు జమ చేయాలి. బాధిత బిడ్డలకు అవసరమైనప్పుడు రక్షణ ఏర్పాటు చేయాలి.

విద్యా హక్కు చట్టం కూడా బాలల హక్కుల పరిరక్షణలో భాగంగా చేయబడింది. నిర్బంధ ప్రాథమిక విద్య ఇంకా అమలు కాని హక్కుగానే ఉంది. నేటికి అక్షరాస్యత 67% ఉండటం అంటే 33%మంది చదువుకు దూరంగా ఉన్నారనే. దళిత, గిరిజన ఆడపిల్లలు 50,40% మంది మాత్రమే చదువుకోగల్గుతున్నారు. ప్రైవేటు పాఠశాలల్లో 25% సీట్లు పేద పిల్లలకు కేటాయించడం ఎక్కడా అమలు జరగటంలేదు. ఆడపిల్లలు చిన్న పిల్లల్ని చూసుకోవడం, ఇంటిపని, పాఠశాలల్లో మరుగు సదుపాయం లేకపోవడం వగైరా కారణాలతో పెద్ద ఎత్తున బడిమానివేయడం గమనించవచ్చు.

2009-10 లెక్కల ప్రకారం పేదరికం గణనీయంగా పెరిగినట్లు లెక్కలు తెలియచేస్తున్నాయి. వివిధ స్వచ్ఛంద సంస్థల సర్వేలలో పేదరికం కారణంగా పిల్లలు చదువుమానటమేకాక పోషకాహారం పొందలేకపోవటం, రక్త హీనత, జబ్బులకు గురికావడం పెరుగుతూ ఉంది. పోషకాహారం కోసం నడపబడ్తున్న ఐసిడిఎస్‌ని అనేక రూపాలలో బలహీన పర్చుతున్నారు. స్కూల్ పిల్లలకందిస్తున్న మధ్యాహ్న భోజనం నాసిరకంగా నడుస్తుంది. అవసరమైన ఆహారాన్నిచ్చే విధంగా కేటాయింపులు లేకపోవడం, గుడ్డు ధరను పరిశీలిస్తే మనకు సులభంగా అర్ధమవుతుంది.

పిల్లల హక్కులను విస్తృతంగా ప్రచారం చేయాలని, వారిపై సాగే రకరకాల వేధింపుల నుండి రక్షణ ఉండాలని, మానసికంగా, శారీరకంగా ఆరోగ్యంగా ఎదిగేందుకు అవసరమైన అన్ని చర్యలు కల్పించబడాలని చట్టాలు చేయబడ్డాయి. ఈ చట్టాల అమలు కోసం కృషి చేయడం, ప్రభుత్వాల మీద ఒత్తిడి చేయటం నేటి అవసరం. అభివృద్ధి మంత్రం జపిస్తున్న పాలకులు పిల్లల భవిష్యత్తే దేశ భవిష్యత్, దేశ అభివృద్ధి అన్న అంశాన్ని తెలివిగా పక్కకు నెడ్తున్నారు.

★

# పిల్లలు

పిల్లలకు నీళ్ళంటే సరదా. ప్రవహించే నీళ్లన్నా, ఆటలాడు కొందుకు వీలిచ్చే నీళ్ళన్నా మరీ సరదా.

పెళ్లిళ్లు, పేరంటములు, ఉత్సవాలు, ఊరేగింపులు, విందులు, వినోదాలు, తీర్థాలు, రథయాత్రలు అంటే పిల్లలకు ఆనందం. ఆ వేడుకలన్నీ చూసి సంబరపడతారు. సంబరాలయిపోగానే బిక్కమొహం వేస్తారు. కళ్ళ నీళ్ళు పెట్టుకుంటారు. పువ్వులు పిల్లలకు ఎంత ఆనందమిస్తాయనీ! పదిమంది ఎదుట, కొమ్మలు వొంచి, రెమ్మలు పట్టుకొని ఆకుల సందుల్లో వెతికి వెతికి పూసిన పూలను ఏరుకుంటూ ఉంటే, పిల్లలకు అదేదో వింతగా, గొప్పగా విజయం సాధించినట్లుగా



అనిపిస్తుంది. ఒక రంగు తరువాత యింకొకటిగా, రంగురంగుల పూలను రకరకాల దండలుగా గుచ్చుతూఉంటే, వాళ్ళకెంతో ఆహ్లాదంగా వుంటుంది!

చితుకులు పోగుచేసి చలి మంటలు వేసుకుని చుట్టూ కూచుని చలి కాగడం అరచేతుల్ని చాపి, బుగ్గలు వొత్తుకోవడం పిల్లలకాహ్లాదం. భోగి మంటలు సరే సరి..



గురజాడ అప్పారావు

దిబ్బు దిబ్బు దీపావళి దబ్బు దబ్బున రావాలి.

మా చిన్ననాడు మాంచస్టరు బట్టకుండే రెయిలు, స్టీమరు బొమ్మలు చూడడం అదొక సరదా. అనుకరణ పిల్లలకు ఎక్కువ.

పిల్లలు కనిపించకపోయేసరికి తల్లిదండ్రులు కంగారు పడతారు. దిగులుపడతారు. భయపడతారు. అటు యిటు పరుగులు పెడతారు. తీరా కనిపించేసరికి పిల్లల మీద మండిపడతారు.

పరాయి యింటికి వెళ్ళినపుడు పిల్లలకు అంత కొత్త కొత్త చోట మసలడం ఎబ్బెట్టుగా ఉంటుంది. ఎప్పుడు యింటికి వెళ్లిపోదామా అని ఎప్పుడూ యింటి మీదనే ధ్యానం. లేనివాళ్ళ పిల్లలకు పాపం అన్నీ యిబ్బందులే. జీవితంలో వున్న వ్యత్యాసాలను



అసమానతలను చూసి పిల్లలు యేమని తలపోస్తారో కదా! పిల్లలకు యిందువల్ల చెప్పలేనంత మనస్తాపం. దు:ఖం కలుగుతుంది కదూ! తోటి పిల్లలకు వలె తామూ ఉన్నత స్థితి పొందేవరకూ, పిల్లల మన:క్లేశం పోదు కాబోలు!

తల్లిదండ్రుల పలుకుబడిని, అధికారాన్ని, ఆశ్చర్యాన్ని చూసి, గారాబంగా పెరిగే పిల్లలు తమకు సంపదకలదనే భావం కలగగానే, తమ డాబు దర్పాలను యితర పిల్లల చెంత చూపిస్తారు. అధికారాన్ని చెలాయిస్తారు. ఇలాగే వాళ్ళని పెరగనిస్తే, తాము పిల్లలు కనక గొప్ప ఇంటి బిడ్డలు కనక తాము ఏం చేసినా చెల్లుతుందనుకుంటారు. పెద్దల పట్ల సైతం దురుసుగా ప్రవర్తిస్తారు. చివరకు చెడి పూరుకుంటారు.

"అలా ఉన్నాడు కానీ, అబ్బో! మా వాడిది మహా తెలివైన బుర్ర! మీరుచెబితే నమ్మరు కానీ..." నమ్మడం మాటకేం కాని, అలా అని మీ పిల్లల్ని చెడగొట్టకండి!

చిన్నప్పటి నుంచి నాకు కొత్తది యేది కనిపించినా, దాని తత్వము తెలుసుకోవాలని ఆసక్తిగా వుండేది. వింతలు నాకు యిట్టే పొడకట్టేవి.

చిన్నతనంలో బొమ్మలాట నేర్చి వుండుటచేత లోకమనే రంగంలో చిత్రకోటి రీతులను ఆటాడే మనుష్యులనే పాత్రముల సొగసునే కనిపెట్టడము నాకు అలవాటైనది. సొగసులేని మనిషే వుండదు.

**(బాల్యంలో ఆయన అనుభవాలను గురించి గురజాడ అభిప్రాయాలు 'గురజాడ సాహిత్య సర్వస్వం' పుస్తకం నుండి...)**

**నవంబరు 30 గురజాడ వర్థంతి సందర్భంగా...**

★

కథ

# మార్పు

- జాజుల గౌరి

ఉదయం ఆరుగంటలకి సుప్రభాతం రేడియోలో మొదలవ్వకముందే ఈ ఇంట్లో మొదలైంది.

"సుధా లేచి అరగంటైంది. నా మొఖాన ఇన్ని కాఫీనీళ్ళు తగలేస్తావా"

"బాబు పాలు తీసుకురావటానికి వెళ్లాడు. వాడు రాగానే పెట్టిస్తానండి"

"ఏం మన పాలవాడు ఇవ్వాల రాలేదా?"

"ఇంకా రాలేదండి"

"ఎందుకొస్తాడు?వాడెలా పాలుపోసినా టంచనుగా వాడన్న డేటుకి డబ్బులిచ్చి తగలడ్తావుగా వాడికి బాగా అలుసైంది"

"అది నా తప్పే అంటారా?"

"తప్పు కాకపోతే మరేంటి? వాడు కాకపోతే వాడి బాబు పోస్తాడు. వాడ్ని మార్చేయ్"

"ఆ, ఇలాగే అంటూ ఇప్పటికి ముగ్గుర్ని మార్చారు. ఇతన్ని మార్చితే మనకు పాలెవ్వరూ పొయ్యరు"

"ఎవ్వరు పొయ్యకుంటే నా తాతపోస్తాడు. వెధవగోల ఇన్ని కాఫీనీళ్ళు నా మొఖాన తగలెట్టమంటే ఇన్ని మాటలు"

"ఏమిటండి మీరడిగినదానికి సమాధానం చెప్పానే గానీ ఇప్పుడు నేనేం ఎక్కువ మాట్లాడానని"?

"వాడొచ్చినట్లున్నాడు గానీ ఈ వెధవ గోల ఆపి కాసిన్ని వేన్నీళు నా మొఖాన పొయ్యి" అరిచాడు.

పక్క రూంలో కూర్చొని చదువుకుంటున్న అర్చనకి తల్లిదండ్రుల సంభాషణ స్పష్టంగా విన్పిస్తోంది.

ఇది రోజూ వినబడే సంభాషణే.

ఒకనాడు కాఫీ దగ్గరైతే మరోనాడు దువ్వెన దగ్గర, ఆ మర్నాడు టిఫిను దగ్గర. ఏదో ఒక వంకతో తల్లిని తండ్రి సతాయించటం గమనిస్తూనే ఉంది.

పొద్దు పొడవకముందే లేచి కాలంతోపాటు పరుగెడ్తూ టిఫిన్లు, భోజనాలు సిద్ధం చేసి ఇంట్లో పనంతా చూసుకుంటూ మధ్య మధ్యలో తండ్రి చేసే హడావిడికి నానా హైరానాపడి అన్నీ సర్ది, అతడ్ని ఆఫీసుకీ, తనని తమ్ముడ్ని కాలేజీలకు బయల్దేరదీసి, తాను రెడీ అయి టైం ఉంటే యింత తిని లేకుంటే ఒక కప్పు కాఫీనీళ్ళతో సర్దుకుని ఆఫీసుకు పరుగెత్తే అమ్మను చూస్తే అర్చనకి కష్టంగా ఉండేది.

వీలున్నప్పుడల్లా తల్లికి పనుల్లో సహాయపడబోతే

"నీ కెందుకు నాన్నా, నే చేస్తాగా, వెళ్ళి చదువుకోరా" అనేది.

"ప్లీజ్ అమ్మా, నన్ను కూడా పనులు నేర్చుకోనివ్వు. ఇంకా నేనేం చిన్నపిల్లనా. ఇప్పట్నించి నేర్చుకోకుంటే నేనెలా పన్లు చేస్తానమ్మా" అంటూ తల్లిదగ్గర కావాలనే గారాలు పోయేది.

అది చూసి కూతురి తలమీద చెయ్యేసి "ఇప్పుడే ఎందుకురా నాన్నా నీకీ కష్టం వెళ్లరా" అని సుధ అంటే

"నేను వెళ్లనురా నాన్న నాకేం కష్టం లేదు" అని తల్లిని అనుకరిస్తూ ఆమె చేతిలోని చేటను తీసుకుని బియ్యం చెరిగితే చెరగటం సరిగా రాక బియ్యం కింద పడేవి.

"చెప్పానా, నీకు చేతకాదని చెప్తే వినవు కదా" అంటూ సుధ కిందపడ్డ బియ్యం ఎత్తబోతే

"అమ్మా, వొద్దమ్మా, నేను చేసిన తప్పును నన్నే సరిదిద్దుకోనీ" అంటూ కిందపడిన బియ్యాన్ని, చేటలోకి ఎత్తి మళ్ళీ చెరిగేది.

"మొండిదానివి కదా" అంటూ తల్లి ఉడుక్కోవటం చూసి అర్చన మరింత శ్రద్ధగా పని చేసేది.

ఓ రోజు సాయంకాలం సుధ ఆఫీసునుంచి రావటం లేటయింది. కాలుకాలిన పిల్లిలా...లోపలికీ బయటికీ పచార్లు చేస్తూ మాటిమాటికి వాచీకేసి చూస్తున్నాడు రాజారావు.

అర్చన, శేఖర్‌లు తండ్రిని గమనిస్తున్నారు.

రాజారావు అటూ ఇటూ పచార్లు చేస్తూనే " అర్చనా మంచినీళ్లు పట్రా" అన్నాడు గట్టిగా.

"ఆ వస్తున్నా డాడీ" అంటూ గబగబా గ్లాసులో నీళ్లు తీసుకెళ్లి ఇచ్చింది. వాటిని గటగటా తాగేసి గ్లాసిస్తూ "మీ అమ్మ యివాల ఎక్కడికైనా వెళ్తానందా ?" అన్నాడు.

లేదు అన్నట్టుగా తల అడ్డంగా ఊపిందేకానీ నోరుపెగల్లే.

"మరెందుకు ఆలస్యం. పోనీ ఆలస్యంగా వస్తానందా"? అన్నాడు.

**"అసలు నేనేం తప్పు చేశానని మీరలా మాట్లాడుతున్నారు. నేను కూడా ఉద్యోగం చేసి నాలుగురాళ్ళు సంపాయిస్తే మనం మరింత బాగుంటామనేగా నా తాపత్రయం. అయినా మీరు ఇంట్లోకని, పిల్లల చదువులకని బయట అప్పులు చేస్తుంటే చూడలేక ఉద్యోగానికి వెళ్ళాను. అది ఈనాడు మరింత అక్కరకొచ్చింది. అది గుర్తించారా"? అంది ఆవేశంగా.**

"అలా ఏం అనలేదు డాడీ"అంది మెల్లిగా.

"మరి తొందరగా ఇంటికి తగలడోచ్చుగా" అన్నాడు అసహనంగా.

"పోనీ మీరెల్లి అమ్మను తీసుకురండి డాడీ" అంది.

"ఆ నేనటు వెళ్తాను అది ఇటు వస్తుంది" అన్నాడు వెటకారంగా

"అలాగైతే అమ్మ వొస్తూ ఉండొచ్చుగా డాడీ" అంటే

"ఆ, వొస్తుంది. ఎప్పుడు? తెల్లారి కోడి కూసే టైంలోనా, ఫో లోపలికి వెళ్ళి తగలడు" కసిరాడు కూతుర్ని.

తండ్రి మాటలకి చిన్నబుచ్చుకుని తన రూంలోకి వెళ్ళి పుస్తకాల్లో తల దూర్చింది అర్చన.

చూపు అక్షరాల వెంట పరుగెడ్తున్నా మనస్సు మాత్రం తల్లి గూర్చి ఆలోచిస్తోంది అమ్మ ఇంకా ఎందుకు రాలేదని.

బస్సుస్టాండుకు వెళ్ళి తల్లి కోసం ఎదురు చూడాలనుకుంది కానీ అలా చేస్తే తండ్రి కోప్పడ్తాడు. "ఇలా అటూ ఇటూ తిరిగేకన్నా వెళ్ళి అమ్మను తీసుకురావొచ్చుగా" అని అన్నతో అంటూ చేతివ్రేళ్ళని విరుచుకోసాగింది.

శేఖర్ నుండి ఎలాంటి సమాధానం లేదు కానీ తండ్రినే నఖశిఖపర్యంతం పరీక్షిస్తున్నాడు.

రాత్రి ఎనిమిది గంటలప్పుడు సుధ ఆఫీసునుంచి పరుగు పరుగున ఇంటికి వచ్చింది. తల్లిని చూస్తుండగానే అర్చన ఆమెకు ఎదురెళ్లి చేతిలోని బ్యాగందుకొని గ్లాసుతో మంచినీళ్ళిస్తూ తల్లి మొఖంలోకి చూసింది. ఆమె బాగా అలసిపోయినట్లుగా మొఖం వాడిపోయింది.

రాజారావు భార్యని క్రిందికి మీదికి పరీక్షిస్తూ చూస్తున్నాడు.

అర్చన శేఖర్లు తల్లిదండ్రులని గమనిస్తున్నారు.

కానీ సుధ అది గమనించకుండా బాత్రూంలోకి వెళ్ళబోతుంటే

''ఏం మేడంగారూ, ఇవ్వాళ ఇంత తొందరగా దయచేశారేమిటి? ఇల్లు అంత తొందరగా గుర్తొచ్చిందా"? అన్నాడు రాజారావు వెటకారంగా.

సుధ భర్త మాటల్లోని మార్పుని పసిగట్టినా "ఏం లేదండి, ఆఫీసులో వర్కు చాలా పెండింగులో ఉండిపోయింది. అదంతా క్లియర్ చేసి వెళ్ళమన్నారు. అందుకే ఆలస్యం అయింది" అంది.

"అంతేనా, లేక ఇంకా ఏ రాచకార్యాలైనా వెలగబెట్టొచ్చావా"? అంటూ రాచకార్యాలు అనే మాటను వత్తిపలికాడు.

"అదేంటండి అలా మాట్లాడుతున్నారు"? అని సుధ అనేంతలో

"నువ్వొక్కర్తివేనా, లేక యింకా ఎవరైనా ఉన్నారా"? అన్నాడు అనుమానంగా,

"నేను ఒకర్తినే ఎలా ఉంటానండి, మా స్టాఫ్ మొత్తం ఉన్నాం" సుధ సమాధానం.

"అయితే మాత్రం ఇంటికి తొందరగా రావాలన్న స్పృహలేదూ? చెప్తావే నువ్వు ఎన్ని కబుర్లయినా చెప్తావు. ఆడది ఈ అడ్డమైన తిరుగుళ్ళన్ని తిరుగుతుందనే నేను ఆనాడు నిన్ను ఉద్యోగం చెయ్యక్కర్లేదన్నా, కానీ నా మాటను లెక్క చెయ్యకుండా ఈ ఉద్యోగానికి అప్లయి చేశావు" అంటూ ఆవేశపడిపోతుంటే

"అసలు నేనేం తప్పు చేశానని మీరలా మాట్లాడుతున్నారు. నేను కూడా ఉద్యోగం చేసి నాలుగురాళ్ళు సంపాయిస్తే మనం మరింత బాగుంటామనేగా నా తాపత్రయం. అయినా మీరు ఇంట్లోకని, పిల్లల చదువులకని బయట అప్పులు చేస్తుంటే చూడలేక ఉద్యోగానికి వెళ్ళాను. అది ఈనాడు మరింత అక్కరకొచ్చింది. అది గుర్తించారా"? అంది ఆవేశంగా.

"నాకు చెప్పేటంతటి దానివయ్యావన్నమాట. ఆడది నాలుగురాళ్ళు సంపాయిస్తే ఇలా పొగరెక్కి మాట్లాడుతుందని నాకు తెలుసే. అయినా నిన్నని ఏం లాభం? ఆనాడే ఇంట్లో ఉంచక ఉద్యోగం చెయ్యమన్నానే అదే అదే నా తప్పు" అన్నాడు. నిష్ఠూరంగా.

''అసలు ఏమిటండి మీ ఉద్దేశం? ఇప్పటివరకు ఆఫీసువర్కుచేసి ఓ రెండు గంటలు ఆలస్యంగా ఇంటికి వస్తే ఇంత రాద్ధాంతం చెయ్యాలా" అని సుధ అంటుండగానే

"ఇంటికి ఆలస్యంగా రావటమే నువ్వు చేసిన పెద్ద తప్పు, యింకా మాట్లాడుతున్నావా? దరిద్రపు మొఖమా ఫో పోయి వంటచేసి తగలడు" అని రుసరుసలాడుతూ బయటకెళ్ళాడు.

ఆ మాటలతో సుధ మ్రాన్పడిపోయి అవమానంగా ఫీలై గబగబా లోపలికి వెళ్ళింది.

తల్లిదండ్రుల ఘర్షణ చూసిన శేఖర్, అర్చనలు ఎవరి ఆలోచనల్లో వారున్నారు. ఏనాడైనా ఒక గంట తండ్రి ఇంటికి రావటం ఆలస్యం అయితే తల్లి పడే ఆత్రుత గుర్తొచ్చింది అర్చనకి.

ఒకనాడు సాయంకాలం తొందరగా వస్తానని చెప్పివెళ్ళిన మనిషి మర్నాటి వరకు రాకపోతే, మాకు అన్నం పెట్టి నిద్రపుచ్చి తాను మాత్రం పస్తులుండి గుమ్మం దగ్గరే నాన్న గురించి ఎదురుచూస్తూ నిల్చుంది. రాత్రి పన్నెండు గంటలైనా అతను రాకపోయేసరికి తలుపేసి వచ్చి తనను లేపింది "అమ్మలూ, అమ్మలూ" అంటూ, నిద్రమత్తులో జోగుతూ "ఏంటమ్మా ఇంత రాత్రి లేపుతున్నా"వంటే

"మీ డాడీ యింకా ఇంటికి రాలేదమ్మా, దార్లో ఏం జరిగిందో ఏమో" అంటూ ఆందోళన చెందింది.

"అబ్బా వస్తాడులే అమ్మా, ఏదైనా అర్జంటు పని ఉండిపోయి ఉంటాడు. రేప్పొద్దున్న వస్తాడులేమ్మా" అని ముసుగుతన్నేసింది తను.

"సరేలే నువ్వు పడుకో, నాకు అక్కడ నిద్రపట్టట్లేదు నేనిక్కడే కూర్చుంటా"అని ఎదురుగదిలో కూర్చుని ఆ రాత్రి డాడీ కోసం ఎదురుచూసింది.

మర్నాటి ఉదయం బయట నుంచి తలుపు తట్టిన చప్పుడైతే మెలకువవొచ్చి చూసేసరికి అమ్మ కుర్చీలో అలాగే కూర్చుని నిద్రలోకి జారుకుంది.

మంచపైనున్న బ్లాంకెట్ అమ్మపై కప్పి గబగబా వెళ్ళి తలుపుతీస్తే ఎదురుగా డాడీ, అతని ఫ్రెండు శ్రీనివాస్ అంకుల్.

డాడీ దగ్గర నుంచి మందు వాసన గుప్పుమంటోంది. తూలుతున్నాడు. శ్రీనివాస్ అంకుల్ డాడీని గుమ్మంలో వదిలి స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు. డాడీ ఇంట్లోకి రాకుండా గుమ్మంలోనే నిల్చొని "అర్చనా, మా అమ్మేది నువ్వొచ్చి తలుపు తీశావ్, నేను ఇంటికి రాలేదని తెల్సి కూడా అది హాయిగా నిద్రపోతోందా?" డాడీ నోట్లోనుంచి మాటలు ముద్దముద్దగా వొస్తున్నాయి.

అప్పటికీ అమ్మ కనపడకపోయేసరికి "సుధా, ఒసేయ్ సుధా ఎక్కడ చచ్చావే, అందరికీ తెల్లారినా నీకింకా తెల్లారినట్టు లేదు" దాదాపు అరిచేశాడు.

ఆ చప్పుడు విని కంగారుగా లేచిన అమ్మ పరిగెత్తుకొచ్చి డాడీని తీసుకెళ్ళి మంచంపై పడుకోబెట్టి "ఎక్కడికెళ్ళారండి రాత్రంతా మీరు రాకపోయేసరికి నాకెంత భయం వేసిందో తెల్సా రాత్రంతా మీ కోసం ఎదురుచూశాను" అని అంటుండగానే

"ఛీ నీ యమ్మ పొద్దున్నే అబద్ధమాడటానికి నీకు సిగ్గులేదే, నిద్రపోలేదంటావా, మరి మెలకువగా ఉన్నదానివైతే తలుపెందుకు తీయలేదే" అని అమ్మని నెట్టేస్తూనే

"నేనెక్కడికి పోయాననంటావా నిన్న సాయంత్రం మా ఫ్రెండ్స్ నన్ను పార్టీకి పిలిచారు. అందరం కల్సి మందు పార్టీ చేసుకున్నాం. ఫుల్‌గా తాగేసరికి నిద్రొచ్చింది. అందుకే ఇప్పుడొచ్చా. అయినా ఇవన్నీ ఇప్పుడు నీకు ఎందుకు చెప్పాలే. నేను మొగోడిని ఎక్కడైనా తిరుగుతాను, ఏమైనా చేస్తాను. అడగటానికి నీకు హక్కు లేదు ఫో ఇక్కడ్నించి" అని మరింత గట్టిగా నెట్టేశాడు.

వర్తమానం గతాన్ని జ్ఞప్తికి తెచ్చేసరికి మనసులో మంటగా అన్పించింది అర్చనకి.

గబగబా తల్లి దగ్గరకు వచ్చేసరికే కళ్ళొత్తుకుంటూనే వంటచేస్తోంది. సుధ మొఖం ఎర్రబడి కందిపోయింది.

గుమ్మంలోనే నిల్చొని తననే తదేకంగా చూస్తున్న కూతుర్ని సూటిగా చూడలేక ముఖం పక్కకు తిప్పుకుని కళ్ళు తుడ్చుకుంది.

"ఎందుకు తుడ్చుకుంటున్నావ్ అమ్మా, కారనీ ఆ కన్నీళ్ళని ఇంకా అలాగే కారనీ" అంది అర్చన తల్లినే నిశ్చలంగా చూస్తూ.

"ఏంట్రా నీకు కూడా నా మీద కోపం వచ్చిందా"? అన్నది సుధ కూతురివంక చూడకుండానే.

"మరేంటమ్మా, ప్రతిదానికీ డాడీ నిన్ను తప్పుపట్టడం? దానికి నువ్వు మారుమాట్లాడకపోవటం ఇదేం బాగోలేదమ్మా, అసలు నువ్వేం తప్పు చేశావని ఇలా తలొంచుతావు? చెప్పమ్మా చెప్పు" అంటూ నిలదీసింది.

"నేను రావటం లేటయింది. అందుకే తిట్టాడు పోన్లేమ్మా" అన్నది.

"ఏంట్రా నీకు కూడా నా మీద కోపం వచ్చిందా"? అన్నది సుధ కూతురివంక చూడకుండానే.

"మరేంటమ్మా, ప్రతిదానికీ డాడీ నిన్ను తప్పుపట్టడం? దానికి నువ్వు మారుమాట్లాడకపోవటం ఇదేం బాగోలేదమ్మా, అసలు నువ్వేం తప్పు చేశావని ఇలా తలొంచుతావు? చెప్పమ్మా చెప్పు" అంటూ నిలదీసింది.

"అదేంటమ్మా మరి డాడీకి కూడా అప్పుడప్పుడు ఆలస్యం అవుతుంది. ఒక్కొక్కసారైతే రాత్రిపూట ఇంటికే రాడు. అలాంటప్పుడు నువ్వెంత ఆరాటపడి, ఆందోళన చెందుతావు. కానీ డాడీకి ఆలస్యం అయిందని ఇంటికి రాలేదని అతన్ని తప్పు పట్టవుగా, ఓ రెండు గంటలు నీకు ఆలస్యం అయితే దానికి డాడీ నిన్ను ఇంతలా అవమానించాలా, ఇంత రాద్ధాంతం చెయ్యాలా చెప్పు" అంటూంటే

"ఔను అమ్మా, రెండు గంటల నుండి డాడీ ఇంట్లో కూర్చుని నువ్వు రాలేదూ, నువ్వు రాలేదూ అంటారే కానీ ఆఫీసుకి ఫోన్ చేసి కనుక్కోవచ్చుగా, లేదా తాను నిన్ను ఆఫీసు దగ్గర్నుంచి తీసుకురావచ్చుగా. కానీ అలా చెయ్యడు. అక్కడ నీకెందుకు ఆలస్యం అయిందో అతని కనవసరం. ఇంట్లోనే కూర్చుని ఏవేవో ఊహించుకుంటూ మాట్లాడుతాడు. అసలు డాడీ పద్ధతి నాకు నచ్చలేదు అమ్మా" అని అర్చన వెనకాలే వచ్చిన శేఖర్ అనేసరికి

"అర్చనా శేఖర్‌ల వంక సంభ్రమంగా చూస్తూ మీ డాడీలో మార్పు వస్తుందని నేను ఎదురుచూస్తున్నాను. ఎప్పటికైనా నన్నర్థం చేసుకుంటాడని ప్రతిక్షణం అనుకుంటాను. కానీ నా తప్పేంటో నాకర్థం కావట్లేదురా" దిగాలుపడింది సుధ.

"నువ్వు చెయ్యని తప్పును చేసినట్లుగా డాడీ అంటుంటే అన్నింటికీ తలొంచి చప్పుడు చేయకపోవటమే నీ తప్పమ్మా, నువ్వు దిగాలుపడ్తూ ఇలాగే కూర్చుని ఉంటే అతనిలో మార్పెలా వస్తుంది. అయినా ఒక్క మాటడుగుతాను సూటిగా సమాధానం చెప్పు? తల్లిదండ్రులు పిల్లలకి మార్గదర్శకత్వాన్ని ఇవ్వాలి కదమ్మా, మరి ఇదేమిటి, డాడీ నువ్వు ఆడదానివి నేను మొగోడిని అంటూ నిన్ను హేళన చేయటం చూస్తుంటే నాకెంత ఫీల్‌గా ఉందో తెల్సా? రేపు తమ్ముడు కూడా ఇలాగే తయారౌతాడేమో, అంతెందుకు, నేను కూడా ఇలాంటి అవమానాన్ని ఎదుర్కోవాలేమో నంటూ ఆవేశపడింది" అర్చన.

"అదేం లేదక్కా నేనేం అలా కాను, నాకు నచ్చని పద్ధతిని నేనెలా అనుకరిస్తాననుకున్నావ్? రేపటి నుంచి మమ్మికి లేటయితే నేనే వెళ్ళి తీసుకొస్తాను. కావాలంటే ఇదిగో ఒట్టు" అంటూ అక్క చేతిలో తన చెయ్యి వేశాడు శేఖర్.

అప్పుడే బయట నుంచి వచ్చిన రాజారావు కొడుకు, కూతురు మాటలు విని అవాక్కయ్యాడు. ఏం మాట్లాడాలో అర్థం కాక నోరు పెగల్లేదతనికి. – (మన్నుబువ్వ బుక్ నుండి)

# 'నా కష్టం ఎవరికీ రావద్దు'

**ఆమెకు చిన్ననాడే అప్పటికే వివాహమైన వ్యక్తికిచ్చి పెళ్లి చేశారు. అతనికీ ఆమెకూ వయసులో చాలా వ్యత్యాసం ఉంది. అతని భార్య కొద్దిరోజుల్లో చనిపోతుందని, ఆమెకు ఇద్దరు ఆడపిల్లలున్నారని, అందుకే మళ్లీ పెళ్లి చేయాలని భార్యే పట్టుబడుతోందని సంబంధం తెచ్చినవాళ్లు చెప్పారు. ఇవన్నీ అవగాహన చేసుకుని, అతన్ని పెళ్లి చేసుకోవాలా, వద్దా అనే నిర్ణయాన్ని తీసుకునేంత పరిణతి ఆమెకు లేదు. పెద్దల నిర్ణయానికి తలూపింది. తీరా పెళ్లయ్యాక తెలిసింది. అందరూ కలిసి తనను బలిపశువును చేశారని.... ఆ 'జరిగినకథ' ఆమె మాటల్లోనే..**

"మేము చాలా పేదవాళ్లం. నాన్న అసలు పట్టించుకోకపోయేది. అమ్మే మమ్మల్ని పెంచి పెద్దచేసిందని చెప్పాలి. నాకు పదిహేనో ఏడు రాగానే పెళ్లి చేసేయాలని అనుకున్నారు. ఓ గొప్పింటి సంబంధం వచ్చింది. అప్పటికే అతనికి పెళ్లయ్యింది. పైసా కట్నం అక్కర్లేదన్నారు. అయితే అతని భార్యకు ఆరోగ్యం బాగోలేదని, కొద్దిరోజుల్లో చనిపోతుందని చెప్పారు. ఆమే తన భర్తకి మళ్లీ పెళ్లి చేయాలని సంబంధాలు చూస్తుందని మాకు తెలిసినోళ్లు అమ్మకు చెప్పారు. తిండానికే మేము చాలా ఇబ్బందిపడుతున్న స్థితిలో ఆ సంబంధం మా అమ్మకు గొప్ప ఆశనే కలిగించింది. పెద్దవాళ్లంతా నన్ను అతనికిచ్చి పెళ్లి చేయాలని నిర్ణయించారు. వద్దని చెప్పేంత ధైర్యంకానీ, అవగాహన కానీ నాకప్పుడు లేదు. అందుకే పెద్దలు చెప్పినదానికి అంగీకరించాను. అలా అతనికిచ్చి పెళ్లి చేశారు. అతను నాకన్నా వయసులో చాలా పెద్దవాడు. అతని మొదటిభార్యకు ఇద్దరు ఆడపిల్లలు ఉన్నారు.

అయితే నన్ను పెళ్లిచేసుకున్న ఉద్దేశం వేరని తర్వాత తెలిసింది. మొదటిభార్య కొద్దిరోజుల్లో చనిపోతుందనే మాటలో నిజం లేదు. ఆరోగ్యం బాగోని మాట వాస్తవమేగానీ, ఆమెకు గర్భసంచి కూడా తీసేయడంతో ఇక పిల్లలు పుట్టే అవకాశం లేదు. అప్పటికే ఇద్దరు ఆడపిల్లలు. దీంతో



అంత ఆస్తికీ వారసుడి కోసం నన్ను పెళ్లి చేసుకున్నారు. వాళ్లకి ఆస్తి బాగా ఉన్న మాట నిజమే. అయితే నా భర్తకు లేని అలవాటు లేదు. అప్పటికే అతనికి ఎయిడ్స్ ఉంది. ఈ విషయం మొదటిసారి నేను గర్భవతినై ఆసుపత్రికి వెళితే తెలిసింది. నాకు కూడా హెచ్ఐవి ఉందని చెప్పారు. కడుపులో బిడ్డకు రాకుండా ఇంజక్షన్లు చేశారు. మొదటిభార్యకు కూడా ఎయిడ్సే. ఇవన్నీ దాచిపెట్టి, నన్ను ఇచ్చి పెళ్లి చేశారు. కొద్దిరోజులకు నాకూ ఆడపిల్ల పుట్టింది. అదృష్టం బాగుండి నా బిడ్డకు ఈ పాడు జబ్బు రాలేదు. అయితే ఆడపిల్ల పుట్టినప్పటి నుండి ఆ ఇంట్లో నా కష్టాలు రెట్టింపు అయ్యాయి. అంత ఆస్తిపరులైనా నేనూ, నా బిడ్డ పడుకోవడానికి కనీసం చాప కూడా ఇవ్వలేదు. కటిక నేలపైనే పడుకునేవాళ్లం. నన్నింత హీనంగా చూడడానికి కారణం నేను ఆడపిల్లను కనడమే. అప్పటి నుంచి వాళ్లకి నేనూ, నా బిడ్డ భారంగా కనిపించాం. నేను ఇంటిపనిలో ఉన్నప్పుడు నా బిడ్డ ఏడిస్తే ఆ ఇంట్లో ఒక్కరు కూడా దగ్గరకు తీసేవారు కాదు. మళ్లీసారి కూడా అమ్మాయే పుట్టింది. ఆ బిడ్డకూ హెచ్ఐవి రాకుండా ముందుగానే ఇంజెక్షన్లు తీసుకున్నా. దీంతో మా పరిస్థితి ఆ ఇంట్లో పందులకన్నా హీనంగా అయిపోయింది.

నా భర్త తాగి ఎక్కడైనా పడిపోతే అక్కడికి వెళ్లి ఆయన్ని నేనే ఇంటికి తీసుకురావాలి. ఆయనకు స్నానం చేయించి, అన్ని సపర్యలూ చేయాలి. ఇన్నాళ్లూ వాళ్ళు పెడుతున్న బాధలు ఎలాగో తట్టుకున్నా, కానీ, అభం శుభం తెలియని నా బిడ్డలు కూడా కష్టాలు పడుతుంటే చూడలేకపోయాను. అప్పటివరకూ నా పరిస్థితిని మావాళ్లకు తెలియజేయలేదు. పిల్లలిద్దర్నీ తీసుకుని అమ్మ దగ్గరకు వెళ్దామనుకున్నా. కానీ అమ్మకు నేనే కాకుండా నా బిడ్డలు కూడా భారమవుతారని ఆ ప్రయత్నం మానుకున్నా. అయితే ఇంట్లో

ఇంత చాకిరీ చేస్తూ వీళ్ల దగ్గర పడి ఉండేకన్నా, ఆ కష్టం బయటకెళ్లి చేసుకుంటే నేనూ, నా పిల్లలూ బతకగలమని నిర్ణయించుకున్నా. ఆ ఇంట్లోంచి బయటపడ్డా. ఆ చుట్టుపక్కల వాళ్లకు నా పరిస్థితి తెలుసు. ఆ ఇంటికి దగ్గరలోనే ఒక రేకుల షెడ్డు ఇంట్లో చిన్న గది అద్దెకు తీసుకుని, కూలికి వెళ్లడం మొదలుపెట్టాను. ఎలా తెలిసిందోగానీ, మా వాళ్లకు ఈ విషయం తెలిసింది. మా బంధువులు వచ్చి మమ్మల్ని ఇంటికి తీసికెళ్లారు. మోసం చేసి, పెళ్లి చేసుకుని, నా బతుకు ఇలా నాశనం చేసినందుకు స్థానిక ఐద్వా వారి సహకారంతో అత్తింటివారిపై కేసు పెట్టా. దీంతో వాళ్లు రాజీకి వచ్చి నాకూ, నా పిల్లలిద్దరికీ ఆస్తిలో వాటా ఇచ్చారు. కొన్నాళ్లకు నా భర్త, మొదటి భార్య చనిపోయారు. అత్తమామలు కూడా చనిపోయారు.

వాటాగా వచ్చిన డబ్బును బ్యాంకులో వేసి, వచ్చిన వడ్డీతో పాటు నేను కొంచెం కష్టం చేసుకుని సంపాదిస్తూ, ఆడపిల్లలిద్దర్నీ చదివించుకుంటున్నా. ఎయిడ్స్ అవేర్‌నెస్ గ్రూపు వాళ్లు నాకు హెచ్ఐవి ఉందని తెలిసి, వచ్చి కలిశారు. ఆ కార్యక్రమాలకు వెళ్లేదాన్ని. ఆ సందర్భంగా ఆ గ్రూపులో పనిచేస్తున్న ఒకతను నాకు పరిచయం అయ్యాడు. అప్పటివరకూ నాకు హెచ్ఐవి ఉంది కాబట్టి నా జోలికి ఎవరూ రాకపోయేది. అది ఒకరకంగా ఒంటరిగా ఉన్న నాకు వరమనే అనుకున్నా. కానీ ఆ తర్వాత అదేమీ అడ్డుకాదని అర్థమైంది.

అతను నాకెంతో సహాయం చేస్తున్నట్లు నమ్మించి, నా డబ్బును బ్యాంకు నుండి తీయించాడు. స్థలం కొంటే డబ్బులు కొద్దికాలంలోనే రెట్టింపు అవుతాయిని నమ్మబలికాడు. నా పిల్లల భవిష్యత్తు బాగుంటుందనుకుని అతని మాటలు నమ్మి ఆ డబ్బు డ్రా చేసి, అతని చేతిలో పెట్టాను. అంతే, ఆ తర్వాత స్థలం మాటే లేదు. స్థలం గురించి అడిగిన ప్రతిసారీ ఏదో ఒకటి చెప్పి దాటవేసేవాడు, 'నీ డబ్బులు ఏమీ కావు. పైసాకు 2 పైసలు వస్తాయి' అంటూ చెప్పడం మామూలైపోయింది.

అతను మా ఇంటికి తరచూ వచ్చిపోతున్నా ఇరుగుపొరుగు కూడా అనుమానం రాకపోయేది. కారణం నాకు హెచ్ఐవి ఉండడమే. అయితే అతగాడు మాత్రం నన్ను శారీరకంగా కూడా వేధించడం మొదలుపెట్టాడు. దాంతో ఈ విషయం నేను ఎవరికి ఎలా చెప్పాలో అర్థంకాలేదు. చెప్పినా ఎవరూ నమ్మరు కూడా. నేను మళ్లీ ఐద్వా వారి సహకారమే తీసుకోవాల్సి వచ్చింది. చాలారోజుల వరకూ ఎలా చెప్పాలో అర్థంకాక చాలా మధనపడ్డాను. చివరికి ఐద్వా సహకారంతో అతని బంధనాల నుండి తప్పించుకుని బయటపడ్డాను. ఆ డబ్బులు కూడా రాబట్టుకోగలిగాను.

'నాకే ఎందుకు ఇన్ని కష్టాలు' అని ఎన్నోసార్లు అనుకునేదాన్ని. నాకొచ్చినన్ని కష్టాలు ఏ ఆడపిల్లకు రాకూడదని అనుకున్నాను. నాలాంటి ఎందరో ఆడకూతుళ్లకు అండగా ఉంటున్న ఐద్వాలో పనిచేయాలని నిర్ణయించుకున్నాను. ఇప్పుడు ఆ సంఘంలో కార్యకర్తగా పనిచేస్తున్నా. నా ఇద్దరు ఆడపిల్లల్ని బాగా చదివిస్తున్నా. నా పెద్దకూతురు ఎంసెట్‌లో మంచి ర్యాంకు సంపాదించింది. ఈ మధ్యే డాక్టర్ కోర్సులో చేర్చాను. చిన్నకూతురు కూడా ఐఎఎస్ చదువుతానంటోంది. ప్రస్తుతం పదో తరగతి చదువుతోంది. ఆమె కోరిక మేరకు తప్పక చదివిస్తాను.

ఈ పురుషాధిక్య సమాజం ఎంతగా దిగజారిపోయిందో తెలుసుకోడానికి నా జీవితమే పెద్ద ఉదాహరణ. సమస్య వచ్చినప్పుడు సరైన అండ దొరకకపోతే జీవితం మరెంత దుర్లభంగా ఉంటుందో కూడా నా జీవితం నుండే తెలుసుకోవాలి. మన జీవితాన్ని కానీ, డబ్బును కానీ ఇంకొకరి చేతుల్లో పెట్టేటప్పుడు ఎంతో ఆలోచించుకోవాలి. ప్రతి ఒక్కరినీ నమ్మేయకూడదు."

**- సేకరణ : శాంతిశ్రీ**

**పిల్లలిద్దర్నీ తీసుకుని అమ్మ దగ్గరకు వెళ్దామనుకున్నా. కానీ అమ్మకు నేనే కాకుండా నా బిడ్డలు కూడా భారమవుతారని ఆ ప్రయత్నం మానుకున్నా. అయితే ఇంట్లో ఇంత చాకిరీ చేస్తూ వీళ్ల దగ్గర పడి ఉండేకన్నా, ఆ కష్టం బయటకెళ్లి చేసుకుంటే నేనూ, నా పిల్లలూ బతకగలమని నిర్ణయించుకున్నా. ఆ ఇంట్లోంచి బయటపడ్డా. ఆ చుట్టుపక్కల వాళ్లకు నా పరిస్థితి తెలుసు. ఆ ఇంటికి దగ్గరలోనే ఒక రేకుల షెడ్డు ఇంట్లో చిన్న గది అద్దెకు తీసుకుని, కూలికి వెళ్లడం మొదలుపెట్టాను. ఎలా తెలిసిందోగానీ, మా వాళ్లకు ఈ విషయం తెలిసింది. మా బంధువులు వచ్చి మమ్మల్ని ఇంటికి తీసికెళ్లారు. మోసం చేసి, పెళ్లి చేసుకుని, నా బతుకు ఇలా నాశనం చేసినందుకు స్థానిక ఐద్వా వారి సహకారంతో అత్తింటివారిపై కేసు పెట్టా.**

# ఉద్యమ బాటలో...


తూర్పు గోదావరి


చిత్తూరు

ఐద్వా జిల్లా మహాసభలు 13 జిల్లాలలో జరిగాయి. మహాసభ సందర్భంగా మహిళలు, బాలికలపై జరుగుతున్న హింసకు వ్యతిరేకంగా ప్రదర్శనలు, ప్రతిజ్ఞ కార్యక్రమాలు జరిగాయి.

కేంద్ర కమిటీ పిలుపుపై హింసను నివారిద్దాం - హింసలేని సమాజాన్ని నిర్మిద్దాం అనే నినాదంతో 171 సెంటర్స్ లో సదస్సులు, ప్రతిజ్ఞ కార్యక్రమాలు జరిగాయి. ముఖ్యంగా కాలేజీలు హాస్టల్స్‌లో నిర్వహించారు.

ప్రభుత్వం ఆర్భాటంగా ప్రారంభించిన జన్మభూమి సభలలో స్థానిక కమిటీలు స్థానిక సమస్యలతో పాటు డ్వాక్రా రుణమాఫీపై ఆందోళన నిర్వహించారు.

**సావిత్రి సినిమా :**
రామ్‌గోపాలవర్మ సావిత్రి సినిమా పోస్టరు అసభ్య చిత్రీకరణతో ఉన్న పోస్టరును 12 జిల్లాలలోతగులబెట్టడం జరిగింది.

ఉపాది హామీ పథకాన్ని ఎన్‌డిఎ ప్రభుత్వం 600జిల్లాలకు గాను 200 జిల్లాలకు కుదించటాన్ని వ్యతిరేకిస్తూ 6సంఘాల అధ్వర్యంలో జరుగుతున్న ఆందోళనలో ఐద్వా పాల్గొంది.

**హుదూద్ తుఫాన్ సహాయ కార్యక్రమాలు :**
విశాఖలోహుదూద్ తుఫాన్‌కి నష్ట పోయిన ప్రజలకు చేయూత నిచ్చేందుకు ఐద్వా జిల్లా కమిటీలు నగదు, వస్తు రూపేణా సహాయ మందించారు. జిల్లాల నుండి అందిన సహాయాన్ని అర్హులైన వారికి అందించటంలో స్థానిక కమిటీలు మంచి కృషి చేశారు. విశాఖ జిల్లా కమిటీ, నగర కమిటీలు తుఫాన్లో తీవ్రంగా నష్ట పోయినప్రాంతాలలో సహాయ చర్యలు చేపట్టడమే గాక ఎప్పటికపుడు సమస్యలను ప్రభుత్వ దృష్టికి తీసుకెళ్ళి పరిష్కరించారు. విశాఖ నగరం కాలుష్య కోరల్లో చిక్కకుండా మొక్కలు నాటే కార్యక్రమంలో విస్తృతంగా పాల్గొన్నారు.

ఆడపిల్ల పుట్టిందనే కారణంతో భార్యను ఇంటి నుండి గెంటి వేసిన భాధితురాలు వీణకు మద్దతుగా ఆందోళనలో తిరుపతి కమిటీ సభ్యులు పాల్గొని కేసు విజయం సాధించే వరకూ ఆమెకు అండగా నిలిచారు.


విశాఖపట్నం


రాజమండ్రి



చిత్తూరు



రాష్ట్ర మహాసభ పోస్టర్ విడుదల



తూర్పుగోదావరి జిల్లా మహాసభ



రాష్ట్ర మహాసభల జీపు ప్రచారం



నెల్లూరు మహాసభ



తూర్పు గోదావరి మహాసభ జండా ఆవిష్కరణ

– విజయనగరం జిల్లా నెల్లిమర్ల సాంఘిక సంక్షేమహాస్టల్‌లో 4 గురు బాలికలపై జరిగిన అత్యాచార ఘటనపై ఎస్ఎఫ్ఐతో కల్సి ధర్నా చేసి కలెక్టర్‌కి,మంత్రికి వినతిపత్రం యివ్వటం జరిగింది. 3 గుర్ని సస్పెండ్ చేశారు.

**టాన్యాగారి వర్ధంతి :** ఒంగోలు, సంతనూతలపాడులో వర్ధంతి సభలు జరిగియి. సంతనూతలపాడులో క్యాన్సర్‌పై అవగాహన సదస్సు జరిగింది. డాక్టరు ఉదయిని పాల్గొన్నారు.

**నగదు బదిలీ పథకం :** ఎన్‌డిఎ ప్రభుత్వం సంక్షేమపథకాలకు సగదుబదిలీని ఆధార్‌కిలింక్ చేయటాన్ని నిరసిస్తూ విజయవాడ నగరంలో నిరసన కార్యక్రమాలు జరిగాయి.

**యానిమేటర్స్ :** 70 రోజులుగా సమ్మె చేస్తున్న ఐకెపి యానిమేటర్స్ సమ్మెకు మద్దతు తెలిపింది.



'రెండు సంగతులు' పుస్తక ఆవిష్కరణ



ప్రజానాట్యమండలి కళారూపాలు



ఐద్వా పాటలతో



మహాసభల సందర్భంగా చిన్నారులతో కరాటే ప్రదర్శన





సభకు హాజరైన ప్రతినిధులు



మాంటిస్సోరి విద్యాసంస్థల అధినేత వి. కోటేశ్వరమ్మగారికి సన్మానం



మహాసభలో రిలీవ్ అయిన కార్యదర్శి స్వరూపరాణితో ఇతర నాయకులు



మహాసభల ప్రచారంలో భాగంగా గ్రామాల్లో క్యాండిల్‌లైట్ ప్రదర్శన



జండా ఆవిష్కరణ చేస్తున్న సీనియర్ నేత పుతుంబాక భారతి




అమరవీరుల స్థూపంవద్ద నివాళులర్పిస్తున్న మాలినీ భట్టాచార్య



అమరవీరుల స్థూపంవద్ద నివాళులర్పిస్తున్న సీనియర్ నాయకులు



సభలో ప్రసంగిస్తున్న ఎస్. పుణ్యవతి




ప్రతినిధుల సభలో నాయకుల అభివాదం



సంతోషిని అభినందిస్తున్న సత్యనారాయణ తదితరులు



అభినందిస్తున్న డా॥ ఉదయిని



Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Block No.24, HIG, Phase-II, 1-8-1, Baghlingampally, Hyderabad -500 044. Printed at Prajasakti Daily Printing Press, M.H.Bhavan, Plot No.21/1, Azamabad Industrial Area, Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020. Ph: 27665420. Editor : D. Rama Devi

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A145 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |